# వంకరటింకర ఓ!

• హాస్య కథలు •



చిలుకూరి దేవపుత్ర

# వంకర టింకర ఓ!

♦ హాస్య కథలు ♦

చిలుకూరి దేవపుత్ర



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,

హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

Vankara Tinkara O! (Humourous Stories) by Chilukuri Devaputra

ప్రచురణ నెం : 2350/48

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి, 2005



**వెల: రూ. 50-00**

ప్రతులకు : **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
4-1-435, విజ్ఞాన భవన్, బ్యాంక్‌స్ట్రీట్,
హైదరాబాదు - 500 001.
E-mail : visalaandhra@yahoo.com

**విశాలాంధ్ర బుక్ హౌస్**
(అబిడ్స్, సుల్తాన్ బజార్) హైదరాబాద్,
విజయవాద, అనంతపురం, విశాఖపట్నం,
హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.



అక్షరాలంకరణ : కాంపాక్ట్ గ్రాఫిక్స్, హైదరాబాద్.

ముద్రణ : శ్రీ కళాంజలి గ్రాఫిక్స్, హైదరాబాద్. ఫోన్ : 23224831

# చిరునవ్వుల చిరునామా...

బోల్డు సీరియస్ కథలు రాసిన చిలుకూరి దేవపుత్ర సరదా కథల సంపుటి ఇది. ఈ కథలు మిమ్మల్ని కనీవిని ఎరుగని ఆనంద వీధుల్లో, ఊహాలోకాలలో విహరింపజేస్తాయని పుస్తక విక్రేత ఊరించినా నమ్మకండి. ఇవి అన్నీ మీకు తెలిసిన ఇతివృత్తాలే! దీంట్లో కనబడే పాత్రలు మీ ఇంటికి ఇరుగుగానో, పొరుగుగానో ఉంటారు. కొండొకచో మీ వేషంలోనే ఉంటారు. కథలనగానే అనూహ్యమైన మలుపులుంటాయనీ, చివరికి వచ్చేసరికి పాత్రలు ఎడాపెడా లెంపలేసుకుని స్వభావాలు మార్చేసుకుంటాయనీ ఆశపడకండి.

ఇవి మీ లేదా మన జీవితాలలాగానే బలీయమైన, నాటకీయమైన సంఘటనలు లేకుండా సాదాగా సాగిపోతాయి. అతి సహజ వాతావరణంలో పుట్టి, వాటినే వర్ణించి, 'ఇది కథ కాదేమో, ఓ చిత్రకారుడు గీసిన స్కెచ్ యేమో' అనిపిస్తాయి. ఈ కథలు ఆఫీసు విడిచి సాము చేయవు. ఆఫీసు కాకపోతే ఇల్లు, అంతే! – ఆఫీసు, ఇల్లు మధ్య తిరిగే గుమస్తా లాగానే! అందుకే ఎన్జీవో బతుకులను కాచి వడపోశారు రచయిత.

'చక్కగా రుచిగా వండించడం రాకపోతే ఆర్రై (రెవెన్యూ ఇన్‌స్పెక్టర్)గా ఎట్లా పనికొస్తాడంట' అని కోప్పడ్డాడు జెసీ(జాయింట్ కలెక్టర్) గారు. (కౌజుపిట్టలు)

గుర్నాథానికి చక్కెర వ్యాధి కాబట్టి డాక్టర్లు ఆహార విషయంలో జాగ్రత్తలు పాటించాలన్నారు. ఆ విషయం ఏ జీవోలోనో, ఏ అక్టులోనో ఉండి వుంటే ఖచ్చితంగా మంచి గుమస్తాగా పాటించేవాడే! అట్లా లేవు గనుకనే ఇప్పుడిలా రోగమెక్కువై కోమాలోకి వెళ్లిపోయినాడు. (ఇట్లు....తమ విశ్వాసపాత్రుడు)

అందువల్ల ఈ కథల్లో బోల్డుమంది చిరుద్యోగులు బిలబిలలాడుతూ కనబడతారు. మంత్రిగారు వస్తున్నారని హడావిడిపడి విందు ఏర్పాట్లు చేసేవారు (మంత్రి వెడలె), జెసీ గారి కోసం కౌజుపిట్టల ఫ్రై చేసి ఇరుక్కుపోయినవాళ్ళు (కౌజుపిట్టలు), మీసాలు పెంచినందుకు ఒక అధికారి చేత మెప్పులు, మరో అధికారి చేత తిట్లు తిన్నవారు (మీసాలు) – ఇలా అనేకమంది. అయితే వీళ్లలో బాధితులు మాత్రమేకాదు, పరిస్థితులను తమ కనుగుణంగా మార్చుకోగల నేర్పు కలవారూ – అంటే సూపర్నెంటు కూతురి పెళ్లి పేరు చెప్పి దండుకునేవారూ (తివిరి ఇసుమున...) – ఉన్నారు.

గుమస్తా లక్షణం మరీ ఎక్కువయితే వచ్చే అనర్థాలను – అతిశయోక్తులతోనే అనుకోండి – చెప్పి హెచ్చరించాడు రచయిత. రేయింబవళ్ళు ఆఫీసులోనే గడిపితే పిల్లలు కూడా గుర్తుపట్టలేరని చెప్పాడు (దొంగొచ్చాడు) తనకూ పిల్లలను గుర్తుపట్టలేని స్థితి వస్తుందన్నాడు (జ్ఞాపికలు). పెళ్లాం రాసిన ఉత్తరానికైనా సరే ఏళ్ల

తరబడి జవాబివ్వరన్నాడు (ప్రేమలేఖ), కోమాలో పడివున్న గుమాస్తాలో చలనం తీసుకు రావాలంటే ఆఫీసరు వస్తున్నాడని చెబితే చాలు అంటూ వెక్కిరించాడు (ఇట్లు.... తమ విశ్వాసపాత్రుడు).

తక్కిన కథల్లో కూడా మధ్యతరగతి జీవి బడుగు జీవితమే ప్రతిఫలిస్తుంది. అతడు పోలీసుల ట్రీట్‌మెంట్ ఓ సారి రుచి చూశాక 'దొంగయితే బాగుణ్ణు' అనుకుంటాడు. కరెంటు వాళ్లు చేసే దోపిడీని అరికట్టడానికి ఇంట్లో వాళ్లు ఎత్తుకు పైయెత్తు వేస్తే నోరెత్తలేక పోతాడు (పులికి పిలక లేదు), కార్పొరేట్ హాస్పటల్స్ మాయలో పడి గొల్లుమంటాడు (అడినోవా), పక్కింటాయన తనకు బేరమాడడం రాదని మాటిమాటికీ ఋజువు చేస్తూ ఉంటే ఏమనలేక తెల్లమొహం వేస్తాడు (కాలిముల్లు), పొరబాటుగానైనా తనపేరు పత్రికలో పడితే ఎగిరి గంతేస్తాడు (గడినుడి), అవినీతి గురించి లెక్చర్లు దంచిన పెద్ద మనిషి తనే అవినీతికి పాల్పడితే నివ్వెరపోతాడు (ఎందెందు వెదకి చూచిన).

నిత్య జీవితం నుండే కథా వస్తువును ఏరుకున్న దేవపుత్ర గృహిణిపరంగా చాలా కథలే రాశారు. హైపో కాండ్రియాక్ భర్తతో వేగడం చాలనట్లు అల్లుడు కూడా అలాటివాడే దొరికితే (వంకర టింకర ఓ!) పాపం ఆ గృహిణి గతి ఏమిటి? ఊరందరూ కాన్వెంట్ల దారిపడితే ఉలిపిరి పిట్ట మొగుడు ఇంకోదారి పడితే (పిడుగులు) ఆవిడ ఘోష ఏమిటి?మతిమరుపు మొగుడితో వేగలేక తాళం చెవి తులసి కోటలో దాచే గృహిణి (శ్రీవారూ – తాళంచెవీ) ఇరుగుపొరుగువాళ్ల గురించి నాలిక కరుచుకునే సందర్భం వస్తే ఏమవుతుంది?

'ఇదంతా చూడబోతే ఈ సన్నివేశాలూ, సందర్భాలూ మనకు తెలియనివి కావే' అని మీకనిపిస్తే ఆశ్చర్యం లేదు. ఇవి మీ కథలే! ఎటొచ్చీ రమ్యంగా, చమత్కారంగా చెప్పిన కథలు. మనమీద మనమే జోకులేసుకుని నవ్వుకునే కథలు! చిరుద్యోగుల జీవితాలే చిరునవ్వులకు చిరునామా అని దేవపుత్ర మరొక్కసారి ఋజువు చేశారు. ఇతరవర్గాల్లో కంటే మధ్యతరగతి బతుకుల్లోనే మందహాసాలకు ముడిసరుకు దొరికే మాట వాస్తవమే కానీ, 'ఏకాకి నౌక చప్పుడు' వంటి ఆర్ద్రమైన కథ రాసిన దేవపుత్ర హాస్య కథలు రాయగలడా అని సందేహించేవారు 'తివిరి ఇసుమున...' కథ ఓపెనింగు చదివి చూస్తే చాలు, సందేహాలు పటాపంచలవుతాయి. ఆపైన పేజీలు ముందుకూ, వెనక్కూ తిప్పుకుంటూ మీరే చదువుకుంటూపోతారు. క్యారీ ఆన్!

సాటి పాఠకుడు
- ఎమ్బీయస్ ప్రసాద్

# కథల వరుస...

# వంకరటింకర ఓ!

సాయంత్రపు ఎండ ఏటవాలుగా బోగీలో కిటికీ పక్కనే కూచున్న నా మీద పడుతోంది. చలికాలం అవడం వల్ల ఎండలో దాదాపు వేడిమి లేదు. అయినా ఈ మాత్రం వేడిని కూడా సహించలేకపోతున్నా. మావారిని తలుచుకుంటూ వుంటే నాకు రక్తపోటు విపరీతంగా పెరిగిపోతోంది.

ఓ పక్షంరోజులు పుట్టింట్లో రెస్టు తీసుకుందామని నేను వెళ్తే, పట్టుమని పదిరోజులన్నా పూర్తికాకనే ఇంటి నుంచి ఉత్తరం - 'అమ్మా! నువ్వు వెంటనే రాకపోతే నాన్న 'ప్రకృతి వైద్యం'తో మా ప్రాణాలు పూర్తిగా తోడేస్తారు'. అని. అందుకే వెంటనే ఇలా ఈ రైలు ప్రయాణం!

"ఊరికే ఉన్న ప్రాణానికి ఉరి పెట్టుకోటం" - అంటారే సరిగ్గా అలాంటిదే మావారి తత్వం!

ఆయన ఒక్కరే ఉరి పెట్టుకుంటే 'ఏదోలే" అని తప్పించడానికి ప్రయత్నించే అవకాశముంటుంది. ఊహూ... అలా కాదు. ఎదుటి వాళ్ళ తలల్నీ కూడా ఇరికించాలని ప్రయత్నిస్తారు. అక్కడే వస్తుంది చిక్కంతానూ.

మావారికి కాస్త తీరుబడి దొరికిందా, ఏదో ఓ 'ఉపద్రవం' సృష్టించాలని ప్రయత్నిస్తుంటారు. ప్రస్తుతపు ఉపద్రవమే 'ప్రకృతివైద్యం'!

అసలు వారినని ఏం లాభం? నేను పుట్టింటికి వెళ్ళేటప్పుడే అమ్మాయిలిద్దర్నీ తీసుకు వెళ్ళాల్సింది - ఆ పిల్లలు నా మాట విని చస్తారా ఏమన్నానా? వాళ్ళ నాన్నకంటే రెండాకులు ఎక్కువ చదివినట్టు ఫోజు పెట్టి , చదువులు దెబ్బతింటాయన్నారు.

"ఏమండీ! తల చాలా నొప్పిగా వుంది" అంది నా ఎదురుగా కూర్చున్నావిడ-భర్తతో.

వాళ్ళిద్దరూ మంచి జంట అనిపిస్తోంది. అతనికి ముప్పయ్యీ, ఆమెకి ఇరవయ్యొనిమిదీ సంవత్సరాలు ఉంటాయి. వాళ్ళ ఒక్కగానొక్క సంతానమేమో, ఐదేళ్ళ అబ్బాయి ఆమె ఒళ్ళో నిద్రబోతున్నాడు.

"తలనొప్పేగా, పోతుందిలే, ఏం జేస్తుంది?" అన్నాడతను చాలా మామూలుగా....

"మీరెప్పుడూ ఇంతే.... ఏ జబ్బు వచ్చినా మీదగ్గరున్న దివ్యఔషధం "ఏంజేస్తుంది" అన్నదేగా.. రాత్రి 'జ్వరం వచ్చింది' అని చెబితే ఇదే మాట అన్నారు. డాక్టరుకి చూపిద్దాం - మందులు ఇప్పిద్దాం అని ఏనాడూ తోచదు మీకసలు!" అంది జీరబోతున్న గొంతుతో.

నేను వారి వేపు చూడని దానిలా, కిటికీ గుండా ఎటో చూస్తూ ఉండిపోయేను.

"ఎందుకే అంత ఇదవుతావు... జ్వరం ఎందుకొస్తుందసలు? శరీరం హీటవుతోందన్నమాట.... అప్పుడు ఆ హీటంతా బయటకు వచ్చేయడాన్నే 'జ్వరం' అంటాం. శరీరతత్వం తెల్సిన వైద్యులు ఏమంటారో తెలుసా! 'జ్వరం' అన్నది వచ్చిందంటే 'శరీరం విశ్రాంతి కోరుతోంది' అని తెలపడమట. అందువల్ల బాగా మంచినీళ్ళు తాగుతూ రెస్టు యివ్వడమే, మనం చెయ్యాల్సిందల్లా" అంటూ అతనలా చెబుతోంటే అదేదో గొప్ప సందేశాన్ని – నాకూ, మానవాళికీ అందిస్తోన్న ప్రవక్తలా అనిపించేడు.

"హూఁ – చాల్లెండి.....రోగాలొస్తే మీలాగా ఉపన్యాసాన్ని మందుగా యిచ్చి బాగుచేయటం ఎవ్వరికైనా చేతనవుతుందా?" అంటూ ఈసడింపుగా మెల్లగా అంది–గొణుగుతున్నట్టు.

నాకా క్షణంలో ఆమె రాక్షసిలాగూ, అతను దేవుడులాగూ కనిపించేరు.

అలా కనిపించడానికి కారణం మావారే!

ఇంట్లో ఎవరికైనా ఏ కాస్త జలుబు చేసిందా?వెంటనే ఏ అలోపతి మెడిసన్ కోల్డరిన్నో, ఏ హోమియోపతిమందు 'ఇపిక్' నో వాడందే ఊరుకోరు మావారు.

పొరపాటున నా చిటికెన వేలు వెంట్రుకవాసి అంత తెగిందా చాలు – ఒకటే కంగారు పడిపోయి 'ధనుర్వాతాన్ని నిరోధించే ఇంజక్షన్' చేయించాల్సిందే – బత్తాయి పండంత సైజులో బ్యాండేజీ వేసి తీరాల్సిందే!

ఎంత ఘోరమైన పొరపాటు నయినా సహిస్తారు కానీ మావారు రోగమొస్తే డాక్టరు దగ్గరికి వెళ్ళకుంటే ఏ మాత్రం సహించరు.

అతి చిన్నగా తలనొప్పి వచ్చినా ఇంట్లో చెప్పుకోవాలంటే భయం!....డాక్టర్లకీ, మెడిసిన్లకీ ఓ యాభై ఖర్చుపెట్టందే నిద్రపోరు.. అదీ ఆయన స్వభావం.

అలాంటి మావారిని చూసీ – ఇతన్నీ చూస్తోంటే దేవుడిలా కాక ఇంకెలా కనిపిస్తాడు ఎవరికైనా!

రైలాగింది....

హమ్మయ్యా..అనంతపురం వచ్చేసింది!

సూట్‌కేసు తీసుకుని నెమ్మదిగా దిగేను.

రైలు స్టేషన్‌లో ఆగితే ఎంత సందడిగా వుండాలో అంత సందడీ ఉంది. మావారు వచ్చివుండరని నా గట్టి నమక్కం. అయినా ఆశతోటి వెదికేను.

నాకు ఎదురుగా వస్తున్నాడో మనిషి – అచ్చం మావారిలానే ఉన్నాడు. 'ఏమండీ!' అనబోయి తమాయించుకున్నాను. అతనొచ్చి నా చెంత నిలబడ్డాడు. ఎవరి కోసమో! మావారికీ, ఈ మనిషికీ తేడా ఏమిటంటే మా వారు కొంచెం లావు... ఈ మనిషి సన్నం...మొహం అంతా పీక్కుపోయి.. 'ప్రేతకళ' ఉట్టిపడుతోంది.

అతను నన్ను చూస్తూ నిలబడ్డాడు.

"భగవాన్! నేను మావారేమోనని భ్రమపడ్డట్టు, ఈ మనిషీ నన్ను తన పెళ్ళాంగా భ్రమపడలేదు కదా!"

'ప్రేతకళ' మనిషి నవ్వేడు-

నేను నవ్వలేదు - నాకు మండుతోంది ఆ నవ్వు చూస్తోంటే....

నా సూట్‌కేసుని చేతిలోంచి 'టపీ'మని లాక్కొని హడావిడిగా వెళ్ళిపోతున్నాడు. అంతే క్షణంలో నేను తేరుకొని, కోపం తెచ్చుకొని "ఎవరయ్యా! నువ్వు నా సూట్ కేసు..." అని అనబోయి, మాటలు అంతదూరం స్టేషన్ గోలలో వినిపించవని జ్ఞానోదయమై వడివడిగా అడుగులు వేసేను.

స్టేషన్ బయటికి వచ్చేసేను....'ప్రేతకళ' మనిషి అక్కడున్నాడు!

"ఏమిటీ అఘాయిత్యం" అన్నాను కోపంతో.

అతని చేతిలోని సూట్‌కేసు వడిసి గుంజేసుకున్నాను.

"ఏం దుర్గా! అఘాయిత్యం ఏమిటి?" అన్నాడు 'ప్రేతకళ' మనిషి.

ఆ కంఠం అచ్చం మావారిదే! "ఏ.....ఏమండీ.....మీ...మీరేనా? అన్నాను తడబడుతూ.

"అవునే, మొద్దుమొహమా! కట్టుకున్న మొగుణ్ణి గుర్తుపట్టలేవూ?" అంటూ నవ్వుతున్నారు. ఎడారిలో వెన్నెల్లా వుందా నవ్వు.

అప్పుడు పోలికలు వెదుక్కుని మావారేనని మరీ దృఢపరచుకుని - "ఇదేమిటండీ ఇలాగయిపోయేరు? మరీ అరవై లంఖణాలు చేసిన వారిలా.... ఏమయింది మీకూ...ఏ విషజ్వరమో రాలేదుకదా?" అంటూ దగ్గుత్తికతో అరిచేను. అసలు బావురుమని ఆయన భుజం మీద వాలి ఏడ్చేద్దామనిపిస్తోంది - అక్కడ రద్దీ లేకపోయుంటే!

మావారు అచ్చంగా 'భట్టి విక్రమార్క' సిన్మాలోని భేతాళుడిలా నవ్వేరు. ఈ నవ్వు అలా వుండటంలో ఆయన తప్పేముందీ? ఆ ముఖంలో ప్రేతకళ వుందాయె మరీ!

"ఏమండీ... మాట్లాడరూ ...ఆ నవ్వడమేమిటి?" అన్నాను చిరుకోపం ప్రదర్శిస్తూ.

"నాకేమయిందే పిచ్చిదానా!" అన్నారాయన నిశ్చలంగా.

"మరి మీరిలా?"

'ముందు వెళ్దాం..పద... ఆటోలో వెళ్తూ మాట్లాడుకుందాం!"

ఇద్దరం ఆటోలో బయల్దేరాం....

"ఇప్పుడు చెప్పండి!" అన్నాను.

"దానికో కారణముందోయ్! మొన్న నా ఫ్రెండ్ ప్రసాదరావు వచ్చేడు. వాడు ఓ నెలకిందట బెంగుళూరు వెళ్ళి, అక్కడ ప్రకృతి వైద్యం వంట పట్టించుకుని వచ్చేడు. ఆ ప్రకృతి వైద్యం నాకూ నచ్చింది. ఎలాగూ బెంగుళూరు వెళ్ళేంత తీరిక

లేదు. కాబట్టి వాడి ద్వారా తెలుసుకున్న వైద్యాన్ని ఇంప్లిమెంట్ చేసేను. అంతే! ఇలాగయిపోయేను. అయినా ఈ వారంరోజుల్లో నేను తిన్నది ఏమున్నది గనుక.... ఉదయం లేస్తూనే ఉడకేసిన యాపిల్ పండు ఒకటీ...మధ్యాహ్నం ఓగ్లాసుడు పాలూ, సాయంత్రం ఓ ఉడకేసిన బంగాళ దుంప!" అంటూ ఆయన చెబుతూంటే నాకు తల తిరిగిపోయింది.

"ఇప్పటికే మన ఇంట్లో అల్లోపతీ, హోమియోపతీ, ఆయుర్వేదం వాడుతూనే వున్నాం కదా..మరీ ఈ ప్రకృతి వైద్యం ఎందుకండీ!" కాస్త విసుగ్గా.

"ఏ వైద్యమైనా మానవ శ్రేయస్సుకేగా - అందుకే ప్రకృతి వైద్యాన్ని ఇంప్లిమెంటు చేయటం!"

ఇంకేం మాటాడాలో తోచక మౌనంగా వుండిపోయేను. మళ్ళీ మావారే అన్నారు- ఇప్పుడు ఇంట్లో అందరూ వెరీ డిసిప్లిన్డ్, తెల్సా? చెప్పడమెందుకులే నువ్వే చూస్తావుగా!" ప్రేతకళ మొహంలో గర్వరేఖని వెలిగిస్తూ!

ఇంటి దగ్గర నన్ను దింపేసి 'ఇప్పుడే వస్తా'నని చెప్పేసి, ఎక్కడికో ఆటోలోనే వెళ్ళిపోయేరు.

ఇంట్లోకి అడుగుపెడుతున్నట్టే మా రెండో అమ్మాయి సులక్షణ, మూడవ అమ్మాయి సుగుణ నన్ను కావిలించేసుకుని బావురుమన్నారు. తమ పరిస్థితి చాలా దారుణంగా వుందంటూ ఒకటే ఇదయిపోయేరు. ఎముకల గూళ్ళుగా అయిపోయిన పిల్లల్ని చూస్తోంటే నా కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లేయి!

"కాస్త నిదానంగా చెప్పండర్రా!" అన్నాను - వాళ్ళ తలల్ని నిమురుతూ.

"మునుపటిలా లేదే మన ఇంటి వ్యవహారం, అంతా మారిపోయింది.. పొద్దున్నే ఇంత కాఫీ, టిఫిన్ చేసే వాళ్ళమా? ఇప్పుడలా కాదమ్మా! ఏకంగా పది గంటలకి భోజనం చేసేయడమే!"....

అని సుగుణ అంటూ వుండగానే సులక్షణ అందుకుంది - "ఆకలేస్తుంది గదా అని గబా గబా తినేయకూడదట.... నెమ్మది నెమ్మదిగా ఒక్కో ముద్ద నమిలీ, నమిలీ మింగాలట...నాన్న దానికో సూత్రం చెబుతాడే.

ద్రవపదార్థాలని నమలాలట, ఘన పదార్థాలని తాగాలట?....."

వెంటనే సుగుణ అంది - "తిన్నంత సేపూ నీళ్ళు తాగరాదట. తిన్న తర్వాత ఓ గంట గడిచాక రెండు లీటర్ల నీళ్ళు తాగాలట. పాపం! అలా చేసినందుకు అక్కయ్యకి ఓ సారి వాంతి అయ్యిందే! అయినా నాన్న వదల్లేదు... ఇక సాయంత్రం అయిదు గంటల వరకూ మధ్యలో ఏమీ తినరాదుట..... ఐదింటికి మళ్ళీ 'నమిలీ, నమిలీ' భోజనం చేయడం..."

వాళ్ళలా చెబుతోంటే నాకు మూర్ఛ వచ్చినంత పనయింది!

"అలాగా - అయ్యయ్యో!" అన్నాను అప్రయత్నంగా.

"అప్పుడే 'అయ్యయ్యో' అంటే ఎలాగే...ఇంకా చెప్పవలసింది ఎంత వుందనుకున్నావ్..వేపుళ్ళు చేసి భోజనంలో నంచుకోగూడదట...అందులో

విటమినులూ అవీ నశిస్తాయట... పచ్చి కూరగాయల్ని కొరుక్కుని తినేయాలట... అసలు మనిషికి ఇలా వండుకు తినడం అన్నది, అసహజమైన ఆహారమట..." అంటూ పిల్లలిద్దరూ డగ్గుత్తికలతో చెబుతూంటే ఎంత రాతి గుండె అయినా ఎలా వుంటుంది, కరగకుండా! అందునా కన్నతల్లినైతిని!!

రాత్రి పడుకోబోయే ముందు ఆయన పక్కనే కూచుని అన్నాను – "మీరిలా చేయడం ఏం బావులేదు!"

"ఏం చేశానే దుర్గా!" అన్నారు, హిట్లర్ వేషంలో వున్న చార్లీచాప్లిన్‌లా మొహం పెట్టి.

"మీ ప్రకృతి వైద్యంతో పిల్లలిద్దరూ హడలెత్తిపోయారు...పెద్దమ్మాయి పెళ్ళయి పోయింది కాబట్టి బతికిపోయింది...అసలు మీ విషయమే తీసుకోండి, దూలంలా వున్న మనిషి పూచిక పుల్లలా అయిపోయేరు" అంటూ నాందీ ప్రస్తావనగా అన్నాను.

మావారేం తక్కువ తిన్నవారా ఏమన్నా? కొననాలిక మీదున్న మాటని చూసి, మనసు అడుగు భాగంలో ఏం మాట వుందో అవలీలగా చెప్పగల ఘటికులు! అందుకే – ఓసారి శాంపిల్‌గా నవ్వి –"దుర్గా! పూచిక పుల్లలా వున్నానా?మరి ఏమిటనుకున్నావ్ ప్రకృతి వైద్యమంటే! ఆ ప్రసాదరావుగాడు చెప్పేయగానే నేనేం ఊరికే నమ్మేశాననుకున్నావా? ప్రకృతి వైద్యం మీద బోల్డు పుస్తకాలు చదివేసి మరీ ఆచరణకి పూనుకున్నా...మనలాంటి వాళ్ళకి ప్రకృతి వైద్యం మినహా మరొకటి పడదని నా ఉద్దేశం! మన పిల్లలు చూడు, ఎంత స్లిమ్‌గా తయారయేరో!"

"అవునవును, ఇంతకు మునుపే వాళ్ళకి పావుసేరంత కండ లేదు వంట్లో. ఇప్పుడు ఆ 'వైద్యం' పుణ్యమా అని ఎముకల గూడులా అయిపోయేరు....వాళ్ళు పెళ్ళికి కాదండీ పనికొచ్చేది. బ్రతికుండగానే ఏ జూవాలజీ లేబ్‌లోనో...వుంచడానికి పనికొస్తారు!" అంటూ నేను విసురుగా మాటాడేసరికి –

"నువ్వెప్పుడూ ఇంతే – ఏ వైద్యాన్ని నమ్మేవు గనుక!" అంటూ అవతలికి తిరిగి పడుకున్నారు.

ఈయనకీ వైద్యాల పిచ్చొకటి – కొన్నాళ్ళు అలోపతీ, కొన్నాళ్ళు ఆయుర్వేదం, కొన్నాళ్ళు హోమియోపతీ, మరికొన్నాళ్ళకి అన్నిటినీ కలిపి ప్రయోగిస్తూ వుంటారు. ఇప్పుడీ ప్రకృతి వైద్యం! మా అదృష్టం కొద్దీ, యునానీ, ఆక్యుపంక్చర్ వైద్యాలు మా గడప తొక్కలేదు. అలాగని నిశ్చింతగా ఉండడానికి కూడా ఏ మాత్రం వీల్లేదు....ఈ ప్రసాదరావులాంటి వారెవరో ఇక్కడికి రాకనూ పోరూ, వాటిని మా వారికి వంటపట్టించకనూ పోరూ.

ఒక్క మాటలో మావారిని గురించి చెప్పాలంటే – ఆయనకి 'దైవచింతన' కంటే 'దేహ చింతన' ఎక్కువ!

మా నాలుగు అల్మారాలలోనూ, నిండుగా వున్న పుస్తకాలన్నీ ఏదో ఓ వైద్యానికి సంబంధించినవే. మార్కెట్లో ఏ రకమైన వైద్య పుస్తకం వచ్చినా, మరుసటి రోజున మా ఇంట్లో వుండి తీరాల్సిందే, ఇక పేపర్లలో....ఏ పేపర్లోనైనా కాన్సర్ గురించీ, 'క్షయ' ని గురించీ, కళ్ళ జాగ్రత్తల గురించీ, పళ్ళ ఇగుళ్ళ గురించీ వ్యాసాలు

వచ్చాయా! వాటిని జాగ్రత్తగా కత్తిరించి పదిలంగా ఫైలు చేస్తారు. మా అయిదో అల్మారా నిండా ఆ ఫైళ్ళే.

ఓరోజు ఉదయమే - ఉన్నట్టుండి మా వారి గొంతు నించి పెద్ద గావుకేక వినబడేసరికి చచ్చే చావెరగక తిరగమోత పెడుతున్న దాన్నల్లా పడుతూ లేస్తూ వెళ్ళేను - బయటి గదిలోకి.

అద్దం ముందు సుబ్బరంగా నిలుచుని వున్నారు ఆయన ! గుండె దడదడ లాడుతుండగా అలా ప్రశ్నార్థకంగా చూస్తూ ఉండిపోయేను.

మావారు - అనుమానం, ఆదుర్దా కలగలిసిన స్వరంతో "దుర్గా! చూసేవుటే, మెడ దగ్గర వుండే ఈ పుట్టుమచ్చని! దీన్ని నేను ఇన్నాళ్ళు ఎంత నెగ్లెక్ట్ చేశానే!" అన్నారు, మెడమీద వున్న కంది బద్దంత పుట్టుమచ్చని చూపిస్తూ.

"పుట్టుమచ్చని నెగ్లెక్ట్ చేయడమేమిటండీ! అది దాని స్థానంలోనే వుందిగా.. పక్కకేమయినా జరిగిందా?'

"నేను చెప్పేదేదీ పూర్తిగా వినవ్! పుట్టుమచ్చలు జరగవు కానీ, అవి పెరిగి పెద్దవయితేనే ఇబ్బందంతాను" అంటూ మెడను జిరాఫీలా పెంచి మళ్ళీ చూపించేరు.

చూసేను.

"ఎలా వుందీ?" అడిగేరు కళ్ళెగరేసి.

"నల్లగా వుంది"

"నీ మొహం! పుట్టుమచ్చలు నల్లగా కాక తెల్లగా వుంటాయిటే ఎక్కడైనా? అది వెడల్పుగా అయిందేమో చెప్పు!"

"అలాగేమీ అనిపించడం లేదే!"

"బాగా చూడూ...పెసర బద్దంత వుండేది మునుపు... ఇప్పుడు కందిబద్దంత వెడల్పు అయ్యింది!"

"అదేం లేదు లెండి... నేను ఎప్పణ్ణుంచో చూస్తున్నా కదా! అంతే ఉంది... అయినా మీకేం నష్టం? కంది బద్దంత కాకపోతే చిక్కుడు బద్దంత కానీ లెండి!"

"ఎంత మూర్ఖురాలవే నువ్వు..." అంటూ కాసేపు వింతగా చూస్తూ... "చదువుకున్నదానివే - ఏ పత్రికలో ఏ వ్యాసం వస్తుందో తెలీదా...నిన్న డైలీలో వచ్చిన వ్యాసం 'కాన్సర్ లక్షణాలు' అన్నది చదివేవా?....అందులో...'కాన్సర్' ని గుర్తించడానికి కొన్ని పాయింట్లు ఇచ్చేరు. వాటిలో ఓ పాయింట్ - 'పుట్టుమచ్చ పెద్దదవుతోంటే కాన్సర్ కావచ్చు' అని వుంది... ఇదీ కాన్సరేమోనే... అదే నాకు అనుమానంగా వుంది" అంటూ మళ్ళీ ఆ మచ్చనే అద్దంలోంచి చూస్తూ వుండిపోయేరు.

"చాల్లేండి మీదంతా చాదస్తం...ఎప్పుడూ ఆ వ్యాసాలు చదవడం, ఇలా అనుమానిస్తూ వుండడం. అదేం కాదులే!"

"నీకట్లాగే అనిపిస్తుంది. ఇది కాన్సరయితే అప్పుడు తెలుస్తుంది నీకు. ఇట్లాంటి వాటి విషయంలో నెగ్లెక్ట్ చేస్తే ఇంకేమయినా వుందా! తెలిసి, తెలిసి ప్రాణాలు పోగొట్టుకోవడమే!"

ఇంతలో - తిరగమోత పొయ్యి మీద పెట్టిన సంగతి జ్ఞాపకం వచ్చి, వంటింట్లోకి పరుగుతీశాను.

ఆ రోజు ఆఫీసుకి సెలవుపెట్టేసి డాక్టరు దగ్గరికెళ్ళి ఆ పుట్టుమచ్చ తాలూకు వ్యవహారం కాన్సర్ కాదని నిరూపించుకున్నదాకా ఆయనకు తృప్తిలేదు. అన్ని టెస్టులకీ, డాక్టరు ఫీజుకీ వందరూపాయలు ఖర్చు పెట్టారని తెలిసి ఆ రాత్రి నిద్రపట్టలేదు నాకు.

ఇలా అనుమానాల జబ్బు ఆయన ఒక్కడితోనే అయితే ఏదోలే అనుకోవచ్చు. అయితే, అది మాపిల్లలిద్దరికీ వ్యాపించింది. (పెద్దమ్మాయికి సుజాతకీ వ్యాపించింది అయితే - అది ఇక్కడ లేదు.. కాబట్టి అది మొగుడి రిస్కు) ఏ పత్రికలోనైనా 'చెకుముకి' అన్న కొత్త జబ్బు ఆఫ్రికావాళ్ళకో, ఆస్ట్రేలియా వాళ్ళకో వచ్చిందని, దాని రోగ లక్షణాలు 'ఫలానా' ని అని వచ్చిందో - మా పిల్లలకి, ఆ చెకుముకి జబ్బు మరుసటిరోజే వచ్చేసి వుంటుందంతే! ఈ వైద్య వ్యాసాలూ, పుస్తకాలూ చదివినప్పుడల్లా వాళ్ళ అనుమానాలు మరీ ఎక్కువయిపోతుంటాయి. వాళ్ళకెప్పుడూ చిట్టిపొట్టి రోగాలు వచ్చినట్టు అనిపించవు. చిన్నగా దగ్గువస్తే అది 'టీ.బీ.' అయి వుంటుంది. కడుపు నొప్పి వస్తే అది 'అల్సర్' అయివుంటుంది. లేదంటే ' అపెండిసైటిస్' అయి వుంటుంది. ఎప్పుడైనా జలుబు చేసి గొంతు నొప్పి వస్తే అది గొంతు కాన్సరయి వుంటుంది. ఏదైనా దెబ్బ తాలూకు పొక్కు వుండిపోయి తెల్లటి మచ్చ శరీరం మీద ఎక్కడయినా కనబడిందా, దానిని గిల్లి, రక్కి, సూదులతో పొడిచి, అది కుష్టు కాదని నిర్ధారించుకుని గాని తృప్తి పడరు. ఇంకా ప్రపంచంలో పెద్దజబ్బు అయిన పక్షవాతం, బ్లడ్ కాన్సర్, ఎయిడ్స్ వగైరాలు కూడా మా పిల్లల దృష్టినుంచి తప్పించుకోలేవు.

ఉదయం ఏడుగంటలయింది.

ఇంట్లో ఉల్లిపాయలు కలికానికూడా లేవు. మార్కెట్టుకి వెళ్ళి తెమ్మని చెబుదామంటే మావారు అయిపు లేరు. 'ఎక్కడికి వెళ్లేరా?' అని వరండాలోనూ, మూడు గదుల్లోనూ చూసేను. ఊహూ... కనిపించలేదు. "ఎక్కడికెళ్ళా రింత పొద్దున్నే?" అంటూన్న నా గొణుగుడికి జవాబుగా...'నాన్న పెరట్లో వున్నార' ని చెప్పింది సుగుణ.

గబాగబా పెరట్లోకి వెళ్ళి చూద్దును కదా -

గెడ్డానికి సబ్బు పట్టించుకుని, షేవ్ చేసుకోవడం కోసం రేజర్ని అలా చేత్తో పట్టుకుని, శిలలా ఎటో చూస్తూ వుండిపోయేరు - ఏదో రేజర్ కంపెనీకి అడ్వర్టయిజ్‌మెంట్‌కు పోజు ఇస్తున్నట్టు.

మావార్ని అంతగా 'స్టన్' చేసిన దృశ్యమేమిటా అని ఆయన చూస్తున్న వేపు చూసేను. పక్కింటి రామారావు, సరిత, వాళ్ళ ఏకైక పుత్రిక నాలుగేళ్ళ పద్మ పళ్ళు తోముతున్నారు.

"పక్కింటివాళ్ళు ఎంత సపరివారంగా పళ్ళు తోమితే మాత్రం మీరలా చూడాలా?" అన్నాను.

ఆయన తెప్పరిల్లి ఇలలోకి అప్పుడే వచ్చినట్టు - "చూడవే దుర్గా! వాళ్ళ కుటుంబం ఎంత ముచ్చటగా..."

"అవును, చిన్న కుటుంబం ముచ్చటగానే వుంటుంది!"

"అది కాదే నా పాయింటు. వాళ్ళు పళ్ళు తోమే తీరు...."

ఆయన ఆ మాట అనగానే నా గుండెల్లో పరిగిడుతున్న రైళ్ళు!!!

"బావుందండీ! పళ్ళు తోమటంలో ఒకతీరూ తెన్నూ ఏముంటుందీ?" అన్నాను పాయింటు దాట వేయాలని.

"అది కాదు దుర్గా! గంట సేపయింది వాళ్ళలా పళ్ళు తోముతూనే వున్నారు. ఆ పసిదానికి తోమిస్తూనే వున్నారు" అన్నారు పరవశంతో.

పరిగిడుతోన్న రైళ్ళు 'ఢీ' కొంటున్నట్టు వులిక్కి పడ్డాను. ఏదయితే ఇన్నాళ్ళూ మా వారి కంట పడకూడదనుకున్నానో అదే కంటపడింది. ఇంకేమిటి మాకుదిక్కు!!!

మా వారికి 'దేహచింత' నయితే, ఆ రామారావుకి 'దంత చింతన' ప్రధానమైన విషయం. దేహంలో దంతాలూ ఒక భాగమని ఇన్నాళ్ళూ మా వారు గుర్తించకపోవడం మా అదృష్టం. అయితే ఈ నాటితో మా అదృష్టానికి పోగాలం దాపురించింది. మావారికంటే రామారావు పన్నెండాకులు ఎక్కువగానే చదివారు. (ఒక దంతాల విషయంలోనే సుమండీ!) అందరికీ జీవితంలో పళ్ళు తోమడం ఒక కార్యక్రమమైతే, రామారావు ఫ్యామిలీది మాత్రం పళ్ళు తోమడమే జీవితం లాగుంటుంది!

రామారావు తెల్లవారి లేస్తూనే, ముగ్గురి టూత్ బ్రష్షుల్నీ ఓగ్లాసులో నీళ్ళు పోసి అందులో నానబెట్టేస్తారుట. ఓగంటసేపు అవి బాగా నాని, మెత్తబడ్డాక, ఇక అసలు కార్యక్రమం మొదలవుతుందట. ముందు మెత్తటి టూత్ పౌడర్‌తో ఓ అరగంట తోమి, తర్వాత టూత్ పేస్టుని బ్రష్షుల మీదికి ఎక్కించి చకచకా తోమడం మొదలు పెడతారుట. అలా ఓ గంటన్నర తోమేక, ముగ్గురికీ ఒక్కసారి తృప్తి అనిపిస్తే, అప్పుడు ఆ కార్యక్రమానికి స్వస్తిచెప్పి, తర్వాత నాలికని వేళ్ళతో ఓ పావుగంట, టంగ్‌క్లీనర్‌తో పావుగంట తోమీ, రుద్దీ గీసి ఆ తర్వాత ఇగుళ్ళని చూపుడు వేలితో 'మసాజ్' చేస్తారట - మంచి రక్త ప్రసరణ కోసం. ఇలా పూర్తవుతుందన్న మాట వాళ్ళ 'తోముడు కార్యక్రమం'. అంతటితో ఆ రోజు గడిచిపోతుందనుకుంటే పొరపాటే. మళ్ళీ రాత్రి భోజనానంతరం అదేపద్ధతిలో తోమి తరిస్తారట...ఈ విషయమంతా వారం క్రితం రామారావు భార్య సరితే చెప్పింది. ఆమె అలా చెబుతోంటే నాకు గుండెల్లో దడ మొదలయింది. ఇదంతా మా వారికి తెలిస్తే ఇంకేమైనా వుందా! నెలకీ ఓ వంద రూపాయలు 'దంత ధావనం' కోసమే ఖర్చుపెట్టేయ్యరూ. ఖర్చు మాటలా వుండనీ గాక, 'దంత ధావనం' మీద లెక్చర్లిస్తూ ఎదురుగా నుంచుని గంటల కొద్దీ తోమిస్తారు!... అదీ నా భయం!

అయితే ఈ రోజు భయపడ్డంతా అయింది. ఇంకేమిటి చెప్మా మా గతి అనుకుంటూ, ఎన్నడూ పొరపాటు నైనా కూడా నా మీద దయచూపని "భగవాన్"ని ఎందుకైనా మంచిదని స్మరించుకుంటూ - ఏమెరుగని దానికి మల్లే అక్కణ్ణించి జారుకున్నాను.

★ ★ ★

"అదీ, తోమడం అంటే అలా వుండాలి. అప్పుడే మన పళ్ళు తళతళలాడేది, మన ఇగుళ్ళు మిలమిల లాడేది...ఇన్నాళ్ళూ పళ్ళు తోమడం అంటే ఏమిటో తెలీక మొక్కుబడి తీర్చుకున్నట్టు తోముతున్నాం... నిన్న రామారావుని అంతా అడిగి తెలుసుకున్నాలే"

ఆయన అలా అంటూ, పారవశ్యంతో సంచిలోంచి నాలుగు కొత్త టూత్‌బ్రష్షులూ, రెండు టూత్‌పౌడర్ టిన్నులూ, మూడు పెద్ద టూత్‌పేస్టు గొట్టాలు బయటకు తీస్తున్నారు.

"ఇప్పుడివన్నీ ఎవరు తెమ్మన్నారు? ఎంత డబ్బు తగలేసేరండి...!" అంటూ నేను నెత్తీ నోరు బాదుకుంటూంటే-

ఆయన నింపాదిగా నవ్వి - "డియర్ దుర్గా! మన ఆరోగ్యమే మన మహాభాగ్యము... యు...నో...ఇన్నాళ్ళూ 'ఒంటి' ని గురించి మాత్రమే తెలుసుకున్నా, రామారావు పుణ్యమా అని 'పంటి' ని గురించి కూడా తెలుసుకున్నా!"

'కంటి' ని గురించి ఏ భీమారావు చెప్పలేదా!" అని గొంతు చించుకుని అరుద్దామనిపించింది. మొండివాడు రాజు కన్నా బలవంతుడట. అరిచీ, అరిచీ నా నోరు నొప్పించాల్సిందే కాని, లేశ మాత్రమైనా ఈ మనిషిలో మార్పు వుండదని తెలిసి గమ్మున వుండిపోయేను.

"సరిత మీద జాలి పడ్డానికి ఇన్నాళ్ళూ నేనైనా వున్నాను. ఇప్పుడు నా మీద జాలిపడే ప్రాణి మచ్చుకైనా వుందా, ఈ భూప్రపంచంలో ...భగవాన్!" అనుకుంటూంటే నా కళ్ళల్లో నీళ్ళు తిరిగేయి.

"అసలు రామారావు అంటే ఏమిటో అనుకున్నానే దుర్గా! ప్రతిచిన్న విషయంలోనూ ఎంత శ్రద్ధ వున్నవాడనుకున్నావ్! వాళ్ళమ్మాయి ఎప్పుడయినా చింతపండు అడిగితే వేడినీళ్ళలో శుభ్రంగా కడిగి కానీ ఇవ్వరుట. అసలు వాళ్ళు కాచి చల్లార్చిన నీళ్ళేనట తాగేది. మనమూ ఇకనుంచీ అలా చేస్తే పోలా" అంటూ ఆయన చెబుతోంటే - అడవుల్లోకి పారిపోలేని నా అశక్తత మీదా, అసమర్థత మీదా నాకే రోత పుట్టింది.

మా అమ్మాయిలిద్దరూ బిక్క మొహాలేసుకుని బలి పశువుల్లా నా వేపు చూస్తున్నారు.

## 3

ఆ రోజు ఆదివారం.

తెల్లారి లేచిన దగ్గర్నుంచి ఊపిరి సలపకుండా ఒకటే పనుల్లో పడిపోయాం ఇంటిల్లిపాదీ. ఉదయం తొమ్మిది గంటలకి సులక్షణకి పెళ్ళిచూపులకు ధర్మవరం వాళ్ళు వస్తామన్నారు. అందుకే అంత హడావుడి.

గంపెడు క్యారెట్లని కోరుతున్నాను - హల్వా కోసం. పెళ్లి చూపులంటే ఎక్కడైనా ఏ బూందీ లడ్డో, ఏ మైసూర్ పాకో, ఏ జాంగ్రినో చేస్తారుకానీ, ఇలా క్యారెట్ హల్వాలు ఎక్కడైనా చేస్తారా?

ఆమాటే అంటే మా వారు 'ధాం ధూం' అంటూ నామీద ఒకటే ఎగురుడు!- "లడ్డూ, మైసూర్ పాకుల్లో ఏమున్నాయి విటమిన్సూ, మినరల్సూ...క్యారెట్ హల్వాలో ఎన్ని విటమినులున్నాయి, ఏం కథా! అసలు కంటి చూపుకి అతి ప్రధానమైన 'ఎ' విటమిను వుంది" అంటూ ఆయన గ్రంథం విప్పుతోంటే - తెల్లజండా ఎత్తేసి ఓటమిని అతి శీఘ్రంగా అంగీకరించేసేను.

తొమ్మిది గంటలకి ఠంచనుగా పెళ్ళిచూపుల వాళ్ళు రానే వచ్చేరు...

ఎప్పటిలాగే సులక్షణను వాళ్ళ ముందు కూచోబెట్టేం...

పెళ్ళి కొడుకు చూడముచ్చటగా చక్కగా వున్నాడు. - ఆ కుర్రాడికి ఆంధ్ర బ్యాంకులో క్యాషియర్‌గా ఉద్యోగమట.

కారెట్‌హల్వా తెచ్చి వచ్చిన వాళ్ళందరికీ పంచేను.

"చాలా బాగుంది" అన్నాడు పెళ్ళి కొడుకు హల్వాని రుచి చూసి.

పెళ్ళి కొడుకు అమ్మా, నాన్నా కూడా 'ఆ మాట నిజం' అన్నట్టు తలలు ఆడించేరు.

నేను బోల్డెంత సంబరపడిపోయి కారపు బూందీ తేవడానికి వంట - ఇంట్లోకి దూరేను. చిన్ని చిన్ని ప్లేట్లలో బూందీని పోస్తూ వుంటే - "అమ్మా! అమ్మా!!" అంటూ సుగుణ వచ్చింది వగరుస్తూ.

"ఏమే!" అన్నాను తల ఎత్తకుండానే.

"నాన్న ఆ పెళ్ళి వాళ్ళతో క్యారెట్టు ప్రత్యేకతని గురించి మాట్లాడుతున్నారే పెళ్ళి విషయాలు మర్చిపోయి" అంది.

పక్కలో బాంబు పడ్డట్టు ఉల్కిపడ్డి, ట్రేలో ప్లేట్లను వుంచుకుని బయట గదిలోకి పరిగెత్తుకు వచ్చేశాను.

అప్పటికే ఆయన స్పీచి చాలా తీవ్రస్థాయిలో వుంది. "అయితే ఇందాక క్యారెట్టు గురించి కొన్ని ప్రత్యేకతల్ని చెప్పానే అవన్నీ ప్లస్ పాయింట్లన్న మాట. అయితే ఇక్కడ క్యారెట్ వల్ల ఒకగొప్ప మైనస్‌పాయింట్ కూడా వుంటోంది. క్యారెట్‌ని విపరీతంగా తినడం వల్ల 'క్యారెట్ రోగం' అనీ అదేదో జబ్బు వస్తుందట. ఆ జబ్బు పేరు జ్ఞాపకం రావడం లేదు కానీ, మొన్ననే ఓ పత్రికలో వ్యాసం వచ్చింది. మీకు కావాలంటే ఓ అరగంటలో వెతికి చూపించగల్ను. అతి దేనికయినా మంచిది కాదులెండీ."

యస్ ..యస్ మీరు చెప్పింది అక్షరాలా కరెక్టే! అన్నాడు పెళ్ళికొడుకు హల్వా శకలాల్ని ప్లేట్లో ఎక్కడయినా ఉంటే వాటిని స్పూన్‌తో నిర్మూలిస్తూ..

"ఈ ఆపిల్ ఉంది చూశారా?" అంటూ టేబుల్ మీద ఉన్న ఆపిల్ పండును తీసుకుని అందరికీ చూపించేరు మావారు, గారడీవాడు మాయం చేయబోయే వస్తువుని ముందు చూపించినట్టు.

ఇదంతా చూస్తోంటే నాకు ఒకటే బీ.పీ. పెరుగుతోంది.. ఆపిల్‌మీద అరగంటా, ద్రాక్షమీద ఓ గంటా, అరటి మీద గంటన్నర సేపూ, అవలీలగా లెక్చరిచ్చేయగలడు నాపతి దేవుడు. అయితే ఇదా సమయం! ఆయన లెక్చరుకి ఝడుసుకుని, ఆ పెళ్ళిచూపులవాళ్ళు ఎక్కడ పరిగెత్తిపోతారోనని, నా గుండెలు లయతప్పి కొట్టుకుంటున్నాయి.

అయితే - ఓ ఆశ్చర్యకరమైన సంఘటన జరిగింది. ఏ నిమిషానికి ఏమి జరుగునో కదా!

పెళ్లి కొడుకు అమాంతంగా మావారి చేతిలో వున్న ఆపిల్‌ని లాగేసుకుని "వుండండుండండీ మామగారూ! జస్ట్ వెయిట్...ఈ ఆపిల్ గురించి నాకు చెప్పకండి... ఇదంటే నాకు బ్రహ్మాండమైన ఎలర్జీ. అసలు ఏముంది ఇందులో - పిడికెడు పిండి పదార్థం తప్ప. మూడు రూపాయలుపెట్టి ఇది తినడం ఒక్కటే, ముప్పయి పైసాలు పెట్టి ఓ ఉర్లగడ్డ ఉడకేసుకుని తినడం ఒకటే.. అని ఆ మధ్య పేపర్లో ఓ వ్యాసం చదివాను. అప్పణ్ణించి దీన్ని వాసన కూడా చూడను..."

"అవునవును, మావాడు చెప్పింది కరెక్టే సుమండీ! ఎక్కడో కాశ్మీర్‌లో కాస్తాయి కాబట్టే వీటిపై మనకింత మమకారం.. అంతెందుకూ ఈ 'సేపుకాయ' లున్నాయి. చూసేరా? 'ఆంధ్ర ఆపిల్స్' అంటారే అవి నయం వీటికంటే. మన ప్రాంతాలలో పండుతాయి కాబట్టే వాటిని మనం ఆదరించం...." అంటూ పెళ్ళికొడుకు తండ్రి -

"మీరు ఎన్నయినా చెప్పండి - ఈ పళ్ళలో కల్లా నాకు అరటి పండంత గొప్ప పండు మరేదీ కనపడలేదండి! రాత్రిళ్ళు తింటే చక్కగా జీర్ణమై ఉదయమే అతి చక్కగా విరేచనమౌతుంది. దానికి మరో గొప్ప సుగుణముంది చూశారూ - విరేచనాలు ఎక్కువైతే నిలబెట్టేస్తుంది కూడానూ... ఐ లైకిట్ వెరీ మచ్" అంటూ మావారు -

"యస్...యస్, ఐ టూ ఎగ్రీ విత్ యూ మామగారూ" అంటూ పెళ్ళికొడుకు- నవ్వుతూ ఆ బాతాఖానీలో ఓలలాడుతోంటే ఆ మామగారికి తగ్గ అల్లుడే దొరుకుతున్నాడనిపించింది. అయితే ఆ క్షణంలోనే సులక్షణని తలచుకుని దిగులేసింది. 'ఇలాంటి మొగుడు దొరికితే ఏమైపోతుంది ఆ పసిది!" అనుకుంటూంటే అపారమైన జాలేసింది దాని మీద.

అందరూ కారపు బూందీ తినడంలో పడిపోయేరు.

కాఫీలు యివ్వడానికి వంటింట్లోకి మళ్ళీ దూరేను. అంతే-

తిరిగి వచ్చేటప్పటికీ - టాపిక్ శరీరంలో వివిధ భాగాల మీదికి వెళ్ళింది...

మనిషి శరీరంలో ఎన్ని గ్యాలన్ల నీరుంటుందో మొదలుకొని శరీరంలోని పదార్థాలతో ఏమేమి చేయవచ్చునో చెబుతున్నారు. నేను వినడం మానేశాను.

ఎంచేతంటే-

అవన్నీ మాకు కంఠతా వచ్చును. మా మూడో అమ్మాయి సుగుణని అర్థరాత్రి వేళ లేపి అడిగితే. మనిషి శరీరంలో 10 గ్యాలెన్ల నీరు వుంటుందనీ... తక్కిన పదార్థాలతో ఏడు బార్ సోపుల్నీ, 9000 పెన్సిల్లనీ, 2,200 అగ్గిపుల్లలకి సరిపడా మందే మతాబునీ, ఓ పెద్ద బకెట్టుకు సున్నాన్నీ, నిండు గరిటెడు మెగ్నీషియాన్నీ, రెండు అంగుళాల పొడవున్న తీగమేకుని తయారు చేయొచ్చు అనీ చెబుతుంది - నిద్ర మత్తయినా వీడకుండా. మరి ఆయన పెంపకమా? మజాకా?

ఈసారి పెళ్ళికొడుకు తండ్రి తన 'దేహ చింతన' గురించి ప్రకటించు కుంటున్నాడు. తనకు ఇష్టమైన వైద్యం ఆయుర్వేదమట. అలోపతి అంటే అతనికి గిట్టనే గిట్టదట.

రేపు ఈ పాటికైనా వీళ్ళు దేహచింతననూ, వైద్యచింతననూ వదిలి 'సంసార చింతన' తో పెళ్ళి విషయాలు మాట్లాడుకుంటారా అని నా డౌటు!

నేను రెప్ప వేయకుండా ఓ మూడునిమిషాలు మా వారివేపు చూసేను. పొరపాటున నావేపు చూస్తారేమో పక్కకు పిల్చుకుపోయి రెండు మెత్తటి చివాట్లతో కర్తవ్యం గుర్తు చేద్దామని. ఊహూ- చూడలేదు. కాఫీ తాగుతూ - అందులో 'కెఫీన్' అన్న విషదార్థమున్నట్టు మావారు చెబుతోంటే నాకు కోపం నషాళానికి అంటుతోంది. కమ్మగా తాగే దాంట్లో 'విషపదార్థం' వెదుక్కుంటూ కూచున్నవాళ్ళ విజ్ఞానానికి, నా నరాల్లో రక్తానికి బదులు కారపు నీళ్ళు ప్రవహిస్తున్నట్టు మండుతోంది.

'ఏమండీ, మీ కోసం సూర్యారావు గారు వచ్చేరు!" బొంకేను.

"ఏ సూర్యారావు...ఓహో అతనా... రమ్మను దుర్గా!"

"మిమ్మల్నే రమ్మంటున్నారు. ఒక్క మాట మాట్లాడేసి వెళ్ళిపోతార్ట!"

తన సబ్జెక్టు సగంలో ఆపేసినందుకు - హీరో, థర్డ్ క్లాస్ విలన్ని చూసినట్టు నా వేపోసారి చూపుల తూపుని విసిరి వరండాలోకి వచ్చేసేరు.

ఆ సమయాన్ని ఏ మాత్రం వేస్టు చేసుకోకుండా, పెళ్ళి మాటలు మాత్రమే మాట్లాడమని 'హింట్' ఇచ్చేను. దాంతో ఆయన నావేపు ఓ చూపు చురచుర చూసి, గంటకి రెండువందల కిలోమీటర్ల నిట్టూర్పు ఒకటి అతి గాఢంగా వదిలి, అర్థమైందన్నట్టు శిరఃకంపనంతో తెలిపి, అక్కణ్ణించి కదిలేరు.

ఆ తర్వాత పెళ్లి మాటలు సాగేయి. మాతో వియ్యమందుకుంటున్నందుకు వాళ్ళు తృప్తిగానూ, మా అమ్మాయిని పెళ్లి చేసుకోబోతున్నందుకు పెళ్ళికొడుకు మరీ తృప్తిగానూ ఫీలయి వెళ్ళిపోయేరు.

సాయంత్రం ఐదు గంటలు అయింది...

అప్పుడే కాఫీ తాగేసి, అన్నం వండడానికి వంటింట్లోకి దూరేను.

"అమ్మా! అక్కయ్యా, బావా వచ్చేరే!' అంటూ సులక్షణ కేక వినిపించింది.

గబాగబా బయటికి వచ్చేసేను.

రిక్షాలోంచి దిగి వస్తోంది సుజాత - మోహన్ రిక్షావాడికి డబ్బులిస్తున్నాడు.

సుజాత చంకలోని బాబ్జీగాణ్ణి, సులక్షణ ఎత్తుకుని ముద్దులాడుతోంది. సుగుణ, తన చంకలోనికి తీసుకోవాలని లాక్కుంటోంది.

మామూలుగా రిక్షా దిగుతున్నట్టే నవ్వులు చిందించే సుజాత మొహంలో, దిగులు తొొంగి చూస్తుండటం చూసి, నాకు ఆందోళన కలిగింది.

"ఏమే, ఆరోగ్యం బాగాలేదా?" ఆత్రంగా అడిగేను - ఎంతయినా నాది తల్లి మనసు మరి. ఎంత మామూలుగా అడగాలని ప్రయత్నించినా ఆందోళన నా గొంతులో.

"ఎందుకు బావులేదూ?" అంటూ అది ఎదురు ప్రశ్న వేసింది, ఇంట్లోకి అడుగుపెడుతూ.

"మరి ఎందుకలా వున్నావు?"

మోహన్ లోపలికి వచ్చేడు.

"ఏంట్రా ఏమయిందసలూ? అది అదోలా వుందే?" అడిగేను.

"ఏమని చెప్పేదక్కా! దానికి కొడుకు చింత."

"ఏం...ఏమయ్యింది బాబ్జీగాడికీ?" కంగారుగా అడిగేను.

మోహన్ సమాధానం ఇచ్చేలోపల, అది ఒక్కటే ఏడుపు మొదలు పెట్టింది.

"ఇదీ వరుస అక్కా!!" అన్నాడు మోహన్ సుజాతని చూపిస్తూ.

నా గుండెలు లయ తప్పి కొట్టుకోటం ప్రారంభించేయి.

"ఏమయ్యిందిరా!" కీచుబోతున్న కంఠంతో అడిగేను.

"బాబ్జీగాడికి గుండె జబ్బమ్మా!" అంటూ ఏడుపు గొంతుతోటి చెప్పింది సుజాత.

"అదేమిటే విచిత్రంగా చెబుతున్నావు! వేలెడు లేడు, వాడికి గుండె జబ్బేమిటి?"

"అదే కదక్కా నా వాదనానూ! వొఠ్ఠి పిచ్చిది!" అంటూ వాడు నింపాదిగా సోఫాలో కూలబడి సిగరెట్టు వెలిగించేడు.

సులక్షణ, సుగుణలు బాబ్జీగాడిని పట్టుకుని కళ్ళల్లో నీళ్ళు పెట్టుకుని చూస్తున్నారు- వాడి మొహంలోకి.

నేనూ ఆత్రంగా బాబ్జీగాణ్ణి లాక్కుని దిగులుగా చూస్తున్నాను.

"అవును నేను పిచ్చిదాన్నే. మీరు మహాతెలివిమంతులు!" అంది సుజాత విసురుగా.

"అసలు విషయమేమిటో వివరంగా చెప్పండర్రా!" అన్నాను విసుగ్గా.

"ఏం లేదక్కా! బాబ్జీగాడికి నిన్న రాత్రి కాస్త వళ్ళు వెచ్చనయింది. దాంతో వాడు 'అమ్మా నొప్పి' అంటూ చేతి వేళ్ళు చూపించాడు....ఏదో జ్వరంలో వుండి ఒళ్ళు నొప్పులు వచ్చివుంటాయి - అట్లా ఆలోచించదే నీ కూతురు... దీనికన్నీ

విపరీతమైన ఆలోచనలు! ఏదో పత్రికలో చదివిందట. 'కీళ్ళవాపులు' వుంటే కీళ్ళ నొప్పులు వస్తాయట, అవే గుండె జబ్బుకి సూచనలట.." అంటూ మోహన్ చెబుతోంటే-

"ఆ మరి? వాడి చేతి వేళ్ళు కూడా వాచాయి. నువ్వయినా చూడవే అమ్మా!" అంది సుజాత, బాబ్జీగాడి చేతివేళ్ళు చూపిస్తూ.

అందరూ వాడి చేతి వేళ్లని పరిశీలించడంలో వుండిపోయాం. నాకేమీ వాడి చేతివేళ్ళు వాచినట్టు అనిపించలేదు.

"అలా ఏమీ అనిపించడం లేదే!" అన్నాను.

"ఏమీ ఎందుకు లేదు...! ఇదో, ఇంత స్పష్టంగా వాచినట్టు కనిపిస్తోంటేను" అన్నారు సుగుణ, సులక్షణ ముక్తకంఠంతో.

"అన్నీ మీ నాన్న పోలికలేనే మీకు" అని మాత్రం అనగలిగేను.

"కరెక్టే అక్కా!" అన్నాడు మోహన్.

"అంతేలే! మీరు ఏది నమ్మేరు గనుక, ఇది నమ్మడానికి!" అంటూ అక్కచెల్లెళ్ళ తరుపున సుజాత అన్నది.

"సరేలే, ఇప్పుడు మునిగిపోయిందేముంది! పిల్లల డాక్టరు దగ్గరికి తీసికెళ్దాం పదండి!" అన్నాను.

ఈలోగా మావారు రావడం - ఇదంతా విని, తెగ కంగారుపడిపోయి, డాక్టరు వద్దకి వెళ్ళడంలో ఆలస్యం చేసినందుకు మా అందరికీ విడివిడిగానూ, ఉమ్మడిగానూ చివాట్లు వడ్డించడం జరిగేయి.

★ ★ ★

"అమ్మాయ్! నువ్వొట్టి కంగారు మనిషివి, వీడికేం గుండె జబ్బమ్మా! రుబ్బుడు గుండులా వుంటేనూ..." అంటూ నవ్వేడు డాక్టరు, బాబ్జీగాడ్ని పరీక్షించేక.

"హమ్మయ్య!!!" అంటూ గుండెల నిండా ఊపిరి పీల్చుకున్నాం.

"జ్వరం లేదా డాక్టర్! ఇంకేదయినా ట్రీట్‌మెంట్ ....." అంది సుజాత.

"ట్రీట్‌మెంట్ వాడిక్కాదమ్మా! ...నీ కివ్వాలి. లేనిపోని అనుమానాలతో కుమిలి పోకుండా!" అన్నాడు డాక్టరు నవ్వుతూనే.

అప్పుడు నవ్వింది సుజాత నిండుగా!

అందరం బయటికొచ్చేక మావారు అన్నారు కదా..."ఈ డాక్టరుకేం తెలియదమ్మా....గొప్ప గొప్ప డాక్టర్లు కూడా రోగాన్ని కనిపెట్టడంలో పొరబడు తుంటారు... అది కీళ్ళ జబ్బే అయితే ఎంత ప్రమాదం, ఏం కథా! మరో డాక్టర్ని కన్సల్ట్ అవుదామా?"

నాకు చిర్రెత్తుకొచ్చింది. "బావున్నారండీ మీ తండ్రీకూతుళ్లు. చిల్డ్రన్ స్పెషలిస్ట్‌నికూడా నమ్మకపోతే ఎలా?చాలు చాల్లేండి. ఇంటికెళ్దాం పదండి."

మోహను కూడా నాకే సపోర్టుగా మాట్లాడడంతో అంతా ఇంటిదారి పటాం.

# 5

"దుర్గా!దుర్గా!!" మా వారు బయటి గదిలోంచి కేకలు పెడుతున్నారు. పెరట్లో బట్టలుతుకుతున్న దాన్నల్లా, నిబ్బరంగా సబ్బుచేతిని కడిగేసుకుని వెళ్లాను - తడి చేతిని కొంగుకి వత్తుకుంటూ.

"ఏం చేస్తున్నావ్ పెరట్లో! ఎంతసేపు పిలవాలి నిన్ను?" అన్నారు నా పతిదేవుడు అసహనంగా.

"కూరగాయలు తరుగుతున్నా" అని చెప్పాలనిపించింది.

వెంటనే - పతిదేవుడితో జోకులు వేయడం, సతిధర్మాల్లో విరుద్ధాంశంగా గుర్తించి "ఏం లేదు బట్టలు", అన్నాను ఉతుకుతున్నట్టు చేత్తో అభినయిస్తూ.

"ఆ, సంతోషం! గొప్ప పనే...అసలు ఈ రోజు పేపరు చూసేవా?"

"చూళ్ళేదు!"

'ల్యూకోడర్మా మీద చక్కటి వ్యాసం వచ్చిందే!"

'దర్మా ఏమిటి బర్మా లాగూ?' అనుకుని - "అదేమిటండీ? ఏదయినా పనిముట్టు కనిపెట్టారా?" అన్నాను అయోమయంగా మొహంపెట్టి.

"నీ తలకాయ్! నువ్వు బి.ఎ. చదివావు కానీ, నీ తలలో మెదడు పెరగలేదు.

ఇన్నేళ్ళూ నాతో కాపురం చేసేక నీకు ఏం వచ్చిందసలూ? పూలకి కట్టిన దారానికీ, ఇంగువ చుట్టిన గుడ్డకీ వాటి వాసన అబ్బుతుందంటారే? మరి నీకూ? నా సాహచర్యంలో నీకీ జన్మకి 'వైద్యజ్ఞానం' వస్తుందా? అంట!"

"అసలు విషయం చెప్పండి సార్! నా బి.ఎ. చదువులో ఈ ల్యూకోడర్మాలూ, గీకోడర్మాల గురించి చదువుకోలేదు.. ఏదో తెలుగు లిటరేచర్ కాస్త, హిస్టరీ పాలిటిక్స్ కాస్తా చదువుకున్నా...."

"ల్యూకోడర్మా అంటే 'బొల్లి'. తెలుగులో దాని శాస్త్రీయనామం 'శ్వేత కుష్టు' అంటారు - అదన్నమాట!"

"అదయితే ఏమిటంటా!?"

'ఏమిటంటా అంటే ఏం జెప్పనే దుర్గా... ల్యూకో డెర్మాకు యునానీ వైద్యంలో మాంచి మందువుందట... అదే - ఈ వ్యాసంలో సారాంశం. ఇప్పటికి చాలాకేసులు నయమయ్యేయట...."

"అయితే ఏంటండీ...మనకెవరికీ 'బొల్లి' లేదుగా!"

"ఛ!ఛ! నీ లైఫే వేస్టు... ఇలాంటి వ్యాసాల్లో ఎంత విజ్ఞానం వుంటుందీ, ఏం కథ...! నేను ఇన్నాళ్ళూ 'యునానీ' వైద్యాన్ని ఎంత నెగ్లెక్ట్ చేసేను...అదనుకుంటే దిగులేస్తూంది."

"దిగులుపడకండీ!వాటిమీద పుస్తకాలుంటాయి తెప్పించండి! అదేదో చైనా వైద్యం ఒకటి వుందిగా! 'ఆక్యుపంక్చరు' అనీ...అదీ మరచిపోకండి. వాటి మీద

పుస్తకాలుంటాయి, అవీ తెప్పించండి... అవన్నీ తెప్పించి మాపైన రుద్దండీ!!!" అన్నాను ఆవేశంతో - నా నరనరాల్లో పొంగుతున్న కోపానికి తెలుగు రూపం ఇస్తూ -

"ఏమిటే నీ ఆపసోపాలూ...ఈ నవీనకాలంలో అన్ని వైద్యాలూ ఎంత ప్రగతిని సాధిస్తోన్నాయి, ఏం కథా... అది ఏ వైద్యమైనా మానవాళి శ్రేయస్సుకేగా!" అన్నారాయన అయోమయంగా మొహం పెట్టి.

మమ్మల్ని ఇక ఏ దేవుడూ రక్షించలేడన్న విషయం స్పష్టమైపోయింది నాకు... అలా నిలువు గుడ్లేసుకుని శూన్యంలోకి చూస్తుండిపోయాను.

(ఆంధ్రజ్యోతి దీపావళి ప్రత్యేక సంచిక, 1990)

# అడినోవా

**ఊ**రికే ఉన్న ప్రాణానికి ఉరి పెట్టుకోవడమంటారే - సరిగ్గా అదేనండీ ... నేను చేజేతులారా చేసుకున్నాను.

అవున్నిజం!! అది 'ఎట్లా?' అని మీరు నన్ను అడగకుండా ఊరుకోరు - నాకు తెలుసు...

చెబుతా చెబుతా - మీరు కొంచెం ఓపిగ్గా వింటే .... మొదట్నించీ వివరంగా చెబుతాను.

ఆc... ఆ రోజూ.... 'అంటే - ఏ రోజు?' అని మీరు నన్నడక్కూడదు - ఎందుకంటే నా 'కర్మ రోజు' ఏ రోజైనా ఒక్కటేగా - అందుకే - 'ఆ రోజు'తో ప్రారంభిస్తాను.

ఆ రోజు నాకు ఏ పాడు బుద్ధి పుట్టిందో ఏమిటో తెలియదుగాని - మేము టీ.వీ.ని కొన్న నాటి నుంచి ఏ పొద్దూ దాన్ని ఆన్ చేసి, ఏ ఒక్క ఛానల్నీ కంటిన్యూగా ఐదు నిమిషాలపాటూ చూసి ఎరగను. దానిక్కారణం నేను రెవిన్యూ శాఖలో ఉద్యోగిని అవడమే! నన్ను 'కర్మ' అట్లా తోసుకుని వస్తూవుంటే ఏం చేయగల్ను.

టీ.వీ.ని ఆన్ చేశాను. చిన్ని తెరమీద ఉపగ్రహ టీ.వీ. ఒకటి ప్రత్యక్షమయింది. పోనీలే మా ఆవిడ టిఫిన్ రెడీ చేసేటంత వరకూ కాసేపు ఆకల్ని మరచిపోయి ఉండవచ్చుకదా అన్న దురుద్దేశంతో చూడసాగాను.

తెరమీది యాంకర్ అనవసరమైన అమితానందాన్నంతా మొహం మీద ఎడాపెడా పులిమేసుకుని, ముప్పై రెండు పళ్ళూ కనిపించేంతగా నవ్వేస్తూ, ఏదో వింత భాష మాట్లాడుతూ వుంది. అది మన భూమ్మీద మనుషులు మాట్లాడేదేనా అని అనుమానమొచ్చి, చెవులు రిక్కించి వినసాగాను. అప్పుడు అనిపించింది అది మన భాషేనని. తెలుగు, ఇంగ్లీషు భాషల్ని ఏకకాలంలో ఖూనీ చేసేయగల సామర్థ్యం ఈ ఆడ యాంకర్‌కి ఏవిధంగా వచ్చిందా అని నేను తెగ ఆశ్చర్యపోతూ వున్నాను.

ప్రపంచంలో ఏ భాషవాళ్ళయినా టీ.వీ.లలో వాళ్ళ భాషలోనే యాంకరింగ్ చేస్తారు. ఒక్క తెలుగు యాంకర్లు మాత్రమే ఇటు తెలుగూ, అటు ఇంగ్లీషులని కలగలిపి (బహుశా దాన్ని 'తెంగ్లీషు' అనొచ్చా!) కొంగ్రొత్త భాషగా చేసి అలవోకగా మాట్లాడగలరు.

తెలుగు ప్రేక్షకులందరికి ఆంగ్ల వైద్య విజ్ఞానం పంచాలనుకున్నారేమో - భాగ్యనగరం 'గూమ్స్' ఆస్పత్రివారి సహకారంతో "మూత్రపిండాల్లో రాళ్ళు" అన్న అంశాన్ని ప్రసారం చేయడం మొదలుపెట్టారు.

ఈ సబ్జెక్ట్ చూసేందుకు నాకంటే కూడా సరయిన వ్యక్తి పద్మే అనిపించింది. సరిగ్గా ఆ క్షణంలోనే 'నా కర్మ పరిపక్వం' అన్న ప్రక్రియ మొదలయిందని నాకు తెలీదు మరి! నేనైనా ఏం చేయగలను - ఛస్తానా ....

"పద్మా!" అంటూ పిలిచాను - అత్యుత్సాహంగా.

"ఆఁ" అంది. కానీ లోపలినుండి రాలేదు.

"తొందరగా రావే" అంటే మళ్ళీ ....

"ఆఁ ఆఁ" అంది. కానీ బయటికి రాలేదు.

"నువ్వు వెంటనే రాకపోతే - నేను టిఫిన్ చెయ్యను తెల్సిందా?" అన్నాను బెదిరిస్తూ [illegible]

"ఆఁ వస్తున్నానండీ - అన్నిటికీ బెదిరింపులే" అంటోంది, కానీ ఎంతసేపటికీ రాలేదు.

'కర్మ' అన్నది పరిపక్వమైపోతూ నన్ను ఊరకనే ఉండనిస్తుందా? తోసుకువెళ్ళింది వంటింట్లోకి.

అంతే - పద్మని చేయి పట్టుకుని బలవంతాన హాల్లోకి లాక్కొచ్చి టీ.వీ. ముందు కుదేశాను.

విసుగ్గా వచ్చి టీ.వీ. ముందు కూచుందేకానీ, మరునిమిషంలో విసుగు మటుమాయం! నోరు తెరుచుకుని ఆ కార్యక్రమాన్ని తదేకంగా చూడసాగింది. మామూలుగా అందులో ఏ కార్యక్రమం వచ్చినా ఆశ్చర్యంగానూ, ఆనందంగానూ చూడటం ఆవిడ ప్రత్యేకత.

మూత్రపిండాలు ఏవిధంగా పనిచేస్తాయి? వాటి విధులేమిటి? అన్న అంశాన్ని చూపారు.

వాటిలో ఏఏ రకాల రాళ్ళు తయారవుతాయి, ఏఏ ఆకారాలు కలిగి వుంటాయి అన్నది కూడా చూపారు. ఉక్కుముక్కలా ఉండే మనిషి కూడా ఆ కార్యక్రమాన్ని చూశాక అతని గుండెకాయ జానెడు జారి పొట్టలో పడాల్సిందే. ఆ స్థాయిలో చిత్రించారు ఆ ఎపిసోడ్ని.

ఇప్పుడైతే నేను తెలుసుకోగలిగాను కానీ కర్మ పరిపక్వం గురించి - అప్పటికి నాకు తెలీదు కదా మరి... అందుకే మా ఆవిడకి కిడ్నీలకి సంబంధించినటువంటి జ్ఞానాన్ని బలవంతంగానైనా తెలుసుకునేట్టు చేస్తున్నాను కదా అని పదింతలు సంతోషంగానూ ఒకింత గర్వంగానూ వుంది. టీ.వీ తెరనీ, పద్మ మొహాన్నీ మార్చి మార్చి ముచ్చటపడుతూ చూస్తూ వున్నాను.

నేను అట్లా పద్మకి ఆ కార్యక్రమాన్ని ప్రత్యేకంగా చూపించడంలో కొంత ఫ్లాష్ బ్యాక్ వుంది -సుమా!

అదేమిటో వివరంగా చెపుతాను.

సుమారు పదిహేను రోజుల క్రితం ఉదయాన్నే పద్మకి పొత్తికడుపులో భరించలేనంతటి నొప్పి వచ్చింది. నొప్పికి తట్టుకోలేక ఏడ్చేస్తోంది. ఆ నొప్పి రాను

రానూ ఎడమవైపు వీపుపైకి పాకుతోన్నట్లుగా వుందని చెబుతోంది. వెంటనే ఆటోలో గవర్నమెంట్ ఆస్పత్రికి తీసుకెళ్ళేను. అక్కడ స్కానింగ్ తీశారు - ఎక్స్‌రే తీశారు.

పద్మ ఎడమ కిడ్నీలో రాళ్ళు వున్నట్లు తేల్చారు. ఆ విషయం తెలుస్తూనే పద్మకి ఏడుపు ముంచుకొచ్చింది. బాధతో విలవిలలాడిపోయింది.

ప్రతిరోజూ బాగా నీళ్ళు తాగుతూవుంటే రాళ్ళు కరిగిపోయే అవకాశం వుందని డాక్టర్లు చెప్పారు. నొప్పి తగ్గేందుకు ఏవో మాత్రలు కూడా యిచ్చారు.

మాత్రలు బాగా పనిచేయడం వల్లనో, నీళ్ళు బాగా తాగడం వల్ల ఆ రాళ్ళు కరిగిపోయాయో తెలీదుకానీ, మళ్ళీ పద్మకి పొత్తికడుపులో నొప్పి రాలేదు.

పద్మ ఆవిషయాన్నే దాదాపు మరిచిపోయింది.

అయితే నా కర్మ పరిపక్వం కావడం ఇప్పుడే కదా అయిపోవచ్చింది. టీ.వీ.లో చూపిస్తున్న 'కిడ్నీల' కార్యక్రమం అయిపోయింది. దాంతోపాటు పద్మ మొహం ఆరిపోనున్న దీపపుకాంతిలా తగ్గిపోయి వుంది.

"ఆఫీసుకి టైమవుతోంది తొందరగా టిఫిన్ ... అసలే ఆకలి ..." అన్నాను మొహం దీనంగా పెట్టుకుని.

'ఆకలయితే రోకలి మింగు' అన్నట్టు చూసింది. ఆ చూపులో సీరియస్‌నెస్ లేదు... ఆందోళన ఉంది.

యాంత్రికంగా టీ.వీ.ని ఆఫ్ చేశాను.

ఉన్నట్టుండి - "నా ఆరోగ్యం గురించి పట్టదా నీకు" నా కళ్ళలోకి సూటిగా చూస్తూ అడిగింది పద్మ.

"ఎందుకు పట్టదు?" అని నవ్వాను.

"ఏదోలే, దేవుని దయవల్ల నొప్పి తగ్గిందిలే అని అనుకున్నామా? ఇప్పుడు టీ.వీ.లో చూసిన తర్వాత తెలిసింది - ఒక్కోసారి కిడ్నీలో రాళ్ళు ఎంత లావుగా వున్నా నొప్పి రాకపోవచ్చునంట ... మనం వాటిని గురించి అశ్రద్ధ చేస్తే అవి చెడిపోయే ప్రమాదం కూడా వున్నదంట" అంటూనే కళ్ళల్లో నీళ్ళు కక్కుకుంది పద్మ.

నిజంగా అప్పుడు తెలిసింది కర్మ గురించీ, దాని పరిపక్వత గురించీ - కొంచెం, కొంచెం.

"యూరాలజిస్టు కాడికి పోదామండీ! లేదంటే నా ఆరోగ్యం ..." అంటూ ఆపేసింది 'పాడయి పోతుంది' అని అనలేనంత దుఃఖంతో కంఠం మూసుకు పోయింది. సరేనన్నాను - ఆమె తలమీద చేత్తో దువ్వుతూ.

ఊళ్ళో డాక్టర్లకేం కొదవలేదు. సందుకో డాక్టరు, ఇంటికో డాక్టరున్నాడు. ఇంక యూరాలజిస్టు వుండడా అన్న ధీమా కూడా వుంది అప్పట్లో నాకు.

అప్పటికి నేను ఎంత అజ్ఞానంతో అలరారుతున్నానో మా మిత్రులు చెబుతోంటే కానీ అర్థం కాలేదు. ఏమనీ? ఈ ఊళ్ళో కిడ్నీకేకాదు శరీరంలోని అతి ముఖ్యమయిన ఏ భాగానికి కూడా స్పెషలిస్టులు లేరని.

మరంచేత పద్మని ఏ హైదరాబాదుకో, లేదంటే ఏ బెంగుళూరుకో తీసుకు పోవాల్సిందే - అందుగ్గానూ చేతిలో పదివేల రూపాయలైనా వుండాలి. నేను చూస్తే

సగటు గుమస్తాని. ప్రావిడెంటు ఫండులో అప్పు కోసం అర్జీ పెట్టుకున్నాను. ఆ అప్పు చేతికి రావాలంటే ఎంతలేదన్నా రెండు వారాలయినా పడుతుంది.

★ ★ ★

ఒక సాయంత్రం ఆఫీసు నుంచీ ఇంటికి రాగానే .... "మనం ఎక్కడికీ వెళ్ళాల్సిన పనిలేదంటే! హైదరాబాదు నించీ యూరాలజిస్ట్ డాక్టర్ పరాంకుశం వస్తున్నాడంట మన ఊరికి - టీ.వీ.లో ప్రకటించారు. వచ్చే శనివారమే ఆయన వస్తున్నది" అంది పద్మ ఉత్సాహంగా.

"ఎక్కడంట?" అని అడిగాను.

"అడినోవా హాస్పిటల్ అని కొత్తగా కట్టించినారంటనే అందులోనేనంట" అంది పద్మ.

"అవునా - ఎంతయినా నువ్వు అదృష్టవంతురాలివే. వెదకబోయిన తీగే కాళ్ళదగ్గర కొచ్చింది. అసలు మన అట్లా వాళ్ళు ఆ పెద్ద పెద్ద సిటీలకి పోయి ఆ కార్పొరేట్ ఆస్పత్రులలో చూపించుకోలేమని, వాటి శాఖల్నే మన ఊర్లో పెట్టారు. ఈ 'అడినోవా' హాస్పిటల్‌కి హైదరాబాదు, బెంగుళూరు, చెన్నైల్లో పెద్ద పెద్ద ఆస్పత్రులున్నాయే" అన్నాను. 'కాగల కార్యం గంధర్వులు తీరుస్తారంట' అన్న పెద్దలమాట ఊరకనే పోతుందా!

ఆలస్యం చేయకుండా వెంటనే అడినోవా ఆస్పత్రికి ఫోన్‌చేసి పద్మ పేరు నమోదు చేయించాను. టోకన్ నెంబరు 'ఆరు' అని చెప్పింది రిసెప్షనిస్టు. శనివారం ఉదయం తొమ్మిదింటికల్లా అడినోవాకి తీసికెళ్ళాను.

అర ఎకరమున్న విశాలమయిన స్థలంలో ఆరంతస్తులు కట్టిన భవనమది. చాలా అధునాతనంగా ఉంది. అందులో పనిచేస్తూ వున్న ఆడ, మగ ఉద్యోగులందరూ తెలుపు, లేత నీలంరంగు యూనిఫాంలో వున్నారు. అక్కడ స్వీపరుకూడా శుభ్రమయిన బట్టలు వేసుకుని ఉండటం నాకు ఎంతో నచ్చింది.

రిసెప్షను కౌంటరుకు ఎడమవైపున పెద్ద మెడికల్ స్టోరు వుంది. '24 గంటలూ సర్వీసు చేస్తాం' అన్న బోర్డు తెలుగూ, ఇంగ్లీషు భాషల్లో రాసివుంది.

డాక్టరు ఫీజు నూటా ఏభైరూపాయలూ కౌంటర్లో చెల్లించి వెయిటింగ్ హాల్లో కూచున్నాం నేనూ, పద్మ. అప్పటికే ఏభైమందిదాకా అక్కడ వున్నారు.

పదకొండు గంటలవుతున్నట్టే యురాలజిస్టు డాక్టరు పరాంకుశంగార్ని కలిశాం. పద్మ తన బాధలూ, అనుమానాలూ చెప్పేసింది. పరాకుగానూ, చిరాకుగానూ వున్నారు డాక్టరు పరాంకుశం. గవర్నమెంటు ఆస్పత్రివారు ఇచ్చిన రిపోర్టుల్ని చూపించాం. వాటిని చూస్తూ మరింత పరాకుగా పెదవి విరిచి -

"ఈ రిపోర్టుల్లో ఏమీ తెలీట్లేదండీ! ఈ హాస్పిటల్లో ఇప్పుడు స్కానింగ్ తీయించండి. అట్లాగే ఐ.వీ.పీ. ఎక్స్‌రే కూడా తీయించండి. ఆ రిపోర్టుల్ని చూసి అప్పుడు డయాగ్నయిజు చేస్తాను" అన్నారాయన.

డాక్టరు దగ్గిర చీటీ రాయించుకుని కౌంటర్ దగ్గరకి వెళ్ళాను. స్కానింగ్, ఎక్స్‌రేలకి పదిహేనువందలు ఫీజు కట్టించుకుని - ఖాళీ కడుపుతో మరునాడు రమ్మన్నారు.

"అయ్యో! డాక్టరుగారు ఈ రాత్రికే తిరిగి వెళ్ళిపోతే ఎట్లా?" ఆందోళనగా అంది పద్మ.

నిజమే - డాక్టరుగారితో వున్న విషయం చెప్పాం. అందుకాయన - "ఎస్, ఎస్, ఐ.వీ.పీ. ఎక్స్‌రేని ఖాళీ కడుపుతోనే తీయాలి. రేపు ఇవి రెండూ తీయించుకున్నాక ఈ హాస్పిటల్ ఛైర్మన్ డాక్టర్ రావుగారికి ఆ రిపోర్టులు చూపించండి. ఆయన నాకు ఫోన్లో అన్ని విషయాలు చెబుతారు. ఓ.కే... ఆ తరువాత ఏం చేయాలో నిర్ణయిద్దాం ... డోన్ట్‌వర్రీ" అభయమిస్తున్నట్లు అన్నారు.

ఆ మరుసటిరోజు మళ్ళీ 'అడినోవా'కి వెళ్ళాం. పద్మ ఖాళీ కడుపుతోనే వుంది. కిడ్నీల ప్రాంతంలో ఐ.వీ.పీ. ఎక్స్‌రే ఫోటోలు అయిందింటిని వివిధ భంగిమల్లో తీశారు. స్కానింగు కూడా తీశారు. అప్పటికే భోజనం లేక గుడ్లు తేలవేస్తున్న పద్మని హోటలుకు తీసుకెళ్ళాను.

మధ్యాహ్నం మూడున్నరగంటలకి ఎక్స్‌రే, స్కానింగ్ రిపోర్టులతోపాటూ 'అడినోవా' హాస్పిటల్ ఛైర్మన్ అయిన డాక్టరు రావు గదికి వెళ్ళాం.

ఆయన్ని చూడగానే పెద్దపులి జ్ఞాపకం వస్తుంది. అచ్చంగా దానికి సూట్ వేసినట్టే వుంది.

మమ్మల్నిద్దర్నీ చూస్తూనే ముచ్చటయిన కుందేళ్ళని చూస్తూ లొట్టలువేస్తూ నవ్వి నవ్వి తన ముందున్న కుర్చీలలో కూచోమన్నట్టు పంజా చూపింది పెద్దపులి.

అదురుతూ, బెదురుతూ కూచుని బెరుకు బెరుకుగా చూస్తూ రిపోర్టుల్ని టేబుల్‌మీద వుంచాను.

తన లావాటి మీసాల్ని సుతారంగా దువ్వుకుంటూ - రిపోర్టుల్ని విహంగ వీక్షణం చేసింది.

పద్మవైపు తిరిగి - 'మిమ్మల్ని ఇప్పుడే తినదల్చుకోలేదు' అన్నట్టు నవ్వి, "ప్లీజ్, మీరు కాస్త బయటికి వెళతారా, మీవారితో కొంచెం మాట్లాడాలి" అంది పులి.

పద్మ ఒక్కసారి షాక్ తిని, బిత్తరపోయి ఆందోళనగా నావైపు చూస్తూ గదిబైటికి వెళ్ళిపోయింది. ఒక్క పద్మకే కాదు నాకూ భయం వేసింది ఆ క్షణంలో - తన సూట్‌ని తీసివేసి అక్కడికక్కడే నన్ను నంజుకోదు కదా!

తన టేబుల్ మీద ఉన్న పర్సనల్ కంప్యూటర్ని ఆన్ చేసింది పెద్దపులి. టపటపమంటూ కీబోర్డు మీదున్న మీటల్ని ఎడాపెడా నొక్కేసింది. దేహంలోని అవయవాలన్నీ చిన్నతెరమీద ప్రత్యక్షమవుతున్నాయి....

కిడ్నీలు బొమ్మరాగానే - పులి కనుబొమ్మల్ని ఒకసారి ఎగరేసి "వీటినే మూత్రపిండాలని అంటారు. ఐ మీన్ కిడ్నీస్ ..." నావైపు చూడకుండానే అవి దేహంలో ఏ ప్రదేశంలో ఉంటాయో వివరంగా చెబుతోంది.

'ఛ ... మాకు తెల్దులే ...' అందామనిపించింది. కిడ్నీల గురించిన విషయాలన్నీ అప్పటికే నాకు కంఠతా వచ్చును. అయినా తెలీనట్లు తలాడిస్తూ నేను. కాసేపు

పాఠమంతా ఏకరువు పెట్టాక, అసలు విషయానికొచ్చిందా పులి. "ఈ రిపోర్ట్సు చూశాక కిడ్నీల్లో రాళ్ళు లేవు అన్న విషయం స్పష్టమయింది. ఎస్! హండ్రెడ్ పర్సెంట్ గ్యారంటీ ఇవ్వగల్ను" అంది - నావైపు కళ్ళెగరేసి నవ్వుతూ.

ఆ పులి మీదపడి కరవదన్న గ్యారంటీ ఆ సమయంలో వుంటే ఎగిరిగంతేసి కేకలు వేయాలన్నంత ఉత్సాహం వచ్చింది.

అయినా, ఈ పులేంటి ఈ మాత్రానికే పద్మని అంతలా హడలు గొట్టేంత బిల్డప్ ఇవ్వాలా! పాపం పూర్ పద్మ ...

"అయితే ఒక్క విషయమండీ ..."

మళ్ళీ ఏమిటీ ఒక్క విషయమంటోందీ పెద్దపులి ... ఏదన్నా ఫిటింగ్ పెడుతూ వుందా కొంపదీసి. ఈ మాట అనుకోగానే గుండెలు ఒక్కసారిగా దడదడలాడాయి.

"ఏమిటి? అదేమిటో చెప్పండి సార్!" అన్నాను బలహీన స్వరంతో ...

"అబ్బే ఏంలేదండీ. డోంట్ వర్రీ! నెమ్మదిగా వినండి - మీ ఆవిడ ఎడమ కిడ్నీలో సిస్టు వుందని నా డౌటు" అంటూ కోరలు కనిపించేలా నవ్విందా పులి - ...

"సిస్ట్ అంటే?" అర్థం కాలేదు నాకు.

"బుడ్డ లేదా గుల్ల వంటి ఆకారం... మరి అది ట్యూమర్ కావచ్చు. నీటి బుడ్డ కావచ్చు - మరేదైనా కావచ్చు" అంటూ వివరించింది.

నా గుండెల్లో దడ మరీ ఎక్కువైంది. ఇదేమిటీ పద్మకి కొత్త జబ్బు! మాట పెగల్లేదు - మౌనంగా తల పంకించాను.

"నా డౌటు తీరాలంటే మీరు సీటీ స్కానింగు చేయించాల్సి వుంటుంది. ఈ ఫెసిలిటీ మా హాస్పిటల్‌లో లేదండీ! త్వరలో దాన్నీ మేం పెట్టబోతున్నాం. ఇప్పుడు మీరు ఎక్కడైనా 'సీటీ స్కాన్' చేయించండి. ఆ రిపోర్టు తెస్తే, అందులో అది ఏరకమైన సిస్టో తెల్సిపోతుంది. ఈ ఊర్లోనే మా హాస్పిటల్ లాంటిదే 'జడ్విన్' ఉన్నది. అందులో చేయించండి. లెటర్ రాసిస్తా. ఈ రిపోర్టులన్నీ డాక్టర్ పరాంకుశంగారికి ఫోన్‌లో చెబితే హీ విల్ బీ హ్యాపీ. ఏమంటారు?"

నానుండి ఎటువంటి సమాధానం కోసం ఎదురుచూడకుండానే 'జడ్విన్' ఛైర్మన్‌కు లెటర్ రాసిచ్చింది పెద్దపులి.

"ఎంతవుతుంది సార్?" అడిగాను.

"మనిషి ముఖ్యమండీ - ఇట్లాంటి సమయాల్లో ఎంత ఖర్చు అవుతుందని ఆలోచించుకోకూడదు. మీరు అడిగారు కాబట్టి చెబ్తున్నా అయిదువేలదాకా కావచ్చు."

అక్కణ్ణించి బయటికి వచ్చేశాను. వెయిటింగ్ హాల్లో బిక్కుబిక్కుమంటూ నాకేసే చూస్తోంది పద్మ... ఏం చెబుతాడా! అని. ఏం లేదన్నట్టు నవ్వాను. డాక్టరు చెప్పినదంతా పొల్లుపోకుండా చెప్పాను. నా మాటలు నమ్మిన దాఖలాలు ఆవిడ మొహంలో కనిపించకపోగా - "ఇంకేదో చెప్పి వుంటాడు డాక్టరు. నేను

భయపడ్తానని దాస్తున్నావు" అంది కళ్ళలో నీళ్ళతో. ఆమెని నమ్మించాలని ప్రయత్నించే కొద్దీ నేను మరింత విఫలుడినవుతున్నాను. 'సీటీ' స్కాను చేయించకుండా బెంగుళూరులో చూపిద్దామంటే నమ్ముతుందా? ఏమో మరి!

"అరెరే ప్రసాద్ - ఇక్కడున్నావేరా!" అన్నగొంతు విని వెనక్కి తిరిగి **చూశాను.**

నా చిన్న నాటి మిత్రుడు - మూర్తిగాడు.

మా ఆవిడకి వాడిని పరిచయం చేశాను. ఆ తర్వాత "నువ్వేంటి రా ఇక్కడ?" అంటూ ఎదురుప్రశ్న వేశాను వాడిని.

"అయ్యో ఏమని చెప్పేదిరా! నిన్న కర్నూలుకు క్యాంపుకు పోయినాను. పని వుండి రాత్రికి అక్కడే ఉండిపోయాను. చుట్టపు చూపుగా వచ్చిన మా మామకు నీళ్ళ విరేచనాలు పట్టుకున్నాయి. ఇంటికి దగ్గర అని మా ఆవిడ ఇందులో చేర్చింది. ఏదో లూజ్ మోషన్స్ అంటే అవి నిలిచేందుకేవయినా టాబ్లెట్లో, కాప్స్యూల్సో ఇస్తారు, రెండు సెలైన్ బాటిల్స్ ఎక్కిస్తారు ...

ఈడ అట్లా కాదురా. ఆ ముసిలాయనకి ఎండోస్కోపూ, ఆ స్కోపూ, ఈ స్కోపూ అని చెప్పి ఏవో టెస్టులు చేయించి - ఐదు వేలు బిల్లు చేసినారు. నేను ఇప్పుడా డబ్బు కట్టేసి వస్తున్నా" చెప్పాడు మూర్తిగాడు.

మా పరిస్థితి అంతా వాడికి చెప్పాను.

"వీళ్ళని నిందించి లాభంలేదురా! వ్యాపారంతో ముడిపడి వుండే వైద్యంలో జబ్బు కంటే డబ్బుకే ప్రాముఖ్యత ఎక్కువగా వుంటుంది. నా మాట విని పుట్టపర్తికి పో! అక్కడ సూపర్ స్పెషాలిటీ ఆస్పత్రి వుంది. బాబా మీద భక్తితో అక్కడి డాక్టర్లు అంకిత భావంతో పనిచేస్తారు. అది వాళ్ళ ఇష్టం. మనకి దాంతో సంబంధం లేదు. అక్కడి వ్యవహారం డబ్బుతో ముడిపడదు కాబట్టి నీతిగా, నిజాయితీగా చెప్తారు. నీకు పైసా ఖర్చు వుండదు" అన్నాడు మూర్తి.

మరుసటి రోజే పుట్టపర్తి ఆస్పత్రికి వెళ్ళాం. అక్కడ వున్న యూరాలజిస్టు ఓ కుర్ర డాక్టరు. వచ్చీరాని తెలుగు మాట్లాడతాడు. అతని మాతృభాష తమిళం. పద్మకి ఎక్స్‌రే తీయించాడు. వెంటనే రిపోర్టు తెప్పించుకుని చూసి చెప్పాడు. "మీరు ఏమీ భయపడే పనిలేదు. మొదలు స్కానింగ్ తీసినపుడు రాళ్ళు వుండినాయేమో. మీరు నీరు బాగా తాగినందువల్ల అవి పూర్తిగా కరిగిపోయినాయి. మీకు ఏం ప్రాబ్లం లేదు. ఏ మాత్రలూ వాడే పని కూడా లేదు."

అతను చెప్పింది విన్న పద్మ మొహంలో వేయి దీపాల వెలుగులు.

(స్వాతి వీక్లీ - 19 డిసెంబర్, 2003)

# ప్రేమలేఖ

ఆ వేళ రెండో శనివారం ....

ప్రభుత్వకార్యాలయాన్నింటికీ సెలవు. అయినా ఆ కార్యాలయం పనిచేస్తోంది. అందుకు కారణం రెండు రోజుల తర్వాత కలెక్టరు ఇన్‌స్పెక్షన్ ఉండటమే!

కొందరు క్లర్కులు పర్సనల్ రిజిష్టర్లని అప్టూడేట్ చేసుకుంటూంటే... కొందరు ఫైళ్ళకి పాతరేపర్లని తీసివేసి, కొత్త రేపర్లని తొడిగి, దానిమీద నెంబర్లని అందంగారాసి ముస్తాబు చేస్తున్నారు. మరికొందరయితే అటెండర్ల చేత డిస్పోజల్స్‌ని మంచి అట్టలు వేసి భద్రంగా కుట్టించేస్తున్నారు.

చాలా అవసరమైతే తప్ప ఒకరితో ఒకరు మాట్లాడుకోవడం లేదు వాళ్ళు.

దేశంలోని ప్రతి ఆఫీసూ, ప్రతిరోజూ ఇలాగే పనిచేస్తూ ఉంటే పెండింగ్ వర్కు మచ్చుకైనా కనిపించకపోగా, ఇంకా కొత్త వర్క్ ఎప్పుడొస్తుందా అని ఎదురు చూడాల్సి వస్తుందేమో క్లర్కులు.

శంకరరావు తనటేబుల్ మీద దొంతరులుగా ఫైళ్ళు పేర్చుకుని తన పర్సనల్ రిజిష్టరులో చర్య తీసుకోని ఒక ఫైలు కోసం ఆత్రంగా గాలిస్తున్నాడు. అప్పటికి ఒక పదిసార్లు ఆ ఫైళ్ళు బీరువాలోకీ, టేబుల్‌పైకి మళ్ళీ బీరువాలోకీ, మళ్ళీ టైబుల్‌పైకీ ప్రయాణం చేశాయి. అయినా తప్పిపోయిన ఫైలు జాడ తెలియరాలేదు. ఫైళ్ళుంచిన ప్రతిపేడ్‌ని మళ్ళీ నెమ్మదిగా ఒక్కొక్కదాన్నే జాగ్రత్తగా తిరగేసి చూస్తున్నాడు. ఇంట్లో నిత్యం కనిపించే ఎంతో విలువైన సామాను ఒకటి కనిపించకపోతే అంత ఆందోళన ఉండదు గానీ, ఏ మాత్రం ప్రాముఖ్యత లేని ఒక చిన్న ఫైలు కనిపించకపోతే గుమస్తా ఆందోళన ఇంతా అంతా కాదు. అందులోనూ శంకర్రావులాంటి సిన్సియర్ సీనియర్ గుమస్తాల కథ వేరే చెప్పనవసరం లేదు. అందుకే అతనికి అంత ఆందోళన మరి.

శంకరరావు వయసు ముప్పయ్యేళ్ళూ, అతని ప్రభుత్వ సర్వీసుకి పన్నెండేళ్ళూనూ. అంటే - తనపద్దెనిమిదో ఏటో ఉద్యోగంలో చేరేదన్నమాట. ఆ ఆఫీసులోనే సీనియర్ మోస్టు క్లర్కులలో శంకరరావు ఒకడు.

అతను బీరువా చూసి అందులో ఎన్ని ఫైళ్ళుంటాయో లెక్కచెప్పగల నేర్పరి. తన బీరువాలోని అయిదువందల ఫైళ్ళ నెంబర్లన్నీ అతనికి కంఠతా వచ్చును. ఎంతటి క్లిష్టమైన రెఫరెన్సుకైనా అవలీలగా జవాబు రాసేయగల ధీరుడు శంకరరావు. ఇంకా చెప్పాల్సి వస్తే ఆ ఆఫీసులోని ఏ సీటులో పనైనా కళ్ళు మూసుకుని అవలీలగా చేయగల ఘనుడు శంకరరావు.

"సార్! శంకరరావుగారూ! ధర్మవరంది 111/88 నెంబరు ఫైలు మీదేనా ... పొరపాటున నా ఫైళ్ళలో కొచ్చింది" అడిగాడు రామమూర్తి.

శంకరరావు ప్రాణం లేచి వచ్చింది. దిగ్గున తలెత్తి చూశాడు శంకరరావు. "యస్...యస్...రామ్మూర్తీ! మీ దగ్గరికెలా వచ్చిందండీ! రెండుగంటల సేపట్నించి వెతికిన ఫైలు వెతక్కుండా వెదుకుతున్నా.. ఇదిగో ఓబిలేసూ.. రామ్మూర్తి దగ్గర్నించీ ఆ ఫైలు తీసుకురావయ్యా!" అంటూ అటెండరు ఓబిలేసునికి పని పురమాయించాడు.

శంకరరావుకు ఫైలు దొరకడం గొప్ప ఆనందానిచ్చింది...

"కాఫీ తాపాలండోయ్ శంకరావుగారూ! మీ ఫైలు దొరికినందుకు" అన్నాడు రామ్మూర్తి సోడాబుడ్డి కళ్ళద్దాల్లోంచి చూస్తూ.

"అలాగే..దాందేముంది గురూ.. మధ్యాహ్నం భోంచేసి వచ్చాక తాగేద్దాం" అన్నాడు నవ్వుతూ శంకరరావు.

అటెండరు తెచ్చియిచ్చిన ఫైలుని ఆప్యాయంగా అందుకుని, దానిమీద వెంటనే చర్య తీసుకునేందుకు తెల్ల కాగితాన్ని తీసుకుని గబగబ రాయసాగాడు.

"ఇదిగో సార్..మీ టపాలు...టపా గుమస్తా ఇచ్చారు" అంటూ చిన్న సైజు ఉత్తరాల కట్ట నొకదాన్ని ఓబిలేసు తెచ్చి టేబుల్‌మీద వుంచాడు.

'ఈ పాడు టపా గుమస్తాగాడొకడు. తన ప్రాణానికి, చీటికీ మాటికీ 'ఇదో టపా' అంటూ పంపుతాడు - జిడ్డు వెధవ!' అని మనసులో గొణిగి-

"ఏమయ్యా రాజా..మళ్ళీ యివ్వచ్చుగదా ఈ టపాల్ని. దీన్ని పర్సనల్ రిజిష్టరులో ఎంటర్ చేసుకోవడం ఇప్పుడు అయ్యేపనేనా...అందులోనూ అన్నిటికీ నెంబర్లు ఇచ్చావు" అన్నాడు రాజు.

"అది నిన్నటి టపాలు సార్....నేను నిన్న సెలవు పెట్టానుగా అందుకే ఇవాళ ఇచ్చాను" అన్నాడు రాజా.

"సర్లే సర్లే" అంటూనే ఒక్కో ఉత్తరాన్నీ తీసి దాని సబ్జెక్టు మాత్రం చదివి పక్కన పెడుతున్నాడు. సబ్జెక్టులో అతి ముఖ్యం అనిపించినదాన్ని ఉత్తరమంతా పూర్తిగా చదివేసి దాని సారమంతా పిండుకున్నట్లు తల ఆడిస్తున్నాడు శంకరరావు.

"సార్...మీకో లెటర్ వచ్చింది..." అంటూ వచ్చాడు అటెండరు ఆంజనేయులు.

"తీసుకోనయ్యా....దాన్ని సోమవారం తీసుకురా" అంటూ తల ఎత్తకుండానే అన్నాడు శంకరరావు.

"ఇది మీ పర్సనల్ లెటర్ సార్... ఆఫీసుది కాదు" అన్నాడు ఆంజనేయులు.

"అలాగా...అయితే ఇలా ఇయ్యి"

ఆ కవర్ని అందుకుని చూశాడు. అది సాక్షాత్తూ తన ప్రియమైన భార్య ప్రమీల రాసిన ఉత్తరం!

నూటికి నూరుపైసల నిజమైన క్లర్కు తన పర్సనల్ లెటర్స్‌కి ఎంత విలువ యిస్తాడో శంకరరావు కూడా అంతే ఇస్తాడు.

అవును.. అందుకే ఆ కవరు ఆఫీసు టపాల కిందికి వెళ్ళిపోయింది.

తన పర్సనల్ రిజిష్టర్లో ఆ టపాల్నంతా నమోదు చేసుకున్నాక అడుగున పెట్టిన భార్య ఉత్తరం కనిపించింది.

"ఏం మనిషో...ఊరికి వెళ్ళిన పదిరోజులకి ఉత్తరం రాస్తుంది. అసలు మొగుడనే వాడు ఒకడు ఈ దిక్కుమాలిన ఊళ్ళో, మరీ దిక్కుమాలిన ఈ ఆఫీసులో గాడిద చాకిరీ చేస్తూ తన ఉత్తరం కోసం ఆందోళన పడిపోతాడన్న ఇంగితంకూడా లేదు' అని మనసులోనే గొణుక్కొంటూ కవర్ని చించి చదవనారంభించాడు శంకరరావు.

"ప్రియమైన శ్రీవారికి"

అని చదివి - 'ఛ..ఈ మనిషికి బుద్ధిలేదు. సంబోధన తర్వాత 'సబ్జెక్టు' అని రాసి అందులో ఉత్తరంలోని విషయమంతా సంక్షిప్తంగా రాయొచ్చు కదా -మూడు ముక్కల్లో ..ఉత్తరం రాసే విధానమే తెలీదు. ఎప్పుడు నేర్చుకుంటుందో...' అనుకుని మళ్ళీ చదవడం మొదలుపెట్టాడు.

"ప్రేమతో ఆత్మీయతానురాగాలతో మీ శ్రీమతి ప్రమీలాదేవి రాయు ఉత్తరం...

ఈ రోజు నా ఉత్తరం చూసిందాకా మీకో పెళ్ళామున్నట్టూ, దానికిద్దరు పిల్లలున్నట్టూ - అది మీరాకకోసం ఎదురు చూసీ చూసీ కన్నుల్లో కాయలు కాయించుకుంటున్నట్లూ జ్ఞాపకముండదనుకుంటా... ఉండదు. ఉండదు గాక ఉండదు. ఎందుకుంటుందీ? పెళ్ళయిన ఈ ఐదేళ్ళలో నేను పుట్టింటికి వచ్చాక ఎప్పుడైనా పిలుచుకొని వెళ్ళారా? ఎప్పుడూ ఏవో కుంటిసాకులు చెప్పడమే - లీవులేదనీ, నెలాఖరనీ.. జమాబందనీ.. ఆఫీసు ఇన్స్పెక్షననీ, అదనీ, ఇదనీ... నిజంగా మనసంటూ వుంటే మార్గముండదా శ్రీవారూ!

ఏ ముచ్చటయినా ఎప్పుడు తీరింది గనుక - ఇంతెందుకూ ఏ రోజైనా జాలీగా అలా మీతో పాటూ బజార్లోకి, వాకింగ్‌కి వెళ్ళి ఎరుగుదునా! ఎప్పుడూ మీకు ఆఫీసు వర్కు తప్పితే మరొకటి పట్టదుకదా!

నాకు అపుడపుడు అనాలనిపిస్తుంటుంది.

"నన్ను మనిషిలా చూడకండి, చక్కటి 'అర్జెంటు ఫైలు' లా చూడండి చాలు" అని. వచ్చే జన్మంటూ వుంటే - ఆ జన్మలో కూడా మీరు గుమస్తాగా వుంటే, నేను ఫైలునై పుడతా...కాదు కాదు..శాశ్వత పెండింగ్ ఫైలునై పుడతా -

బోరు కొడుతోందా శ్రీవారూ!

ఏ ఉద్యోగయినా తన ఉద్యోగాన్ని ప్రేమించాల్సిందే - అది దేశ శ్రేయస్సుకు మంచిదే - అయితే మీరు ప్రేమించరు, కాపురం చేస్తారు - అక్కడే వస్తుంది చిక్కంతాను.

ఇవన్నీ హాస్యానికన్నవేలే - కోపగించుకోకండి.నా బెంగల్లా మీరు వేళకింత తింటున్నారో లేదోననీ, ఫైళ్ళని ఇంటికి తెచ్చుకుని రాత్రంతా నిద్రమానుకుని తృప్తిగా రాసుకుంటారేమోననీ.

మీకు ఉత్తరం రాస్తుంటే మా అన్నయ్య జోకేశాడు. మార్జిన్‌లో ఆకుపచ్చటి ఇంకుతో "అర్జంట్ పుటప్ టుడే" అని రాయమని.

అయినా నేనెందుకు రాయడం లేదు - ఎందుకో తెలుసా? అలా రాసిన వాటిని మరింత అశ్రద్ధ చేయడం సగటు గుమస్తాకు అలవాటని, సి.టి.ఓ. ఆఫీసులో పని చేస్తోన్న మా ఫ్రెండు శాంతి చెప్పింది జ్ఞాపకానికొచ్చి మానుకున్నాను.

పాపా, బాబూ బావున్నారు. నాన్న కావాలంటూ ఉన్నాడు బాబు.

మీరు రాకపోతే మానె వెంటనే ఉత్తరమైనా రాయండి! రాయకపోయారో అక్కడికొచ్చాక 'మౌన పోరాటం' చేస్తాను - అంటే మాట్లాడకుండా సాధిస్తాను - అర్థమయిందా? ఉంటాను - మీ ఉత్తరం కోసం నిరీక్షిస్తూ...

మీ అర్ధాంగి ప్రమీల.

ఉత్తరాన్ని సాంతం చదివాక ఓ చిన్న నవ్వు నొకదాన్ని పెదాలతో వెలిగించాడు శంకరరావు.

'ఆఫీస్ ఇన్‌స్పెక్షన్ ఉన్నందువల్ల రాలేను' అని ఊరికెళ్ళేటప్పుడే ప్రమీలతో చెప్పాడు శంకరరావు. అయినా 'ప్రమీల ఎదురు చూస్తోందంటే...' శంకరరావు గుండెకు తడి అయింది. ఎంత ప్రేముంటే అలా ఎదురు చూస్తుంది.!

ప్రమీల ఉత్తరం చూసినప్పుడల్లా ఒకటనిపిస్తుంది - ఆమె ఎప్పటికయినా మంచి రచయిత్రి అవుతుందని - మనిషే వచ్చి ఎదురుగా కూచొని మాట్లాడుతున్నట్టు రాయడం ఎలా సాధ్యమవుతుందో - తనకయితే అర్థమే కాదు.

★ ★ ★

ఇంటికొచ్చాక జేబులో ఉత్తరాన్ని మరోమారు చదువుకుని తన భార్య ఉత్తరాల కలెక్షన్ ఫైల్లో పొందుపరిచాడు శంకరరావు.

ఆ రాత్రే ఉత్తరం రాసేయాలనిపిస్తోందతనికి, ఒకవేళ రాయకపోతే 'మౌనపోరాటం' చేస్తానన్న భార్య బెదిరింపు అదురు పుట్టిస్తోంది మరి.

తను పుట్టిబుద్ధెరిగిన నాటినుంచి ఏ ఐదారు సార్లో ఉత్తరాలు రాశాడు. అదయినా చదువుకొనే రోజుల్లో పరీక్షాపత్రాల్లోని ప్రశ్నలకి జవాబులుగా మాత్రమే. ఇక ఉద్యోగంలో చేరాక మాత్రం రోజుకో ఇరవై ఉత్తరాలు రాస్తున్నాడు. అవన్నీ అఫీషియల్ ఉత్తరాలాయె.

అయితే అవన్నీ వేరు -

పెళ్ళానికి ప్రేమలేఖ రాయడం వేరు -

ప్రేమలేఖని ఎలా రాయడం?

పెళ్లయిన ఈ ఐదేళ్ళలో రెండు పంక్తులున్న కార్డు ముక్కని ఒక్కసారైనా రాసి ఎరుగడాయె!

రాత్రి భోజనం చేసి వచ్చాక ఉత్తరం రాసే కార్యక్రమానికి పూనుకున్నాడు శంకరరావు.

'ప్రియమైన భార్యామణికి' అని ప్రారంభించి, ఆలోచనల్లో పడిపోయాడు. భార్యని ఏమని సంబోధిస్తారో....అసలూ 'భార్యామణి' అంటారో 'భార్యామాణిక్యం' అంటారో

లేక 'భార్యారత్నం' అంటారో, తెలీని సందిగ్ధంలో పడిపోయాడు కాసేపు - శంకరరావు.

సరేలెద్దూ 'మణి' అన్నదే ముద్దుగా వుంది అలానే వుండనీ - ఇంతకుమునుపు ఎవరూ వాడకుంటేనేం గాక తనే, వాడతాడంతే....! అనుకుని మళ్ళీ ప్రారంభించాడు. కానీ ఉత్తరం సాగేలేదు.

'ఉత్తరాల ఫైలు దగ్గరుంచుకొని రాయాల్సిందే లేకుంటే రాయడం ఎలా వీలవుతుంది?' అనుకుని చకచక అల్మారా దగ్గర కెళ్ళి ఫైలు తెచ్చుకుని పక్కనే ఉంచుకుని రాయబోయాడు.

అయినా సాగలేదు - తెలుగుకు ఏం తెగులొచ్చిందో కాని మంచి వాక్యాలు పడటం లేదు.

మామూలుగా శంకరరావు ఆఫీసులెటర్ ఏదయినా రాయాలనుకుంటే తెలుగులో ఆలోచించి ఇంగ్లీషులో రాస్తాడు.

ఈ మధ్య తెలుగు అధికారభాషా సంఘంవాళ్ళు తెలుగును కార్యాలయ భాషగా వాడి తీరాలన్న ఉత్తర్వులకు కట్టుబడి తెలుగులో ఆలోచించి ఇంగ్లీషులో రాసి మళ్ళీ దాన్ని తెలుగులోకి అనువదిస్తున్నాడు. ఇదీ అలా రాస్తేనో!..అబ్బ! బ్రహ్మాండమైన ఐడియా అనిపించింది శంకరరావుకి.

ఒక అర్ధగంట కల్లా ఇంగ్లీషులో రాయడం - తెలుగులోకి అనువదించడం పూర్తయింది. ఒక్కసారి ఉత్తరాన్ని మొత్తంగా చదివి తన ఆంగ్లాంధ్ర భాషా పాండిత్యానికి తనే మురిసిపోయాడు శంకరరావు.

మరుసటిరోజు ఉదయమే పోస్టు చేశాడా ఉత్తరాన్ని.

★ ★ ★

"అమ్మా ప్రమీలా! మీ ఆయనదగ్గర్నుంచి ఉత్తరమొచ్చిందే!" అంటున్న తల్లి కేకలు వినబడి దొడ్డివాకిట్లో చీర ఉతుకున్నదల్లా టక్కున లేచి సబ్బుచేతిని కొంగుకు తుడుచుకుంటూ వేగంగా వరండాలోకి వచ్చేసింది ప్రమీల. భర్త దగ్గరనుంచి ఉత్తరం రావడం నమ్మశక్యం కాకుండా వుందామెకు.

పట్టరాని ఆనందంతో, వణుకుతున్న చేత్తో అందుకుని ముసి ముసి నవ్వుల్ని పెదాల్లో బిగించి కవర్ని చించింది ప్రమీల. మెల్లగా కవరులోంచి ఉత్తరం తీసి చదవసాగింది.

ఎంత ఆనందంతో, ఉత్సాహంతో, చదవడం ప్రారంభించిందో అంత నీరుగారి పోయింది. ఆ ఉత్తరం రాసేపద్ధతీ అందులోని వాక్యాలూ, పదాలూ అలా వున్నాయి మరి. అసలు అందులో ఏం రాసి వుందో సరిగ్గా బోధపడటం లేదు ఆవిడకి.

రెండుసార్లు చదివింది.. ఉహూ!

మూడుసార్లు....ఉహూ!

నాలుగు సార్లు....ఉహూం

పన్నెండో సారి చదివింది...

ఏమీ అర్థం కాలేదు.

"ఏం రాశాడమ్మా అల్లుడు?" అడిగింది తల్లి.

"ఏమోనమ్మా.. అదే నాకూ అర్థం కావటంలేదు... ఏం రాశారో.. అసలెందుకిలా రాశారో ఏమిటో..." అంది అయోమయంగా ప్రమీల.

మొగుడు రాసిందాన్ని అర్థం చేసుకోలేకపోతే ఎలాగే పిచ్చిమొద్దూ!" అంటూ నవ్వుతూ ఇంట్లోకి వెళ్ళిపోయింది తల్లి.

'ప్రియమైన భార్యామణికి' అన్నదొక్కటే ఆ ఉత్తరంలో ఆమెకి స్పష్టంగా అర్థమవుతున్నది. తక్కిన దాంట్లో తను గర్భిణీ అయినందువల్ల జాగ్రత్తగా వుండమని సూచనలున్నాయి. తను ఇప్పుడు ఉట్టి మనిషని ఆయనకి మాత్రం తెలియదా? మరెందుకు అలా రాశారు చెప్మా! ఉన్నట్టుండి ప్రమీల తలలో అనుమానపు రేఖ తళుక్కుమని మెరిసింది.

కొంపదీసి ఆయనకి 'మణి' అనే మరో భార్య లేదు కదా! అలా అనుకుంటూనే ప్రమీల కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"అమ్మా! కొంప మునిగిందే..నా కొంప నిలువునా మునిగిపోయిందే..."

"ఏంటమ్మా...ఏమయిందే!" అంటూ వణుకుతున్న గొంతుతో ఉరుకుల పరుగులతో కంగారుగా వచ్చింది తల్లి.

"ఏమని చెప్పనే అమ్మా!...ఆయనకి ఎవరో 'మణి' అనే భార్య కూడా వున్నట్టుందే! అది ఇప్పుడు గర్భిణీ కూడా అయినట్టుంది. పొరపాటున నాకు ఈ ఉత్తరం పోస్టు చేసి, ఆ మణి' కి నాకు రాసిన ఉత్తరం పోస్టు చేసి ఉంటాడమ్మా... ఎంత పనయిందో చూడమ్మా!!" అంటూ ప్రమీల ఏడుపు కంఠంతో చెబుతూ వుంటే కూతుర్ని ఎలా ఓదార్చాలో తెలీక నిశ్చేష్టురాలై అలా శిలా ప్రతిమవలే చూస్తూ వుండిపోయింది

అందాక వరండాలో ఆడుతున్న పిల్లలు తమ తల్లికేదో అపాయం జరిగినట్టు అనిపించి ప్రమీల దగ్గరికి చేరి ఏడుపు మొహాలు పెట్టారు.

"ఈ మగజాతిని నమ్మడానికి లేదే తల్లీ! అందుకేనే అమ్మా మొగుణ్ణి ఎప్పుడూ ఓ కంట కనిపెడుతూ ఉండాలి" అంది ప్రమీల తల్లి - పసిదాన్ని తన చంకలోకి వేసుకుంటూ.

"ఆఫీసులో ఆయన చాలా పనుందంటూ రాత్రి ఏ తొమ్మిదింటికో, పదింటికో ఇంటికి వస్తే నిజమేనేమో అన్ని ఫైళ్ళు రాస్తున్నారేమో అనుకున్నానే.....తీరా ఆయన నిర్వాకం ఇదన్న విషయాన్ని పసికట్టలేక పోయానమ్మా!" అంటూ రాగాలు తీసి ఏడుపు మొదలుపెట్టింది ప్రమీల.

★ ★ ★

సాయంత్రం ప్రమీల అన్నయ్య గురునాథం ఇంటికి రాగానే జరిగిన విషయమంతా చెప్పేశారు తల్లీకూతుళ్ళిద్దరూ.

ఉత్తరం తీసి చూపింది ప్రమీల -

గురునాథం ఓ గంటసేపు ఆ ఉత్తరంతో కుస్తీపట్టాడు. తర్వాత నడినెత్తిన గీరుకుని ఆలోచించాడు. చెంపల్నీ, గడ్డాన్నీ ఏకకాలంలో నొక్కుకుని మరీ ఆలోచించాడు. కింద పెదవిని ముందరిపళ్ళతో కాసేపు, వేళ్ళతో కాసేపు నలిపి, పిండి పిండి మరీ ఆలోచించాడు.

అప్పుడు అతని ముఖ కవళికల్లో మార్పు చోటు చేసుకుంది.

అతని పెదవులలో కదలికలొచ్చాయి.

ముందు అది ముసి ముసి నవ్వులయ్యాయి.

మరింత విచ్చుకొని చిరునవ్వులయ్యాయి. ఆ తర్వాత శబ్దతరంగాలతో గలగల నవ్వులయ్యాయి.

గురునాథం గలగల నవ్వును చూసి బాగా కోపం వచ్చేసింది ప్రమీలకు - "ఎందుకన్నయ్యా! అలా నవ్వుతావు? నా కాపురం బుగ్గిపాలయి పోతుంటేనూ!" అంది.

"నీ తలకాయ్! బుగ్గిపాలు లేదూ, గిగ్గిపాలు లేదు...పాడు ఆలోచనలతో నీ బుర్ర పాడు చేసుకోకు... సగటు ఎన్.జి.ఓ.కి ఇద్దరు భార్యల్ని చేసుకునే తీరికా, కోరిక కూడానా ప్రమీలా?!? చూడమ్మా! ఉత్తరం చదువుతాను....

"ప్రియమైన భార్యామణికి,

విషయం :

ఇల్లు - వాకిలీ - గర్భిణీ స్త్రీల సూచనలూ - నా ఆరోగ్యం - నీ క్షేమం హోటలు భోజనం - నీ కొరకు

నిరీక్షణ - అందరి క్షేమాలు అడుగుట - గురించి.

నిర్దేశము : నీ ఉత్తరం నెంబరు :లేదు, తేది : లేదు

పైన కనబరచిన నిర్దేశము గమనించునది. మునుపు ఊరికి వెళ్ళెదనంటూ మారాము చేసి వెళ్ళిన తర్వాత తొందరగా వచ్చెదనని ఉత్తరమును రాసి రాకపోయితివి. ఇది నీకు తగదు. ఈమారు అటుల చేయకూడదు. అటుల చేసిన తదుపరి చర్య తీవ్రముగా నుండగలదని ఇందుమూలముగా నీకు తెల్పడమైనది. నేను ఆరోగ్యముగా నుంటిని. నీ ఆరోగ్యమును, క్షేమమును సదా నేను కోరువాడను.

నీవు గర్భిణీ స్త్రీవి గనుక, ఇప్పుడు నవమాసములు నిండుచున్నవి గనుక బహు జాగ్రత్త వహించమని నిన్ను కోరడమైనది. ఎక్కువ బరువును మోయవలదు. ప్రతిదినము సాయంత్రం వాహ్యాళికి వెళ్ళి రమ్మని ఎన్నిమార్లో చెప్పియుంటిని. అది నీకు గుర్తు వుండే వుండును. అయినను మరొక్కమారు తెలిపెదను.

ప్రస్తుతము నేను హోటలు ఆహారమునే భుజించుచున్నవాడను. అందులకే నీ

ప్రస్తుతము నేను హోటలు ఆహారమునే భుజించుచున్నవాడను. అందులకే నీ కొరకు సదా నిరీక్షించుచుంటిని. అయినను ఏమి లాభము? నీవు పురుడు పోసుకొను వరకూ రావుగదా! కానిమ్ము....పురుడు పోసుకొనగానే లేఖ వ్రాయునది. అందరి క్షేమములు కాంక్షించువాడను.

ఇట్లు నీ విశ్వాసపాత్రుడు

నీ పతి

శంకరరావు"

"చూశావా ప్రమీలా! బావగారు అక్షరాలా నీకు రాసిన ప్రేమలేఖే నమ్మా ఇది"

"అదెలాగన్నయ్యా! నేనే గర్భవతినా?" అడిగింది ప్రమీల.

"ఆవేశపడకమ్మా నిదానంగా అర్థం చేసుకో ఈ ఉత్తరాన్ని...నేనూ ఓ సగటు గుమస్తాగాణ్ణే కాబట్టి మీవారి పరిస్థితినీ, ఈ లేఖనీ అర్థం చేసుకున్నా... మొన్న నువ్వు బావగారికి రాసిన ఉత్తరం చదువుతూనే - తప్పకుండా ఈసారి ఉత్తరం రాసి తీరాలన్న సత్సంకల్పంతోనూ, ఉబలాటంతోనూ ఈ ఉత్తరం రాశాడు పాపం! అయితే గుమస్తాకు సుగుణం ఒకటుందమ్మా... అదేమిటంటే...ఏరోజు వచ్చిన ఉత్తరానికి ఆ రోజు జవాబు రాయకపోవడం...అందువలన...

ఇన్నేళ్ళ ఉద్యోగపుటలవాటుతో ఇంతకుమునుపు నువ్వు రాసిన ఉత్తరానికి - అంటే.. నువ్వు గర్భిణీగా ఉన్నప్పుడు రాసిన ఉత్తరానికి సమాధానం ఇప్పుడు రాశాడన్న మాట. మరి ఆ లెక్కన మొన్న నువ్వు రాసిన ఉత్తరానికి జవాబు ఎన్నేళ్ళకొస్తుందో ఊహించుకోమ్మా! ఊహించుకో!"

అంటూ నవ్వుతోన్న గురునాథాన్ని చూసి -

"అమ్మయ్యా! బతికించావన్నయ్యా.... పాపం బంగారం లాంటి వారిమీద..." అంటూ సిగ్గుపడిపోయింది ప్రమీల.

(విపుల - మార్చి, 1989)

# పిడుగులు

**మా** అమ్మమ్మకు డజను మంది పిల్లలు - అరడజను ఆడా, అరడజను మగా ... ఆమె నిక్షేపంగానే ఉంది, ఇప్పటికీ. మా అమ్మకు అరడజనుకు ఒకరు ఎక్కువ - నలుగురు ఆడా, ముగ్గురు మగా... ఆమె కూడా మహా నిక్షేపంగా ఉంది.

మరి నాకూ!

ఇద్దరంటే ఇద్దరే పిల్లలు - ఒక ప్లస్సూ, ఒక మైనస్సూ ... నేను మాత్రం నిక్షేపంగా ఉన్నానని ధైర్యంగా చెప్పుకోలేను.

ఎంచేతంటే - మా అమ్మమ్మకూ, మా అమ్మకూ పుట్టింది పిల్లలు మాత్రమే, మరి నాకు మాత్రం పుట్టింది పిడుగులాయె! నేనెలా నిక్షేపంగా ఉండగలను.

దేశంలో కుటుంబ నియంత్రణ వారి పుణ్యమా అని ఇద్దరంటే ఇద్దరే పుట్టారు. ఏ డజనో, అరడజనో పిల్లలు అయి ఉంటే ఏ అడవుల్లోకో పారిపోయి ఉండేదాన్ని!

మా వారు టిఫిన్ చేసి తొమ్మిది గంటలకే ఆఫీసుకి వెళ్ళిపోయారు. మా నోము ఫలాలకీ టిఫిన్ అన్న పదార్థం పెట్టాలి కదా అని, ఇంటి బయటికొచ్చి – "ఏయ్ బఫ్వీ! ఒరేయ్ కిన్నూ!!" అంటూ గొంతు చీలిపోయేలా పిల్చాను.

"ఆ పక్క కాంపౌండ్‌లో ఆడుకుంటున్నారక్కా!" అని చెప్పింది పక్కింటి పద్మ.

"కొంచెం పిలువు పద్మా!" అన్నాను.

ఆ అమ్మాయి రెండు నిమిషాల్లో తిరిగొచ్చి - "వాళ్ళు రారంట అక్కా! కాకరపూలు ఏరుకుని బండమీద పోసుకుని ఆడుకుంటున్నారు!" అంది.

ఎంత నిర్లక్ష్యం ఈ పిల్లలకి! వేలెడంత లేరు. నా కోపం నషాలానికి ఎక్కుతుండగా కాంపౌండు దగ్గరికి వెళ్ళి చూశాను. అక్కడ కాకరపూల (పున్నాగ పూల) చెట్టుకింద కూచుని కాకర పూల కాడల్ని మేళంలా నోట్లో పెట్టుకుని ఊదేస్తూ ఉన్నారు.

"ఏయ్ బఫ్వీ! కిన్నూ! రండీ!" అంటూ గుద్దురిమాను.

ఈ దేశంలో తల్లిమీద బిడ్డలకి ఉన్న నిర్లక్ష్యం చిన్నప్పటి నుంచే వస్తుందనటానికి తార్కాణం మా పిల్లలే!

నన్నో పనికిమాలిన దాన్ని చూసినట్లు ఓ చూపు విసిరి 'వస్తాను ఉండమ్మా!" అన్నాడు కిన్నూగాడు.

"ఇదిగో ముందు అక్కణ్ణుంచీ లేస్తారా? తన్నులు కావాలా?" అన్నాను కోపంగానే.

'ఈ రాక్షసి వదిలేలా లేదురా' అన్నట్లు నావేపు ఓసారి చూసి - "ఓరే కిన్నూగా! పదరా పోదాం! ఇంట్లో ఆడుకుందాం పదా! " అంది బప్పీ. ఇద్దరూ లేచి నిల్చున్నారు.

'మేమేదో దయతలచి వస్తున్నామే కానీ నీ అరుపులకీ, తన్నులకీ జడిసి మాత్రం కాదు సుమా!' అన్న ధోరణిలో నిదానంగా పూలనన్నింటినీ ఒళ్ళో వేసుకుని పెళ్ళి నడకతో బయల్దేరారు.

గబగబా ఇంట్లోకి వెళ్ళాను - వాళ్ళకి టిఫిన్లు రెడీగా ఉంచడానికి. రెండు ప్లేట్లలో చపాతీలూ, ఉర్లగడ్డ కూరా ఉంచాను. ఎలాగూ వస్తున్నారు కదా అని ఎదురుచూస్తూ కూచున్నాను. ఎంతకీ రారే! ఏమయ్యారు వీళ్ళు! అని మళ్ళీ వాకిట్లోకి తొంగి చూశాను. నిదానంగా చీమ నడకతో కాకరపూల రెక్కల్ని బుడగలుగా మార్చే ప్రయత్నం చేస్తూ వున్నారు.

"ఏం బిరిబిరీ నడవలేరా? లేక, రెండు అంటించాలా?" అన్నాను విసుగుతో.

"ఎందుకు అంటిస్తావు?" అన్నాడు కిన్నుగాడు. అదోలా నావైపు చూస్తూ.

వాడు నేర్చుకున్న మాటల్లో 'ఎందుకు?' అన్నది మొదటిది. ప్రతి మాటకీ ముందు దాన్ని ప్రయోగిస్తుంటాడు. వాడి 'ఎందుకు'కు సమాధానం చెప్పకుండా ఇద్దరి రెక్కలూ పుచ్చుకుని బాత్‌రూమ్‌లోకి లాక్కెళ్ళి చేతుల్ని శుభ్రంగా కడిగించి పళ్ళేల ముందు కూలేశాను.

"అయ్యో! చపాతీలేనా!" అంది నిరుత్సాహంగా బప్పీ.

"ఎందుకు చేసినావమ్మా చపాతీలూ, నాకొద్దు!!" అన్నాడు కిన్నూగాడు.

"నోర్మూసుకుని తినండి!" అరిచేశాను.

"ఎందుకు తినడం!" అంటూ వాడు.

"నోర్మూసుకుని ఎట్లమ్మా తినడం!!" అంటూ అది.

"ఎందుకూ, ఎట్లా అన్నారంటే నాలిక్కోసేస్తాను - మీరు పిల్లలు కాదర్రా పిడుగులు! ఊ తినండి! తినకపోయినారంటే కట్టె తీసుకుని కూరుతాను!" అన్నాను పూర్తిగా అసహనంగా.

"మేము తినం అంటే కూరతాను అంటావు - రాత్రి నాన్న తినను అంటే ... పోనీ ఏం చేయాలో చెప్పండి అన్నావే! బతిమాలుతూ!" అంది బప్పీ.

నిజానికి వీళ్ళని కాదు అనాల్సింది, వీళ్ళ బాబుని అనాలి ... తిండి విషయంలో ఆయన మహా చండశాసనుడు - ఇష్టం లేని తిండి వేలితో కాదుకదా కొనగోటితో కూడా తాకడు. పులి కడుపున పిల్లులు పడతాయా?

"ఈ పూటకి ఎట్లో ఒకట్ల సర్దుకోండర్రా!" అంటూ నేనే రాజీకి దిగాను.

"సరే, అయితే ఈ ఉర్లగడ్డకూర నేను తినను!" అంది బప్పీ.

"నేను దీన్ని తినను" అంటూ కిన్నుగాడు.

అది 'తానా' అంటే, వీడు 'తందానా' ... ప్రతి విషయంలోనూ ఇంతే!

"మరి ఏం చెయ్యాలో చెప్పన్నా ఏద్వండి!!" అన్నాను కోపాన్ని దిగమింగుతూ.

"ఆమ్లెట్ కావల్లా!!" అంది బవ్వీ.

"నాకూ ఆమ్లెట్టే కావల్ల"

"చచ్చాన్రా దేవుడా!" అనుకుంటూ వంటింట్లోకి దూరాను ఉల్లిపాయల్ని తరిగేందుకూ. ఏమయితేనేం. పావుగంటలో రెండు ఆమ్లెట్లూ తయారుచేశాను. అప్పుడు బుద్ధిగా తిన్నారు పిడుగులిద్దరూ!

"ఏమ్మా సుమా! బావున్నారా?" అంటూ కొత్తగొంతు వినిపిస్తే బయటిగదిలోకి తొంగిచూశాను. ఎవరో లావుపాటి ఆవిడ. ఆమె ఎవరో నాకైతే గుర్తులేదు. కనీసం గొంతయినా గుర్తుపట్టలేకపోతున్నాను. కంచుగంటలా 'ఖణేల్' మంటోంది ఆమె కంఠం!

"ఆ బావున్నానండీ!" అంటూ బయటి గదిలోకి వచ్చాను. ఆవిడ ఆకారాన్ని పరిశీలిస్తూ. ఆవిడ ఎర్రగా బొద్దుగా ఉంది. మొహం కోలగా ఉంది. కళ్ళకి సోడాబుడ్డి కళ్ళజోడు పెట్టుకుని వుంది. మధ్యగా తీసిన పాపిటకి ఇరువైపులా తెలుపూ, నలుపు సమంగా ఉన్న జుత్తు ఉంది. పాపిట మొదట్లో పావుకిలో ఎర్రటి కుంకుమ అద్ది ఉంది. నుదుటిమీద అరకిలో కుంకుమతో పెద్ద రూపాయి కాసంత బొట్టు పెట్టి ఉంది. చిన్నటి ఎర్రపూవుల మధ్య నీలపు ఆకులున్న పసుపు చీర కట్టుకుని ఉంది. అదేరంగు జాకెట్టు వేసుకుని, చెవులకి పెద్ద పెద్ద రవ్వల కమ్మలూ, ముక్కుకి ఇరువైపులా బొటనవేలంతటి ముక్కెరలూ, మెడలో ఓ పది కిలోల కిమ్మత్తు కలిగిన రకరకాలయిన దండలూ వేసుకుని ఉంది. పెదాలకి ఏ నగలు అలంకరించటానికి వీలుపడదనేమో చిరునవ్వుని పులిమినట్టుంది. ఈమె ఈ జన్మలో కాకున్నా వెనక జన్మలోనైనా అందగత్తయి ఉంటుంది. అందుకే ఇంత లావులోనయినా పూర్వజన్మ అందం వీడనట్టు అనిపిస్తూ ఉంది. నిర్మలంగా నవ్వుతూ ఉంది – నేను గుర్తుపట్టనట్టు చూస్తూ ఉన్నా కూడా!

"నన్ను గుర్తుపట్టలేదు కదా! నేనమ్మా, కాంతాన్ని! మీకు చానా దగ్గిర బంధువునమ్మా! మీ మేనమామ నారాయణ లేడా ఆయప్ప మామ తమ్ముడు ఈశ్వరయ్య బామ్మర్ది చెల్లెలి ఆడబిడ్డనమ్మా! మీ మరిది రాఘవులు పెండ్లిలో నన్ను చూసినావు, మనిద్దరమూ ఒకే బంతిలో కూచ్చోని పక్క పక్కనే భోంచేసినాము కూడా!" అంది నవ్వుతూనే.

అమోఘమైన ఆమె జ్ఞాపకశక్తి మీద అపారమైన గౌరవం కలిగిందా క్షణంలో. వెంటనే ఆమెకు గోద్రేజ్ కుర్చీ వాల్చాను.

"టిఫిన్ తెస్తానుండండి!" అంటూ వంటింట్లోకి వెళ్తుంటే.

"వద్దమ్మా సుమా! ఇప్పుడే మా బావ వాళ్ళింట్లో టిఫిన్ తినేసి వస్తిని. ఎట్లా ఈ ఊరికి వచ్చినాను కదా అని మిమ్మల్ని చూసిపోదామని ఇట్ల వస్తిని... ఈ ఇల్లు మా బావ చూపించె... అన్న ఆఫీసుకి పోయినాడేమో కదా!" అంటూ నన్ను అక్కడే ఆపేసింది. నేను మరో కుర్చీలో కూలబడిపోయినాను.

ఆమె మాటలన్నిటికీ 'ఊ', 'అవును' లతో సరిపెడుతూ ఉన్నాను.

కొత్తవాళ్ళతో ఏమ్మాట్లాడాలో నాకైతే ఎప్పటికీ అర్థం కాని విషయం. బవ్వి, కిన్నూలు నాకు చెరోవైపు చేరి ఆనుకుని ఆవిడనే చూస్తూ ఉన్నారు.

"అమ్మా! ఎవరే!" అంది మెల్లగా బవ్వి.

ఏం చెప్పాలి నేను .... ఆమె చెప్పిన బీరకాయ పీచు బంధుత్వంలో ఆమెని ఏ వరుసతో పిలవాలని చెప్పనూ!

"నేను మీ పెద్దమ్మనమ్మా! పాపా! నీ పేరు చెప్పమ్మా! అంది నవ్వుతూ.

"నా పేరూ... బవ్వీ, వాని పేరు కిన్నూ" అంది మొహంలో ఏ మార్పూ లేకుండా.

"అవి ముద్దు పేర్లేమో... అసలు పేర్లు చెప్పూ!"

"భవ్య దీని పేరు, కిరణ్ వీని పేరు" అన్నాను నవ్వు పులుముకుని.

"ఏం చదువుతున్నార(్రా మీరిద్దరూ!" అంటూ బవ్వీని దగ్గరికి లాక్కొని, కిన్నూగాని కోసం చేయి చాచింది. వాడసలే 'అమ్మకూచి'. నా ఒళ్ళోకి దూరుకున్నాడు.

"ఇప్పుడు చెప్పు, ఏం చదువుతున్నావూ ... ఫస్ట్ క్లాసా, సెకండ్ క్లాసా?"

"అంటే?" అంది బవ్వి - వింతగా ఆమెవైపు చూస్తూ.

"తెలీదా? ఒకటో క్లాసా, రెండో క్లాసా నువ్వు చదివేది?"

అయోమయంగా నావైపు చూసింది ఆవిడ.

"ఇంకా ఏం లేదక్కా ...అసలు బడికి పంపనేలేదు" అన్నాడు.

"ఇంత ఎత్తుంది బడికి పంపనేలేదా? ఎన్నేళ్ళూ?"

"దీనికి అయిదున్నర, వీన్నికి నాలుగేండ్లు" అన్నాను.

"మరింకేమ్మా ఈపాటికి పాప 'యూకేజీ', వీడు 'నర్సరీ' ఉండాల్సిందీ!"

"మా ఆయనకి కాన్వెంటు స్కూళ్ళంటే గిట్టవండీ!"

"అదేందమ్మా బలే విచి(్రంగా ఉందే! పిల్లలని ఇప్పట్నించీ ఇంగ్లీషు చదువులు చదివిస్తే గదా అంతో ఇంతో నేర్చుకొనేది. ఈ వయసు పిల్లోల్లకి ఎన్నెన్ని ఇంగ్లీషు రైమ్సు వస్తుందల్లా, ఏం కతా! కొత్తవాళ్ళు ఎవరన్నా ఇంటికొస్తే "ఏదమ్మా ఒక 'రైమ్' చెప్పూ!" అంటూనే పది రైములు వరసబెట్టి గడగడా వప్పజెప్పేయ్యల్ల, తెల్సిందా? మా పెద్దపాప ఆదిలక్ష్మి పిల్లలు ఇదే వయస్సువాళ్ళు. నోరు తెరిస్తే ఇంగ్లీషు పద్యాలేనమ్మా. ఏం తెలివితేటలో... అంత తెలివైన పిల్లల్ని నేను ఎక్కడా చూడలేదమ్మా!" అంటూ మురిసిపోతూ, చెప్పుకుపోతూ ఉంటే నాకు ఒళ్ళంతా జెర్రులు పాకినట్టు కంపరంగా ఉంది.

తన పిల్లలు ఇతరులకి తెలివితక్కువ వాళ్ళగా అనిపిస్తే ఏ తల్లికి మాత్రం బాధ కలుగదూ? నాకు అట్లాంటి బాధే కలిగింది. ఆ లావాటి మనిషిని బయటికి ఈడ్చేసి, పిల్లల్ని చావబాదుదు బాదాలనిపించింది ఆ క్షణంలో. 'నాగరికతా లక్షణాలలో నవ్వుతూ మాట్లాడటం అన్నది ఒకటి' అని ఎక్కడో మెదడులో గూడుకట్టుకుని

ఉండటం చేత ఆవిడ లక్షణంగా కుర్చీపైన కూచుని ఉంది, నేను లేని నవ్వుని పులుముకుని మాట్లాడుతున్నాను టీవీ ఎనౌన్సర్‌లా.

నిజానికి మా పిడుగులు గొప్ప తెలివితేటలు ఉండే పిల్లలు కాదుకానీ, తెలివి తక్కువ పిల్లలు మాత్రం కాదన్న విషయం నాకు తెలుసు. అయితే, అది ఇతరులకి ఎలా చెప్పడం! తప్పంతా మాదేనేమో ఇంత వయసు వచ్చినా వాళ్ళని కాన్వెంటు స్కూళ్ళకి పంపకపోవడం ... కనీసం ఒక్క ఇంగ్లీషు పాటో, పద్యమో నేర్పకపోవడం.

"ఇప్పటికయినా మించిపోయిందేది ఏమి లేదమ్మా సుమా! ఏదన్నా మంచి కాన్వెంటు స్కూలు జూసి చేర్పించండి! వీళ్ళు స్కూలుకు పోతే నీక్కొంచెం తీరిక దొరుకుతుంది" అంది కాంతమ్మ.

"ఆరేండ్లు వచ్చేదాక బళ్ళో చేర్పించను అంటాడక్కా! మా ఆయన" అన్నాను ఏమనాలో తెలీక.

"ఇదంతా చూస్తుంటే మీరు పాతకాలపు మనుషులు మాదిరి ఉన్నారమ్మా! ఇప్పుడు పిల్లల్ని పాడుచేస్తారు. పెద్దయినాక వీళ్లు మిమ్మల్ని తిట్టిపోస్తారు" అంది కాంతమ్మ అంతిమతీర్పు ఇస్తున్న జడ్జిలా.

ఆమెమాటల్ని కాదనలేకపోయినాను. ఓ అరగంట ఆమాటా, ఈమాటా మాట్లాడాక వెళ్ళిపోయిందావిడ.

మధ్యాహ్నం భోజనానికి మావారు వచ్చినప్పుడు ఆవిడ గురించీ, ఆవిడ అన్న మాటలు గురించీ చెప్పాను. అన్నీ విన్నాక – "మన పిల్లల చదువు విషయంలో నువ్వేం దిగులు పెట్టుకోకు. చదువుదేముందీ దానంతటదే వస్తుంది!" నింపాదిగా, సుష్టుగా భోంచేసి తృప్తిగా నావైపు చూస్తూ అన్నాడు.

అంతే ఈ మనిషి – ఈయన ఆదర్శాలూ, సిద్ధాంతాలూ, నాకెప్పుడూ అర్థం కావు. ఊరందరిదీ ఒకదారయితే ఉలిపిరి పిట్టది ఒక దారంట ... తక్కిన తల్లిదండ్రులు 'పిల్లల చదువులో' అంటూ ఎంతెంతో ప్రయాసపడుతూ ఉంటే...ఈ మనిషికి చీమకుట్టినట్టయినా లేదాయె మరి! అంతా నా కర్మ!!

"మనం 'మమ్మీ, డాడీ' అని పిలిపించుకుందామండీ పిల్లల్తో" అన్నాను ఓరోజు. అంతే 'ఖయ్'మని లేచాడు. "సుమా!" నీతల్లో మెదడనే పదార్థం ఉందా? ఉంటే అది ఆలోచించడం మానుకుందా? "అమ్మా! నాన్నా!" అనడంలో ఉన్న ఆత్మీయతా, ఆప్యాయతా 'మమ్మీ, డాడీ'లతో ఉన్నాయా" అంటూ ఎగిరెగిరిపడ్డారు.

ఆయనకు 'మమ్మీ డాడీ'లే కాదు, ఎ,బీ,సీ,డీలు పిల్లలకి నేర్పించడమన్నా అంత ఇష్టంలేదు. ఓసారి పలకలో ఏ,బీ,సీ,డీలు రాసి ఇచ్చాను. అది చూసి ఆయన, "ఇంగ్లీషు అక్షరాలు 26 మాత్రమే సుమా! సులభంగా నేర్చుకుంటారు. తెలుగులో ఏభై ఆరు అక్షరాలు ... వత్తులూ, దీర్ఘాలూ కలిపితే రెండువేలకు పైబడి ఉంటాయి. వీటిని నేర్చుకోవడం అంత సులభం కాదు అందుకే తెలుగు నేర్పు ... ముందు 'ఏబీసీ'లు నేర్చుకున్న పిల్లలు 'అఆ'లు నేర్చుకోవాలంటే ఇబ్బంది పడతారు...." అంటూ లెక్చర్ దంచేశాడు.

"కనీసం ప్రైవేట్‌కయినా పంపిద్దామండీ పిల్లల్ని!" అంటూ ఓ రాత్రి పడుకోబోయే ముందు మెల్లగా చెప్పాను. గుర్రుమని నావైపు చూశారు. "ఏదో ఓ పూట అట్ల అలవాటు కానీలేండి!" అన్నాను. ఏ మూడ్‌లో ఉన్నారో ఏమో గానీ 'ఊ' అనేశారు.

ఎట్టకేలకు ఓ శుభోదయాన బవ్వీని, కిన్నూగాణ్ణి ఓ ప్రైవేటులో చేర్పించి 'అమ్మయ్యా!' అనుకుని ఇంటికొచ్చేశాను. చాలా హాయిగా ఉంది మనసు, ఓ మంచి పనిచేసిన ఫీలింగు! అ ఆలతో పాటూ, ఇంగ్లీషు అక్షరాలూ, రైమ్సూ నేర్పించమని పదే పదే చెప్పి వచ్చాను. ఇంక ఎవరయినా కొత్తవాళ్ళు ఇంటికొస్తే 'ఝామ్మని' రైమ్సు చెప్పండర్రా! అనేస్తే చాలు ... పిడుగులు చెప్పేస్తారు... 'ఆహా ఎంత తెలివయిన పిల్లలమ్మా! మీ పిల్లలూ, మేమెక్కడా ఇంత తెలివయిన వాళ్ళని చూడలేదు అనక చస్తారా!' అని ఊహించుకుంటూ నా మనసు ఆనంద తాండవం ఆడింది. ఇవన్నీ మావారితో చస్తే చెప్పకూడదని నిర్ణయించుకున్నాను.

ఉన్నట్టుండి వంటింట్లోకి ఘొళ్ళున ఏడుపు వినిపించింది. బయటికి వచ్చి చూద్దును కదా పిల్లలిద్దరూ పెద్ద పెట్టున ఏడుస్తూ వస్తూ వున్నారు. అయోమయంలో గుండెలు కొట్టుకుంటూ ఉండగా ఎదురెళ్ళి ఆత్రంగా "ఏం జరిగింది?" అన్నాను.

"అమ్మా! మరేమో ...ఊ ...ఊ" అంటూ బెక్కుతోంది బవ్వీ.

"చెప్పవే! ఏం జరిగింది?" ఆత్రంగా నేను.

"ఊ ... ఊ ... టీచరు కొట్టింది!" ఏడుస్తూ అంది.

"నిన్ను కొట్టిందా?" అడిగాను కిన్నూగాడిని.

"ఊహూ బవ్వీని కొట్టిందమ్మా!"

"మరి నువ్వెందుకూ ఏడవడం?"

"మరీ మరీ ... బవ్వీని కొట్టింది కాబట్టి!"

"ఎందుకు కొట్టిందే టీచరు?"

"టీచరు 'అ, ఆ' రాసిచ్చింది పలకలో ... నేను 'అ ఆ' రాస్తా ఉన్నాను. అయినా గాని కొట్టిందమ్మా!" అంటూ ఏడుస్తూనే చెప్పింది.

టీచరు ఎందుకు కొట్టిందో కనుక్కురమ్మని పంపాను పద్మని. వెంటనే కనుక్కు వచ్చిందా అమ్మాయి. "అ ఆలు తిరగేసి రాసిందట అక్కా! సరింగా రాయమంటే, 'నేను ఇట్లే రాస్తాను' అంటూ రాస్తా ఉంటే చిన్నగా కొట్టిందంట!!" అని పద్మ చెబుతోంటే నాకు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఏం మనిషో! ప్రైవేటుకి వేసిన రోజే కొట్టాలా? ముందుముందు ఈ పిల్లల్ని ఎంత కొడుతుందో కదా అని నాకు మరీ ఏడుపు ముంచుకొచ్చేసి పిల్లలిద్దర్నీ హత్తుకున్నాను.

పిల్లలకి ప్రేమతో చదువు నేర్పాలనీ, పాఠశాలలన్నీ ప్రేమ మందిరాలలా ఉన్నప్పుడే పిల్లలకి చక్కటి విజ్ఞానం, మనో వికాసం కలుగుతాయని అపుడపుడూ మావారు అనే మాటలు జ్ఞాపకానికొచ్చాయి. అది సరేగాని, ఈ విషయం ఆయనికి తెలిస్తే నన్ను ఉప్పుపాతరవేయరూ, అధమం మాటలతో గుండెను చీల్చనైనా చీల్చేస్తాడు ... అని అనుకుంటూ ఉంటే కాళ్ళలోనూ, వెన్నులోనూ ఒకేసారి వణుకు ప్రారంభమైంది.

"ఒసే బబ్బీ! మీ టీచరు కొట్టడమూ, నువ్వు ఏడవడమూ ఇవన్నీ మీ నాన్నతో చెప్పొద్దు!" అంటూ బుజ్జగించినట్టు చెప్పాను, మూరెడు గ్లాసుకి పాలిస్తూ.

"ఊ" అంటూ కొండపల్లి బొమ్మలా తల ఆడించింది. పద్మతో రెండు చాక్లెట్టులు తెప్పించి లంచంగా ఇచ్చాను పిడుగులిద్దరికీ.

మధ్యాహ్న భోజనానికి రాలేనని ప్యూన్‌తో చెప్పి పంపారు ఆయన. సాయంత్రం అయిదున్నర అవుతున్నట్టే వచ్చేశారు. ఆయనకి కాఫీ ఇవ్వడానికని వంటింట్లోకి వెళ్ళాను.

బబ్బీ ఎప్పుడొచ్చిందో నా దగ్గరికి గుసగుసలతో "అమ్మా! నాన్నతో టీచరు కొట్టిందని చెప్పదునా!" అంది రహస్యంగా. ఇదంతా కిన్నూగాడు కనిపెడుతూ ఉన్నాడు.

"వద్దే! అందుకే గదా! చాక్లెట్లు కొనిచ్చింది" అన్నాను.

"సరే!" అంటూ ఏమీ ఎరుగని దానికిమల్లే వెళ్ళిపోయింది - బయట గదిలోకి. కిన్నూగాడు కూడా తలాడించేసి వెళ్ళాడు.

నేనింకా కాఫీని గ్లాసులోకి పోస్తూ ఉన్నాను. బయటినుంచీ బబ్బీ అంటోంది కదా! - "నాన్నా! నన్ను టీచరు కొట్టలేదు, నేను ఏడవలేదు" అని.

"ఓసి పిడుగా!" పళ్ళు నూరుకున్నాను.

"ఏందమ్మా! టీచరు కొట్టకుంటే ఎందుకేడుస్తారు ఎవరైనా?" అంటున్నాడాయన- పసిపిల్ల ఏదో ఒకటి మాట్లాడేస్తుందిలే అని.

"అవున్నాన్నా! టీచరు కొట్టలేదు - బబ్బీ ఏడవలేదు ... అమ్మ మాకు చాక్లెట్లు ఇవ్వలేదు... మేము తినలేదు!" అంటూ కిన్నూగాడు.

నేను దడదడలాడుతున్న గుండెలతో కాఫీ టీసుకువెళ్తే మావారు తికమకతో నావైపు చూశారు. నాకు నవ్వాలో ఏడవాలో తెలీదు. ఈ పిడుగులతో నాకు చావొచ్చింది.

చిట్టచివరికి అసలు విషయం వివరంగా చెప్పేసి తలవాచేలా చివాట్లు తినాల్సి వచ్చింది.



తన ఉనికిని తెలుపుకోడానికి అపుడపుడూ దేవుడు కరుణిస్తాడల్లే ఉంది. లేకపోతే పక్కవీధిలో బంధువుల ఇంటికి వెళ్ళడానికి సైతం ఒప్పుకోని మావారేమిటీ, కర్నూలులో ఉన్న మా అక్కయ్య ఉమను చూసిరావడానికి ఒప్పుకోవడమేమిటీ!

ఓ మూడు రోజులు ఆఫీసుకి సెలవుపెట్టారు మావారు. అందరం బయల్దేరాం. సాయంత్రం అయిదు గంటలయింది కర్నూలులో మా అక్కయ్య వాళ్ళిల్లు చేరుకునే టప్పటికి. బావగారు అదేదో ఆఫీసులో ఇంజనీరుగా ఉన్నారు. మంచి స్థితిగల కుటుంబం వాళ్ళది. అక్కయ్యకి ముగ్గురు పిల్లలు, పెద్ద పిల్లలు ఇద్దరూ మా పిడుగుల కంటే పెద్దవాళ్ళే. మూడోది కిన్నూగాడి కంటే ఏడాది చిన్నది.

"ఒరేయ్! మీ అనంతపురం ఆంటీ అంకులు వచ్చినార్రా!" మమ్మల్ని చూసి నవ్వుతూ. పిల్లలు ముగ్గురూ చుట్టుకున్నారు. ఐదు నిమిషాల్లో పిల్లలు అయిదుగురూ ఒక గ్రూప్‌గా, పెద్దలంతా ఒక గ్రూప్‌గా విడిపోయినాం. అక్కయ్య పిల్లలు వాళ్ళ బొమ్మలు చూపిస్తూ ఉంటే మా బవ్వీ, కిన్నూలు ఆనందపడిపోతున్నారు.

అక్కయ్య 'టీ' చేసి ఇచ్చింది. అప్పటికీ మా బావ ఇంకా రాలేదు.

"ఏమే సుమా! పిల్లలు ఏం చదువుతున్నారే!" అంది నవ్వుతూ పిల్లలవైపు చూస్తూ- అక్కయ్య.

నేను పాతపాటే పాడాను.

"ఇంత వయసొచ్చినా స్కూల్లో వేయనే లేదా!" అంటూ ఆశ్చర్యపోయింది అక్కయ్య.

"ఆరేండ్లలో పడుతానే బళ్ళో వేస్తాం వదినమ్మా!" అన్నాడు మా ఆయన నవ్వుతూ.

"ఏమప్పా! మరీ పాతకాలపు మనిషి మాదిరున్నావు! మా పిల్లలు చూడూ, సందీప్ సెకండ్ క్లాసూ, ప్రదీప్ ఫస్ట్ క్లాసూ, సుష్మ ఏమో నర్సరీ!" అంటూ చెబుతూనే పిల్లలు వేపు తిరిగీ – "ఒరే సందీప్, ప్రదీప్ – మీ ప్రోగ్రెస్ రిపోర్టులు చూపండ్రా ఆంటీకి, అంకుల్‌కూ –" అంది.

అంతవరకూ ఆడుకోవడంలో నిమగ్నమయి ఉన్న పిల్లలు ఇద్దరూ తమ బండెడు పుస్తకాల్నీ వెదకి ప్రోగ్రెస్ రిపోర్టులు పట్టుకువచ్చారు.

మావారు ఓసారి వీటిని అలవోగ్గా చూసి పక్కన పేట్టేశారు. పిల్లలు ఎంతో ఆసక్తితో తెచ్చి ఇచ్చారన్న 'ఇది' కూడా లేదాయనకి. నేను వాటిని అందుకుని "వెరీ గుడ్! మంచి మార్కులు తెచ్చుకున్నారు. ఇట్లే మంచి మార్కులు తెచ్చుకుని పాసు కావల్ల!" అంటూ అభినందించి వాళ్ళిద్దరికీ ముద్దులు పెట్టాను.

'వాళ్ళు మంచి మార్కులు తెచ్చుకోకుంటే వదిలే వాళ్ళెవరు? పోయినసారి టెస్టుల్లో 'సి' గ్రేడ్ మార్కులు వచ్చాయి ఇద్దరికీ – ఆ రోజైతే నేను ఏడ్చేసినాను. అప్పట్నించీ శ్రద్ధగా ట్యూషన్సుకు పంపుతున్నాం. ఉదయం, సాయంత్రం ఆడుకోకుండా నేను దగ్గరుండి హోమ్‌వర్క్ చేయిస్తాను. ఇట్లా చేసినందువల్లే ఇప్పుడు 'ఏ' గ్రేడ్ మార్కులు వచ్చాయి ఇద్దరికీ!" అంటూ అక్కయ్య చెప్పుకుపోతోంది.

అక్కయ్యకి పిల్లల హోమ్‌వర్క్ జ్ఞాపకం వచ్చిందేమో 'ఒరేయ్! హోమ్‌వర్క్ చేస్కోండ్రా ముందు, ఇంక కాసేపటికి మీ డాడీ వచ్చాడంటే మీరు ఏ హోమ్‌వర్కు చేయలేదని మీ వీపు చీరేస్తారు. ముందు పుస్తకాలు తీసుకురండి!" అంటూ హుకూమ్ జారీచేసింది.

బవ్వీ, కిన్నూలతో ఆడుకుంటున్న పిల్లలు కిక్కురుమనకుండా లేచివచ్చి పుస్తకాలు ముందేసుకున్నారు. తనను కూడా తల్లి తిడ్తుందనుకుందేమో సుష్మా కూడా పుస్తకాలు తెచ్చుకుని కూచుంది. అయితే ఆ పిల్ల చూపులన్నీ బవ్వీ, కిన్నూల మీదే. బవ్వీ, కిన్నూలకి ఏమనిపించిందో లేచి వాళ్ళ దగ్గరకు చేరారు. అయోమయం చూపులతో

వాళ్ళని చూస్తూ కూచున్నారు. మధ్యమధ్యలో వాళ్ళు రాస్తున్నదేమిటో అడిగి తెలుసుకుంటున్నారు.

అదంతా చూస్తుంటే మావారికెట్లా ఉందో ఏమోగానీ, నాకు మాత్రం అదోరకమైన బాధ మనసులో గూడుకట్టుకొంది.

"ఏయ్! బవ్వీ, కిన్నూ ఇట్రండర్రా! వాళ్ళని హోమ్‌వర్కు చేస్కోనియ్యండి!" అంటూ మా పిల్లల్ని పిల్చింది అక్కయ్య.

నాకెందుకో కలుక్కుమంది గుండెలో – మావారు ఇదేమి పట్టించుకోనట్టు ఏదో పత్రిక చదువుకుంటూ ఉండిపోయారు.

ఓ గంట తర్వాత మా బావ వచ్చాడు. ఆయన ఓ చుట్టు లావయినాడు. పొట్ట బాగా ముందుకు వచ్చింది. అయినా, ఆయన ఇన్‌షర్ట్ చేసుకున్నందువల్ల బాగానే అనిపిస్తోంది. నవ్వుతూ ఆత్మీయంగా పలకరించారు మమ్మల్ని. మా పిల్లల్ని దగ్గరికి తీసుకోబోయారు. మా మొదటి పిడుగు ఆయన దగ్గరికి వెళ్ళింది. రెండో పిడుగు మాత్రం సిగ్గుతో నా చంకనెక్కాడు.

పిల్లల చదువు గురించి అడిగారు. మేము పాత రికార్డు వేశాం.

అపర పండితుడు, ఓనామాలు రాని పామరుల్ని చూసినట్టు ఓ తేలిక చూపు విసిరి – 'మీవి చాలా పాత పద్ధతులు – సానబడితేనే వజ్రమయినా ప్రకాశించేది.... అంటూ మినీ లెక్చరొకటి ఈ పామరులకి సోదాహరణంగా ఇచ్చేశాడు.

"పిల్లలు ప్రాణంలేని 'వజ్రవైఢూర్యాలు' కాదుగా సానపెట్టేదానికి!" అంటూ మావారు గొణిగారు.

మావారి వింత మనస్తత్వానికి నాకు చిరాకేసింది.

పామరులకి లెక్చరివ్వడం వరకే తన వంతయినట్టు మావారి గొణుగుడిని వినిపించుకోకుండా పక్కగదిలోకి దూరి బట్టలు మార్చుకుని లుంగీ బనియన్‌తో బయటకొచ్చాడు బావ.

మేము కొంచెం ఏమరుపాటుతో ఉండటం గమనించిన ప్లిలలిద్దరూ అల్లరి మొదలుపెట్టేశారు.

"అమ్మా చూడమ్మా! నా కోతి బొమ్మని తీసుకొంటున్నాడు" అని బవ్వీ, 'అమ్మా నా కారు బొమ్మ గుంజుకుంది చూడూ!' అంటూ కిన్నూగాడూ –

"ఇద్దో పిల్లలూ!' గలాటా చేయకూడదూ! అన్నయ్య వాళ్ళు చదువుకుంటున్నారు– డోంట్ డిస్టర్బ్ దెమ్!' అన్నాడు బావ చివరి వాక్యం అర్థంకాకేమో మరి, ఇద్దరూ ఒక్కసారి నన్నూ మావారినీ చిత్రంగా చూసి గప్‌చిప్‌గా అయిపోయినారు.

మాతో మాట్లాడటం వేస్టు అనుకున్నాడేమో ఓసారి మావేపు చూసీ, చదువు కుంటున్న తన పిల్లల దగ్గరకుపోయి కూచునీ, హోమ్‌వర్క్ చేయడంలో వాళ్ళకి సహకరిస్తూ ఉండిపోయాడు బావ.

అరగంట గడిచాక వాళ్ళ పిల్లల హోమ్‌వర్కు అయిపోయింది. అప్పుడు మాతో పిచ్చాపాటి మాట్లాడ్డానికి దగ్గరగా సోఫాలో కూచున్నాడు. ఉన్నట్టుండి "ఒరే సందీప్!

కమ్ హియర్! అంకుల్, ఆంటీలకి పోయెమ్ ఒకటి అప్పజెప్పరా!" అంటూ ఆజ్ఞ జారీ చేశాడు.

అంకుల్, ఆంటీ అని ఇరుగు పొరుగు వారిని పిలవచ్చు. మమ్మల్ని చిన్నాన్న, పిన్నీ అనాలనీ ఆయన ఎక్కడ గొడవ పెడతాడోనని నా భయం. థ్యాంక్ గాడ్! పరధ్యానంగా ఉన్నారేమో మరి..

"హూ హాస్ సీన్ ది విండ్ ..." అంటూ సందీప్ ఇంగ్లీషు పద్యం అప్పజెపుతూ ఉంటే, మావారూ, నేనూ గుడ్లప్పగించి చూస్తూ ఉండిపోయాం. వాడు చెప్పడం ఇంకా అయిపోయిందో లేదో వెంటనే, "ఒరే! ప్రదీప్! నువ్వు టేబుల్స్ (ఎక్కాలు) చెప్పరా!" అన్నాడు. తండ్రి చెప్పిందే తడవుగా మొదలుపెట్టి గడగడ అప్పజెప్తున్నాడు.

మా అక్కయ్య గర్వంతో పొంగిపోతూ నవ్వుతూ నన్ను, మావారినీ చూస్తోంది. మగపిల్లలు ఇద్దరూ అయిపోగానే సుష్మకు ఛాన్సిచ్చాడు బావ. అది 'ట్వింకిల్ ట్వింకిల్...' అంటూ ముద్దుముద్దుగా చిన్న పెదవుల్ని, చిన్న చిన్న కళ్ళనీ చిత్రమైన కదలికలతో నింపుతూ పాడింది. అంత తెలివైన పిల్లల్ని కనడం అక్కయ్య అదృష్టం అనిపించింది.

"ఏదమ్మా భవ్యా! నువ్వు చెప్పూ!" అన్నాడు బావ.

ఎలా వినిపించిందో దానికి అదోలా చూసి 'నా పేరు బవ్వీ' అంది.

"సరేలే, కమాన్ టెల్‌మీ" అన్నాడు బావ.

"ఏంది పెదనాన్నా! తిక్క తిక్క మాటలు మాట్లాడతావు. నీకి మాట్లాడేది రాదా!" అంది.

నాకు తల కొట్టేసినట్టయింది. మా బావ మొహం చిన్నబుచ్చుకున్నాడు. అక్కయ్య నవ్వుతూనే చూస్తూ ఉంది. ఇంక మావారు సరేసరి ఆనందంగా పుల్కా పుల్కా చూస్తున్నాడు కూతుర్ని.

"ఏయ్ బవ్వీ పెదనాన్నతో అట్లేనా మాట్లాడేది" అన్నాను.

"మరి పెదనాన్న మాటలు నాకు అర్థం కాలేదు" అంది.

మావారు "అన్నా! పిల్లలకి అర్థంకాని భాషని తిక్క మాటలనే కదా అనుకునేది" అన్నారు. ఆయన చాదస్తం మీద నాకు భలే కోపం వచ్చింది.

"చిట్టీ చిలకమ్మా!" చెప్పవే అన్నాను.

"ఊహూ నేను చెప్పను - సిగ్గు"

"మా పిల్లలకి అట్లా సిగ్గుపడేది మాత్రం లేదు నాగరాజూ! ఎవరితోనైనా మాట్లాడుతారూ, రైమ్స్, టేబుల్స్ చెబుతారు... క్లాసుల్లో ఎప్పుడూ వీళ్ళే ఫస్టు! కాంపిటీషన్స్‌లో కూడా వీళ్ళే ఫస్టు.

భోజనం చేస్తున్నంతసేపూ పిల్లల చదువుల గురించే చెప్పాడు బావ. పెద్దవాడిని సైంటిస్టుగా, చిన్నవాడిని ఇంజనీరుగా, సుష్మాను డాక్టరుగా చేయాలని ఉన్నట్టు

చెప్పాడు. మావారు అన్నిటికీ 'ఊ..ఊ' అంటున్నారు. ఆయన మొహంలో ఏ భావాలు లేవు.

భోజనాలు అయినాక మా నలుగురికీ డ్రాయింగ్ రూములో పక్కలు వేశారు. నా మనసులో కొత్త ఊరన్న ఉత్సాహంకానీ, అక్కయ్య ఇంటికి వచ్చానన్న ఆనందం కానీ లేవు. మనసంతా అదోరకమైన వికారం! ఇంతటికీ కారణం మావారేనా ... మా పిల్లలా ... అక్కయ్య వాళ్ళ పిల్లల్లా నా పిల్లలు లేకపోవడమా ... బావ మావారిని తక్కువగా అనుకున్నాడేమోనన్న భావనా... అక్కయ్య నన్నూ, నా కుటుంబాన్నీ తక్కువ అంచనా వేసుకుందేమోనన్న ఫీలింగా ... ఏమో ... అన్నీ కలగాపులగంగా అయిపోయి ఉన్నాయేమో!

ఆయన సిగరెట్టు తాగుతూ బెడ్డుమీద కూచుని ఉన్నారు. పిల్లలు అలిసి పోయినారేమో అపుడే నిద్రపోయినారు.

"ఈ బవ్వీకి సిగ్గెందుకో అర్థమేకాదు. ఆ 'చిట్టీ చిలకమ్మా' రోజంతా చెవులు గింగురుమనేట్లు పాడేస్తూ ఉంటుంది. అక్కా బావల ముందు... ఇదీ... ఇంక ఈ పిడుగులకి ఇంగ్లీషు రైమ్సు నేర్పినా ఎవరిముందయినా చెప్పమంటే ఇట్లే తలవంపులు చేస్తారేమో... ఇద్దరూ ఇద్దరే?" అన్నాను. మరేం మాట్లాడాలో తెలీక.

అందుకాయన చిన్నగా నవ్వి ఓరకంట చూస్తూ ... "మనం పిల్లల్ని వస్తువులు మాదిరి చూడకూడదే! వాళ్ళేం యంత్రాలా? ఎక్కడపడితే అక్కడ ప్రదర్శించేకి. అట్లా పిల్లలతో ఎదుటివాళ్ళ మెచ్చుకోలు కోసరం పద్యాలూ, పాటలూ చెప్పిస్తే పిల్లల్ని ఆ స్థాయికి దిగజార్చినందుకు వాళ్ళని చూసి జాలిపడల్ల మనం!" అనేసి సిగరెట్టు తాగుతూ ఉండిపోయాడు.

ఏమిటో మంకు పట్టు మనిషి! ఆయన మాటలకి నాకు రక్త ప్రసరణ పెరిగి ఆయనకి వీపుచేసి పడుకున్నాను.

★ ★ ★

మరుసటి రోజు ఉదయం ట్యూషన్‌కూ, స్కూలుకూ వెళ్ళము. బవ్వీ, కిన్నూలతో ఆడుకుంటాము' అని పట్టుపట్టారు అక్కయ్య పిల్లలు. చెరీ ఒక దెబ్బవేసి తరిమాడు బావ. బలిపీఠానికి వెళ్తున్న గొర్రెపిల్లల్లా మోపెడు పుస్తకాల్ని భుజాలకు తగిలించుకొని వెనక్కి తిరిగి చూస్తూ మాకు 'టాటా' చెబుతూ వెళ్ళిపోయారు.

అంతే మావారు "మనం వెళ్ళిపోదాం!" అన్నారు.

"ఏం?" అన్నాను.

"ఇంకొక రెండు రోజులు ఇక్కడే ఉంటే... ఇదంతా చూసీ చూసీ, పిచ్చి ఎక్కుతుంది. అప్పుడు అనంతపురానికి కాదు వెళ్ళాల్సింది, నేరుగా విశాఖపట్నానికి" అన్నారు ఆవేశంగా.

అక్కయ్యకీ, బావకీ ఏదో 'టంగు టస్కు' చెప్పి, వాళ్ళని ఎట్లో ఒప్పించేసి అనంతపురానికి బయల్దేరినాము.

ఆటోలో వెళ్తుంటే అన్నాను.

"మీదంతా చాదస్తమండీ! పిల్లలకి చదువు ఎంత అవసరమో అక్కబావలకి బాగా తెలుసు! అందుకే ఆ పిల్లలు ఎంత బాగా చదువుకుంటున్నారో ..."

"నిజమే సుమా! చదువుకోనీ ... ఈ రోజు మనము ఉన్నామనీ ఆ పిల్లలు ఇష్టంగా ఇంట్లో ఉండాలనీ ఆశపడినారు ... కానీ, వాళ్ళని నిర్దాక్షిణ్యంగా దెబ్బలు వేసి బడికి తరిమినారు. ఆ పిల్లలకు తక్కిన అన్ని విషయాలకంటే చదువు ముఖ్యమనీ మీ బావ ఉద్దేశం! మనిషికి ఇతర ఆనందాలు ఉంటాయని ఆయన మరిచిపోయి నాడు. అసలు ఆ పిల్లలకి బాల్యం అంటూ ఉంటుందంటావా? నా పిల్లలు అట్ల కాకూడదు. వీళ్ళకి బాల్యం ఉండల్ల. ఆడుతూ, పాడుతూ పెరగల్ల. ఉదయాలనీ, సాయంత్రాలనీ, వెన్నెలనీ చూసి ఆనందపడల్ల ... వాళ్ళ పిల్లలు చదివీ, చదివీ గొప్ప గొప్ప ఉద్యోగాల్లో చేరతారు, తలల్ని కంప్యూటర్లుగా మార్చేసుకుని డబ్బు సంపాదించే యంత్రాలౌతారు. నా పిల్లలు అతి మామూలుగా చదివి మనుషులవుతారు, మానవత్వం ఉన్న మనుషులవుతారు!" ఆయనలా చెప్పుకుపోతున్నారు.

నా కర్మ! ఈయన ధోరణి ఏమిటో ఈ జన్మకి అర్థం కాదు కదా!

(ఆహ్వానం - అక్టోబరు, 1994)

# దొంగయితే బాగుణ్ణు

అమావాస్య ...రాత్రి రెండుగంటల సమయం. దానికి తోడుగా అప్పుడే కరెంటు పోవడం వల్ల కన్ను పొడుచుకున్నా కానరాని చీకటి పట్టణమంతా అలుముకుని ఉంది.

దూరంగా కుక్కలు మొరుగుతున్న శబ్దాలు - అప్పుడప్పుడు ఊళ్ళో ఎక్కడో పోలీసు జీపు సంచరిస్తున్నట్లు సైరను వినిపిస్తోంది.

రైల్వే ఫీడరు రోడ్‌లో అంత చీకటిలోనూ - వడివడిగా, భయం భయంగా అడుగులు వేస్తున్నాడు రామలింగం. చలి బాగా ముదిరి ఉండటం వల్ల ఓ చేత్తో సూట్‌కేస్ గట్టిగా పట్టుకుని, మరోచేతిని చలికి తట్టుకోడానికేమో నడుం వెనుక అదిమిపట్టి నడుస్తున్నాడు. మఫ్లర్ లేనందువల్ల చలికి మొద్దుబారాయి చెవులు.

అందుకే వెంటనే ఆగి సూట్‌కేసుని కింద పెట్టేసి, పేంటు జేబులోంచి కర్చీఫ్ తీసి త్రిభుజాకారం వచ్చేలా ఓ మడతవేసి, చెవులు అణిగిపోయేలా తలకు బిగదీసి నుదుటిపైన ముడివేసుకున్నాడు రామలింగం. జేబులో ఉన్న ఒక సిగరెట్టునీ వెలిగించి గుండెలదాకా పొగనిపీల్చి తృప్తిగా వదిలాడు. భయం, చలీ కొంచెం తగ్గినట్టు ఫీలయి సూట్‌కేసుని తీసుకుని మళ్ళీ చకాచకా అడుగులు వేస్తూ నడక సాగించాడు.

కాలి నడకనయితే మరో అరగంటకి గానీ ఇల్లుచేరుకోలేడు తను. దార్లో ఏ రిక్షానో, ఆటోనో వస్తుందన్న నమ్మకం లేదు. ఎంచేతనంటే శాంతి భద్రతల్ని దృష్టిలో ఉంచుకుని పోలీసుశాఖ వాళ్ళు గత రెండు నెలలుగా రాత్రి పదకొండు గంటల తర్వాత వాహనాలు ఏవీ పట్టణంలో తిరగరాదని ఆజ్ఞలు విధించారు.

'ఇంత రాత్రవుతుందని తెలిసుంటే అసలు బయలుదేరకనే ఉందును కదా!' అనుకుని ఓ గాఢమయిన నిట్టూర్పు విడిచాడు రామలింగం.

అక్కడికీ రామలింగం తల్లి అననే అంది.

"ఈ వేళప్పుడు బయల్దేరకపోతే ఏం? బస్సులు దొరుకుతాయా ఏమన్నానా పొద్దున్నే పోదువుగానిలే!" అని. అయినా అమ్మ మాటల్ని పెడచెవిని పెట్టాడు. తను "ఎంతసేపమ్మా! గంటలో ఊరు చేరుకోనా!" అంటూ బయల్దేరాడు. అతనంత తొందరపడ్డానికి కారణం అతనిది కొత్తకాపురం! అందులోనూ భార్య ఒంటరిగా ఉంటుందేమోనన్న ఫీలింగొకటి అతన్ని సొంత ఊళ్ళో నిలవనివ్వలేదు.

తీరా బస్టాండు చేరుకున్నాక బయల్దేరాల్సిన బస్సు ఏదో రిపేర్ కారణంగా ఆగిపోయింది. ఆ తర్వాత బస్సులు లేవు. అందుకని ఊరి బయటకు చేరుకున్నాడు- ఏదైనా లారీ దొరక్కపోదా అని. ఓ గంటన్నర తర్వాత ఇక్ష్వాకుల కాలంనాటి లారీ ఒకటి వచ్చింది. రామలింగం పరమానందభరితుడై క్యాబిన్‌లోకి ఎక్కి కూచున్నాడు.

లారీ కదిలింది. అతని ఆనందం లారీకి ఇష్టమున్నట్లు లేదు. అందుకే వెంటనే తన విపరీతమైన కంపనాలతో అతన్ని నీరు కార్చింది. కంపరం పుట్టి వెళుతున్న లారీలోంచే దూకేద్దామా అని ఆలోచించి – 'కొత్త కాపురం, ఒంటరి భార్య' వగైరాలు జ్ఞాపకానికి వచ్చి విధిలేక విరమించుకున్నాడు.

ఐదు మైళ్ళ ప్రయాణం చేశాక లారీ టైరు 'డాం'మని పేలింది. డ్రైవరూ, క్లీనర్లూ బీడీలను తాగుతూ ఓరెండు గంటలసేపు స్టెఫినీతో టైరు మార్చే కార్యక్రమాన్ని చేపట్టారు. ఆ మార్చిన టైరు అంత మంచిది కానందువల్ల గంటకి 10 కిలో మీటర్ల వేగంతో మాత్రమే ప్రయాణం చేస్తూ రెట్టింపు కంపనాలతో అదరగొట్టేసింది రామలింగాన్ని. ఊరుకు ఒకటిన్నర కిలోమీటర్ల దూరంలో ఉన్న బైపాస్ రోడ్డులో రామలింగాన్ని వదిలేసి తన దారిన తను చక్కాపోయింది లారి.

అంతవరకూ ఇల్లూ, ఇల్లాలు మాత్రమే మదిలో మెదులుతున్న రామలింగానికి ఇప్పుడు ఇంటికి చేరడమెట్లా అన్న భయం పట్టుకుంది.

అతనలా భయపడుతున్నాడూ అంటే పిరికివాడని కాదు. దొంగలంటే భయం లేదతనికి – తన దగ్గర ఏమున్నది గనక... ఓ పాత చిన్న సూట్‌కేసూ, అందులో ఓ జతబట్టలూ, చేతికో వాచీ, జేబులో పదిరూపాయలూ...

ఇక దయ్యాలంటే అసలు భయం లేదు అతనికి. ఆదివారం అమావాస్య రోజున అర్ధరాత్రి శ్మశానం నడిబొడ్డులో ఒంటరిగా సంచరిస్తూ జాలీగా కింగ్‌సైజ్ సిగరెట్ కాల్చేసి రాగల మగధీరుడు రామలింగం! ఒక వేళ దయ్యమే ఎదురయితే ఎడమకాలితో తన్నేసి, చెడామడా తిట్టేసి రాగలడతను.

రామలింగం తన చిన్నతనం నుంచి భయం అన్న పదానికి అర్థం తెలీకుండా పెరిగాడు.

దొంగలకీ, దయ్యాలకీ భయపడని రామలింగం భయపడుతోంది ఒక్క పోలీసుల గురించే – అయితే – రామలింగం ఎందుకు భయపడుతున్నాడూ – అంటే దానికి నెలక్రితం జరిగిన ఓ సంఘటనే కారణం!



ఆ రోజు రాత్రి సెకండ్ షోకి వెళ్ళాడు రామలింగం – భార్యతో సహా. సినిమా వదిలాక తృప్తిగా ఇంటిదారి పట్టారు. ఏ రిక్షాలోనో ఎక్కేసి ఉంటే సరిపోయేది.

"వెన్నెల రాత్రి కదా! హాయిగా నడిచే వెళ్దామండీ!" అంది అతని భార్య.

సర్లెమ్మని చెట్టాపట్టాలేసుకుని నడుస్తున్నారిద్దరూ, ఓ ఫర్లాంగు దూరం నడిచేటప్పటికి జనసంచారం కరువైపోయింది. అయినా ఇద్దరూ సినిమాలోని జోకుల్ని నెమరేసుకుంటూ హాయిగా నడుస్తున్నారు. ఇంకొక్క ఫర్లాంగు దూరం నడిస్తే ఇల్లు వచ్చేస్తుంది.

సరిగ్గా అప్పుడు – ఎక్కడినుంచి వచ్చిందో పోలీసు జీపు...అందులోంచి ఓ పోలీసు అధికారి దిగాడు.

"ఎక్కడినుంచి వస్తున్నారు?" అడిగాడు పోలీసు అధికారి.

చెప్పాడు రామలింగం.

"అయితే సిన్మాటిక్కెట్టు ముక్కలేవి?"

జేబుల్ని వెదికాడు రామలింగం. టిక్కెట్టు ముక్కలు దొరకలేదు. తను థియేటర్ బయటికి వచ్చాక సిగరెట్టు పేకెట్టు జేబులోంచి తీసుకున్నప్పుడేమో అవి పడిపోయి నట్టున్నాయి.

ఆమాటే చెప్పాడు రామలింగం.

నమ్మలేదు పోలీసు అధికారి.

"అసలు మీరిద్దరూ ఎవరు? ఇంతరాత్రి వేళ ఎక్కడికెళ్తున్నారు....నిజం చెప్పండి!" అంటూ గర్జించినట్టు అడిగాడు పోలీసు అఫీసరు.

"భార్యభర్తలం సార్.... ఇంటికెళ్తున్నాం"

"ఎలా నమ్మమంటావ్?"

"అదేమిటి సార్ అలాగంటారు...అదిగో నా భార్య మెడలో మంగళసూత్రం!"

"నోర్ముయ్! భాంచోత్! ఆ మంగళసూత్రం మీద నీపేరు రాసి వుంటుందా! ముందు పదండి స్టేషనుకు, ఆ తర్వాత మీసంగతి తేల్చుతాను.మీరు భార్యాభర్తలైతే సినిమా వదుల్తూనే ఏ రిక్షాలోనో, ఆటోలోనో ఇల్లు చేరుకుంటారు. ఇల్లా అర్ధరాత్రయినా, అపరాత్రయినా చెట్టాపట్టాలేసుకుని షికార్లు కొడతారా!" అంటూనే జీపులో ఇద్దర్నీ ఎక్కించుకొని స్టేషనకు తీసుకెళ్ళాడు. రాత్రంతా పోలీసుల యక్షప్రశ్నలతోనూ, అవమాన భారంతోనూ జాగారం చేశాక ఏదో అపారమైన దయతో తమని ఆలూమగలుగానే గుర్తించి ఉదయమే విడిచిపెట్టేశారు. లేకుంటేనా తమ పరువు ఊళ్ళో అందరికీ తెలిసిపోయేది.

అప్పటినుంచి ఎంత కొంపలంటుకునే పని ఉన్నాసరే రాత్రి పదిగంటలకి ఒక్క నిమిషం ఎక్కువయినా బయట కాలుపెట్టేవాడు కాదు రామలింగం.

అల్లంత దూరంలో ఏదో వాహనం వస్తోంది. దాని హెడ్‌లైట్ల తాలూకు వెలుతురు సూటిగా రామలింగం కళ్ళలో దూరి ఇబ్బంది పెట్టేసింది. ఆ వెలుతురు వేపు చూడకుండా తల వంచుకుని నడుస్తున్నాడు. కొంపదీసి అది పోలీసు వ్యాను కాదు కదా!

అలా అనుకోగానే అంత చలిలోనూ, అతని అరిచేతుల్లోను, అరికాళ్ళలోను, మొహంలోనూ చెమట పట్టేసింది. అది పోలీసు వ్యానే అయి వుంటుంది... తనని చూడగానే నిలబెట్టేస్తారు...యక్షప్రశ్నలూ, లక్షతిట్లూ కురిపిస్తారు.

ఏమైనా సరే తను భయపడకూడదు....ఈ సారి ఎన్ని ప్రశ్నలకైనా తడబడకుండా జవాబు చెప్పాలి తను. తనేమైనా క్రిమినలా? పోలీసుల బెదిరింపులకు అదిరిపోవడానికి! తన సొంత ఊరి నించి వస్తున్నాడు. అదే విషయం గట్టిగా నిర్భయంగా చెబుతానంతే! ...అవునూ....అలా చెబితే - ఉత్తుత్తినే నమ్మేస్తే వాళ్ళెలా పోలీసులవుతారు. అందుకు ఎవిడెన్సు ఏదని అంటారు? తనెక్కడినుంచి తేగలడు ఎవిడెన్సు? తను ప్రయాణం చేసింది లారీలో కదా! బస్సయితే టిక్కెట్టుండేది.... ఇప్పుడెలా? అనుకుంటూ ఉంటే అతని కాళ్ళలో సన్నటి వణుకు ప్రారంభమయింది.

ఈలోగా వ్యాను మరీ దగ్గరయింది.

అతని గుండె మరీ దడదడలాడి పోయింది.

అయితే - అదృష్టం!! అది ఆగలేదు. - బహుశా అది పోలీసువ్యాను కాదేమో!

'థ్యాంక్ గాడ్! అనుకున్న ప్రమాదం ఎదురు కాలేదు.'

'ఈ ప్రభుత్వం వాళ్ళు అర్ధరాత్రి వేళనయినా ఆడది ఒంటరిగా నిర్భయంగా తిరగగల వ్యవస్థని నెలకొల్పుతామని ఓ వేపు అంటూనే - ఇంకోవేపు మీసమున్న మగవెధవ కూడా అర్ధరాత్రిళ్ళు గుండెల్ని అరచేతిలో పెట్టుకుని భయంభయంగా తిరిగే అవస్థ తెచ్చిపెట్టారు' అనుకుని నిట్టూర్చాడు రామలింగం.

మొన్నటికి మొన్న తన ఇంటి పక్కనున్న కనకయ్య అతని భార్యని పురిటికోసం ఆసుపత్రిలో చేర్పించేందుకు అర్ధరాత్రివేళ రిక్షాకోసం తిరిగాడు బజార్లు పట్టుకుని. రిక్షా కనపడలేదు. పోలీసు జీపు కనబడింది. కనకయ్యని అనుమానించి పట్టుకెళ్ళారు. అతను ఎంత మొత్తుకుని నిజం చెప్పినా వినలేదు. ప్రొద్దుటి వరకు స్టేషనులో కూచో పెట్టి వదిలేశారు. అలాగే కనకయ్య భార్యకు పురిటినొప్పులు ఎక్కువై, కానుపు అవడం కష్టం కావడంతో ఆవిడ చనిపోయింది.

నిజానికి పోలీసులు కనబడితే ప్రాణం లేచివచ్చి తనకి కొండంత ధైర్యం రావాల్సింది. కానీ పోలీసులు ఎక్కడ కనపడతారోనని మనసు విపరీతమైన వేదన పడటం వింతగా అనిపించింది. ఒక రకం బాధతో కూడిన నవ్వు పెదాలమీదికి తన్నుకు వచ్చింది రామలింగానికి.

నవ్వుని పెదాలతో అదిమిపెట్టేసి వడివడిగా అడుగులు వేస్తున్నాడు రామలింగం.

"ఏయ్! ఆగు!' అంటూ ఓ కరుకైన కంఠం చీకట్లోంచి మెరుపులేని ఉరుములా దూసుకు వచ్చింది కొంచెం దూరం నుంచి.

ఒక్కక్షణం తటపటాయించి మళ్ళీ అడుగులు వేయబోయాడు రామలింగం.

"ఏయ్...నిన్నే ఆగు! వినబడ్డం లేదా?" అంటూ మళ్ళీ ఉరుము వచ్చేటప్పటికి రామలింగం చేష్టలుడిగి నిలుచుండిపోయాడు.

రామలింగానికి చేష్టలయితే ఉడిగాయి కానీ, మెదడు మాత్రం మరీ చైతన్యవంతమై పోయి ఆలోచిస్తోంది.

అది పోలీసు కంఠమే. అంత కర్కశంగా, గరుగ్గా, నిర్దాక్షిణ్యంగా,మరీ సంస్కార రహితంగా ఉందంటే అది నిస్సందేహంగా పోలీసు కంఠమే! ఇంకేముంది? తన పని గోవిందా. సవాలక్ష యక్షప్రశ్నలకి తను జవాబులు చెప్పాలి. అది వీలయ్యే పనేనా...ఒకవేళ సమాధానం చెప్పినా, చెప్పకున్నా పర్యవసానం కటకటాలు చూడటమే! ఇక ఈ రాత్రంతా దిగులుతో, అవమానంతో, బతుకుమీద విరక్తితో పోలీస్‌స్టేషన్‌లో గడపాల్సిందేనా...దేవుడు మేలుచేసి ఏ కేసూ పెట్టకుంటే ఫర్వాలేదు. లేదంటే ఏ నేరంలోనో ఇరికించేసి, ఏ క్రూరమైన కేసు తన పైన మోపినా ఏం చేయగల్గు తను!

'భగవంతుడా!...ఎక్కడున్నావయ్యా కలడందురు దీనులయెడ...మరి నేను దీనుడను కానా? ఏమిటి నా అగ్నిపరీక్ష...ఏల నాకీ పోలీసు పరీక్ష!"

అవతలి ఆకారం దగ్గరవుతున్నట్టుగా పాదరక్షల శబ్దం తెలుపుతోంది. ఆ ఆకారం రంగు కూడా నలుపేమో కటిక చీకట్లో అసలు కనిపించడంలేదు.

"ఎవర్నువ్వు?" ఆకారం గర్జించింది.

"నే...నే...నే నేను లి...లి...లింగాన్నిసార్!" నోరు తడారి పోతూండగా ఎలాగో మాట్లాడ గలిగాడు రామలింగం.

"ఏ గుళ్ళో లింగానివి?" మళ్ళీ గర్జన.

"ఏఏ...గుళ్ళో కాదండీ... మా అమ్మానాన్నలు పె..పెట్టిన పేరు లింగం సార్... పూ....పూర్తి పేరు రామలింగం సార్!"

"సరే... ఏదో బోడిలింగం..ఏమిటీ...ఈ వేళప్పుడు?'

"ఇంటికి వెళ్తున్నాను సార్!"

"ఇంటికి కాక వల్లకాటికి పోతావనుకున్నానా బేవకూఫ్! ఎక్కడ పనిచేస్తున్నావ్?"

చెప్పాడు రామలింగం.

"ఎక్కడినుంచి వస్తున్నావ్? ఇంత రాత్రివేళ ఇలా వంటరిగా వస్తున్నావూ అంటే...నీదేమైనా రాత్రి వ్యాపారమా?"

"లేదు...లేదు సార్! నేను నేను గవర్నమెంటు ఉద్యోగినని చెప్పానుగా..."

"సర్లేవోయ్! గవర్నమెంటు ఆఫీసుల్లో బోల్డంతమంది స్మగ్లర్లని చూశానుగానీ, ఆ సూట్‌కేసులో ఏముందీ...బంగారు బిస్కట్లా.. హిరాయినా.. గంజాయా.. బ్రౌన్ షుగరా?"

"అవేమీ కాదు సార్!" అన్నాడు రామలింగం. అప్పటికి కాస్త ధైర్యం వచ్చింది. అతనడిగినవి తన సూట్‌కేస్‌లో లేవని తెలిస్తే తనని వదిలేస్తాడని రామలింగానికి ఎక్కడో ఆశ చిగురించింది.

"మరైతే ఏమున్నాయందులో?"

"ఒక జతబట్టలున్నాయి సార్! కావాలంటే చూపిస్తాను సార్!"

"యూ..యూజ్‌లెస్ ఫెలో...మరి ఆ మాత్రానికే ఎందుకలా భయపడి వణికి పోతున్నావ్?"

"అబ్బే - నేనా సార్...లేద్సార్" అన్నాడు రామలింగం - చీకట్లోనే నవ్వాలని ప్రయత్నిస్తూ.

"నువ్వెంత వణికిపోతున్నావో నీ మాటలే చెబుతున్నాయి".

"మరి పోలీసులంటే నాకు చిన్నప్పటి నుంచి భయం సార్! అందువల్ల..."

"నువ్వేం భయపడకు... నేను పోలీసోణ్ణి గాదు" అందా ఆకారం. చీకట్లో అతని నవ్వు రామలింగానికి వినిపించింది.

"మరి ఎవరు సార్ మీరూ?" ధైర్యంగా అడిగాడు.

"అదంతా నీకనవసరం...ముందు సూట్‌కేసు ఇలా ఇవ్వు?!!"

నివ్వెరపోయాడు రామలింగం!

అర్థమయింది సార్.. మీరు...మీరు.. దొంగగారా సార్.. హమ్మయ్య! బతికించారు సార్! నిజంగా మీరు దొంగే అయితే నాది ఎంత అదృష్టం సార్!" అన్నాడు రామలింగం ఆనందంపట్టలేక.. అతను పోలీసు కానందుకు గట్టిగా కౌగలించు కుందామని ఉంది. దొంగగారు ఇష్టపడతారో లేదోనని మానుకున్నాడు రామలింగం.

"అధిక ప్రసంగం చాలు" అంటూనే సూట్‌కేసు లాక్కున్నారు దొంగగారు.

"అధిక ప్రసంగం కాదు దొంగగారూ! ఆనందంతో చేసే ప్రసంగమిది...మీకు కావాలంటే నా వాచీ కూడా ఇచ్చేస్తున్నా తీసుకోండి సార్ - మహదానందంగా".

రామలింగం వాచీనీ అందించగానే వాచీ సూట్‌కేస్‌లతో మాయమైపోయారు దొంగగారు.

"అమ్మయ్య...పోలీసోళ్ళు కాదు" అని సంతోషించి ఆనందంగా ఈలవేస్తూ ఇంటి దిశగా అడుగులు ఉత్సాహంగా వేస్తూ సాగిపోయాడు రామలింగం - పోయిన వస్తువుల్ని గురించి కించిత్ బాధకూడా లేకుండా!

(విపుల - సెప్టెంబరు, 1989)

# పులికి పిలకలేదు

సింహాచలం మంచివాడూ, నికార్సయిన మనిషీనూ! సింహాచలానికి నీతి ఆరో ప్రాణం, నిజాయితీ, ఏడో ప్రాణం, నిక్కచ్చితనం ఎనిమిదో ప్రాణం... ఇట్లా అతనికి ఎన్ని ప్రాణాలుంటాయో చెప్పుకుంటూ పోవడం అలివిగాని పనే - ఎవరికయినా.

ఒక్కమాటలో చెప్పాలంటే సింహాచలం చాలా ఖచ్చితమైన మనిషని చెప్పక తప్పదు.

తను ఎంత నీతి, నిజాయితీలతో ఉంటాడో, ఎదుటివారు కూడా అంతే నీతీ, నిజాయితీలతో ఉండాలని కోరుకుంటూనే ఉంటాడు.

సింహాచలం సన్నగా, పొడుగ్గా, ఎర్రగా ఉంటాడు. వయసు నలభైఆరు. నీటిపారుదల శాఖలో గుమస్తాగా ఉద్యోగం.

ఆవేళ సింహాచలం సైకిలును యాంత్రికంగా ఎడాపెడా తొక్కేస్తూ ఉన్నాడు. అంతకుముందే కరెంటు విషయమై విద్యుత్తు శాఖాధికారులతో గొడవ పడినందువల్ల అతని మనసులో ఆ గొడవే గింగుర్లు కొడుతూ ఉంది.

"ఎక్కడ చూసినా అవినీతే తాండవిస్తా ఉంది...అరే! కరెంటు మీటరు మార్చమంటే కూడా వినిపించుకోరూ.....వీళ్లకి 'మామూలు' ఇయ్యాల్లేమో! ఎవరడిగినా సరే, ఇయ్యను గాక ఇయ్యనంతే - ఎందుకియ్యాల? నాకిచ్చినట్లే గవర్నమెంటు వీళ్లకి యిస్తున్నారు గదా - జీతాలు. ఆమాట అన్నందుకే గదా ఆ నా కొడుకులు అంతమంది కొట్లాటకి దిగినారు. ఈ వెధవ నాయాండ్లని నిలువునా నరికితే గాని పాపం పోదు! థూ!" అంటూ స్వగతంగా అనుకుంటూనే రోడ్డుమీదకి తుపుక్కున కసిగా ఉమ్మేశాడు. ఉన్నట్టుండి రక్తప్రసరణ పెరిగింది సింహాచలానికి. అప్పుడెవరైనా అతన్ని ఆపి రక్తపోటు కొలిస్తే, దాని తాలూకు పరికరం పగిలిపోయే ప్రమాదం ఉంది.

"ఏమప్పా! యాడో జూసుకుంటూ సైకిలు తొక్కేదేనో, కొంచెముంటే నా కాలిమిందెల్లిపోతా ఉండె!" అంటున్నాడు ఓ పల్లెటూరి మనిషి.

తనదే తప్పు - ఏదో ఆలోచనలో రోడ్డుకు కుడివైపున పోవడం. అయినా, తన మనసు అతని మాటలకి కొంచెం నొచ్చుకుంది.

"సారీ, పొరపాటయిందప్పా!" అని ఒక్క మాట అనేసి రోడ్డుకు ఎడం వైపుకి మళ్ళించాడు సైకిల్ని.

అప్పటికి 4 గంటలవుతోంది....

తీరా ఇంటికొచ్చేసరికి తాళం వేసి ఉంది. ఇంటికి తాళంవేసేంత అవసరం ఏం వచ్చిందా...అని అనుకుంటూ ఉండగానే పక్కింటి అమ్మాయి నవ్వు మొహంతో.. "అంకుల్! ఆంటీవాళ్ళు మ్యాట్నీకి పోయినారు, ఇదిగో తాళం చెవి. మీకిమ్మనీ..." అంటూ తాళం చెవిని అందించింది. అతను మౌనంగానే అందుకున్నాడు. ఆ అమ్మాయి నవ్వుతూ మాట్లాడితే, కనీసం సభ్యత కోసమైనా తను నవ్వలేదు. ఆ పిల్ల ఏమనుకుందో ఏమో! అనుకుంటూనే తలుపు తీశాడు.

మొహం అంతా చమటలు పట్టి ఉన్నాయి. వెంటనే బట్టలు మార్చుకునీ, లుంగీ బనియనులతో తయారైనాడు. బాత్రూమ్ కెళ్ళి మొహం కడుక్కుని వచ్చాడు. కొంచెం రిలీఫ్‌గా ఫీలయి కుర్చీలో కూలబడ్డాడు. సిగరెట్టు అంటించుకుని పొగవదుల్తూ ఉంటే ఎదురుగా గోడకున్న కరెంటుమీటరు కనబడింది. అసహనంగా మీటరు వైపు చూశాడు. దానివల్లనే తనకు గత ఆరు నెలలుగా మనశ్శాంతి లేకుండా పోయింది. పగల గొట్టేద్దామా అన్నంత కోపంగా ఉంది - దానిమీద.

సింహాచలం వాళ్ళు ఆ ఇంట్లోకి మారినకొత్తలో చక్కటి ఇల్లు దొరికినందుకు ఎంతో సంతోషించారు. రెండు పెద్ద గదులూ, సుమారుపాటి వంటిల్లూ, ప్రతి గదికీ ఎక్కడ చూసినా అరలు ఉండటం, బాత్రూం లావెట్రీలు ఇంటికి కాస్త దూరంగా ఉండటం...దగ్గర్లోనే కుళాయీ, ఇంటిముందే ఉప్పునీళ్ళ బోరూ ఉండటంతో ఎక్కడలేని ఆనందం కలిగింది ఇంటిల్లిపాదికీ...

వారం రోజుల తర్వాత ఓమధ్యాహ్నం వేళ కరెంటు బిల్లు వచ్చింది. అందులో రెండు నెలలుకు గానూ ఎనిమిది వందల రూపాయలు అని ఉంది. అంతకుముందు ఆ ఇంట్లో ఉన్నవాళ్ళు మిక్సీ, హీటరు, ఫ్రిజ్ వంటివి వాడేవాళ్ళు కాదనీ, ఇంటికి ఉన్న మీటరు లోపం వల్లే అంతంత కరెంటుబిల్లు వస్తోందని పక్కింటి వాళ్ళు చెప్పారు. ఆ రోజు నుంచీ అతను ఉదయం లేస్తూనే మొదటచేసే పని మీటరు చూడ్డం. అట్లా మూడు రోజులు దాన్ని గమనించాడు. రోజుకు పన్నెండుయూనిట్లు కాలుతోన్నట్లు చూపుతోంది మీటరు. అంతే భయం వేసి ఆ రోజునుంచి ఆ మీటరు వేపు కన్నెత్తి చూడటమే మానుకున్నాడు. ఆలస్యం చేయకుండా ఆ మీటర్ని వెంటనే మార్పించేయా లనుకున్నాడు సింహాచలం. ఈ విషయంమీద మాట్లాడుదామా అంటే ఇల్లు గలవాళ్ళు ఎక్కడో బళ్ళార్లో ఉన్నారు. అంచేత వెంటనే విషయాన్నంతా వివరిస్తూ ఉత్తరం రాశాడు వాళ్ళకి. నాలుగురోజుల తర్వాత ఇంటి యజమాని నించీ ఉత్తరం వచ్చింది. అందులో ఇలా ఉంది..."మీరు మీటరు మార్పించమని ఉత్తరం రాశారు. నాకు అంత తీరికలేదు. ఈ ఉత్తరంతోపాటు కరెంటు ఆఫీసువాళ్ళకి అర్జీ పంపుతున్నారు. దాన్ని ఆఫీసులో ఇచ్చేసి మీటర్ని మార్పించేసుకోండి. ఇకపోతే, మీరు మొత్తం కరెంటు బిల్లు (ఎనిమిది వందలూ) కట్టేస్తే నాకేమీ అభ్యంతరం లేదు. అయితే, మీరు రాసినట్టు ఎక్కువ మొత్తాన్ని బాడుగలో పట్టుకోకండి. నెలకి ఏభైరూపాయలు మాత్రం పట్టు కోవాల్సి ఉంటుంది. అట్లా కాని పక్షంలో మీరు మరో ఇల్లు చూసుకోండి" ఉత్తరమంతా చదివి ఒక నిట్టూర్పు వదిలాడు సింహాచలం.

ఉత్తరంతోపాటు వచ్చిన అర్జీని తీసుకుని కరెంటు ఆఫీసులో ఇచ్చి రావడంతో సమస్య తీరిందనుకున్నాడు. సింహాచలం మరుసటిరోజే కొత్తమీటరు బిగించి పోతారని ఆశించాడు కూడా.

ఓ సాయంత్రం సింహాచలం ఇంటికొస్తూనే ముంగిట్లోనే తల్లి హరికెన్ లాంతరు శుభ్రంచేస్తూ కనబడింది. ఎప్పుడో ముప్పయేళ్ళ కిందటి సాయంత్రాలు జ్ఞాపకం వచ్చాయి సింహాచలానికి. అప్పటికి తాము ఉండే ఇళ్ళల్లో కరెంటు సదుపాయం ఉండేది కాదు. సాయంత్రం అవుతున్నట్టే లాంతరుకున్న చిమ్నీని నీటుగా శుభ్రం చేసి ఉంచకపోతే నాన్న కోపానికి గురికావాల్సి వచ్చేది. తనకు ఇష్టం లేకున్నా లాంతర్ని శుభ్రం చేయాల్సిందే. లాంతరు వెలుతుర్లోనే రాత్రి 12 గంటలదాకా చదువుకునే వాడు తను.

"కరెంటోళ్ళు మధ్యాహ్నం వచ్చి, బిల్లు కట్టలేదని ఫ్యూజ్ పీక్కుపోయినారురా!" అంది అమ్మ - చిమ్నీని తెల్లటి బట్టతో శుభ్రపరుస్తూ.

సింహాచలం మరేం మాట్లాడకుండా ఇంట్లోకి వెళ్ళిపోయాడు. మసగ్గా ఉన్న వెలుతుర్లోనే బట్టలు మార్చుకుని గదిలో అటూ ఇటూ పచార్లు చేస్తూ ఉన్నాడు.

కాఫీ అందిస్తూ భాగ్యమ్మ కూడా అమ్మ చెప్పినమాటే చెప్పింది. "ఊ" అనేసి- కాఫీ తాగడంలో ఉండిపోయాడు సింహాచలం. అతని మనసు బాధతో నిండిపోయి ఉంది. ఏదేమైనా సరే మరుసటిరోజు కరెంటుబిల్లు చెల్లించేసి ఫ్యూజ్ వేయించా లనుకున్నాడు.

అమ్మ లాంతరు వెలిగించింది. గుడ్డి వెలుతురు అలుముకుంది గదిలో.

"నాన్నా! మనమిద్దెమీద నించే కదా, కరెంటు వైర్లు పొయ్యేది, డైరెక్టుగా వైర్లనించీ కరెంటు తీసుకుందామా?" అన్నాడు అతని కొడుకు సుధాకర్.

"అవునండీ! ఈ ఒక్కరోజు అట్ల జేస్తే.." అంది భాగ్యమ్మ.

"ఛ, నోర్మూయండీ - బాగున్నారిద్దరూ ...ఎందురిట్లా పాడు ఆలోచనలు వస్తాయి మీకు...కరెంటు దొంగిలించడం ఎంత నేరమో తెలుసా?" అంటూ 'ఖయ్' మంటూ లేచాడు సింహాచలం.

"అబ్బబ్బా! అన్నీ నీకు నేరాలే - పోనీ పక్కింటి నించీ కరెంటు తీసుకుందామా- అనసూయమ్మగారిని అడుగుతాను" అంది భాగ్యమ్మ - భర్త కళ్ళలోకి భయం భయంగా చూస్తూ.

"ఏంది భాగ్యా! ఒక్కరోజు కరెంటు లేకపోతే చస్తామా! పక్క ఇళ్ళలోంచి కరెంటు తీసుకోవడం కూడా నేరమే తెలుసా?" అన్నాడు సింహాచలం అసహనంగా.

"ఎట్లా నేరమౌతుందండీ! అంతగా అయితే మనం కరెంటు ఎంత కాల్చినామో లెక్కేసి వాళ్లకి డబ్బిద్దాంలే!' అమాయకంగా చూస్తూ అంది భాగ్యమ్మ.

"వాళ్ళకి డబ్బిస్తే అది నేరం కాకుండా పోతుందా? మనకి గవర్నమెంటు ఇచ్చిన కనెక్షన్ మీదనే కరెంటు వాడుకోవాల తెల్సిందా? ఇట్లా పనికిమాలిన ఆలోచనలు కట్టిపెట్టెయ్యి...అట్లయితే ఎవ్వరూ మీటరు వేసుకోరు. వీధికొకరికి ఉంటే చాలు. వీధంతా హాయిగా ఆ ఒక్క మీటరుతోనే కరెంటు వాడుకుంటూ ఉంటారు" అన్నాడు ఆవేశంగా సింహాచలం.

సింహాచలాన్ని ఇంకా ఎక్కువ మాట్లాడిస్తే వాతావరణం మరీ భయంకరంగా మారిపోతుందని ఊరకుండి పోయింది భాగ్యమ్మ.

"ఏందో - వీడూ, వీడి మాటలూ ఎవ్వరికీ అర్థమేకావు!" అంటూ గొణుగుతూ ఉంది తల్లి.

ఆ మరుసటి రోజు బిల్లు చెల్లించాక, అప్పుడు ఫ్యూజ్ వేసిపోయారు కరెంటువాళ్ళు.

సింహాచలం మాత్రం మీటర్లు మార్పించేందుకు చేసే ప్రయత్నాలు మాననే లేదు. అయినా మీటరు మార్చలేదు.

ఈలోగా రెండునెలలు గడిచిపోయాయి. మళ్ళీ ఎనిమిది వందలరూపాయల కరెంటుబిల్లు వచ్చింది. నాలుగ్గదుల్లో ఉన్న నాలుగుబల్బులకీ, ఒక టీవీకి రెండు ఫ్యాన్లకీ అంతంత బిల్లు రాడంతో - నిజంగా భయపడిపోయాడు సింహాచలం.

సింహాచలం ఈసారి సీరియస్సుగానే వెళ్ళి విషయం వివరించాడు కరెంటు అధికార్లకి... అయినా ఫలితం శూన్యం.. కాల్చని కరెంటుకి డబ్బు కట్టాల్సివచ్చినందుకు ఒకింత బాధపడుతూ.. కడుతున్నది మనగవర్నమెంటుకే కదా అన్నదాంతో కొంత ఊరట చెందాడు.

"చాలామంది మీటర్లు తిరక్కుండా అయస్కాంతం పెడతారంట, మనమూ పెడదాం ఇట్ల ఎనిమిది నూర్లు బిల్లు వస్తుంటే ఎట్ల?" అంది భాగ్యమ్మ. ఓ రోజు ఉదయం.

"అట్ల చేయడం అవినీతే.. అవినీతంటే నాకు అసహ్యం!" అన్నాడు సింహాచలం కటువుగానే.

"ఏంది అవినీతండీ! అవినీతంట అవినీతి! కాల్చని కరెంటుకి డబ్బు చెల్లించడం అవినీతి కాదా? అది మీకు అసహ్యంగా లేదా? కట్నం తీసుకునే వాడివేకాదు అవినీతి, ఇచ్చేవాడిది కూడా అవినీతే - అని ఎన్నోసార్లు నువ్వే కదా అంటూ వుంటావు" అంది భాగ్యమ్మ తన అక్కసుని కనబడనీయకుండా.

"ఏమో, గవర్నమెంటు చట్టాల విషయంలో కొన్ని సడలింపులు ఉండల్లని అనుకుంటాను. మనం అవినీతికి పాల్పడకూడదబ్బా!" అన్నాడు సింహాచలం.

ఈ మొండి మనిషితో వాదించడం ఎందుకులే అని వంటింట్లోకి వెళ్ళిపోయింది భాగ్యమ్మ.

ఇది జరిగి కూడా అప్పుడే రెండు నెలలు దాటిపోయింది.-

ఇంటిముందు ఆటో ఆగిన చప్పుడయితే తలెత్తి చూశాడు సింహాచలం.

ఆటోలోంచి తన తల్లీ భాగ్యమ్మ, సుధాకరూ దిగారు.

ఇంట్లోకి అడుగుపెడుతున్నట్లే - "ఏం అట్లున్నావూ" అంది భాగ్యమ్మ.

"ఎట్లున్నాను?" అంటూ ఎదురు ప్రశ్న వేశాడు సింహాచలం.

"మొగమంతా పాలిపోయి ఉంది" అంటూ అతని జుత్తులోకి వేళ్ళు జొనిపి ప్రేమగా అంది భాగ్యమ్మ.

"ఏమయిందిరా సుస్తిగా ఉందా?" అంది తల్లి అప్పుడే లోపలికి అడుగుపెడుతూ.

"ఏం లేదమ్మా! మీదంతా విచిత్రం!" అన్నాడు తను నవ్వాలని ప్రయత్నిస్తూ.

"నాకూ అట్లే అనిపిస్తా ఉంది నాన్నా!" అన్నాడు సుధాకరు.

"రేయ్! నోర్మూసుకొని పో! అంతా బెడ్ పేషంటుని పరామర్శించినట్లు మాట్లాడతా ఉండారు! మధ్యాహ్నం అర్ధరోజూ ఆఫీసుకి సెలవు పెట్టి ఆ కరెంటు ఆఫీసు కాడికి పొయ్యొస్తిని...ఏమంటే కొంచెం గొడవ పడివస్తిని. ఏంచేసేది? ఊరికే అట్ల తిప్పించకుంటూ ఉంటే అర్ధరోజు సెలవు వేస్టయి పోయే. ఇదే ఆలోచించుకుంటూ వుంటే మీరు వస్తిరి - అంతే!" అంటూ భార్యనుద్దేశించి అన్నాడు.

"ఏమండీ నీకో శుభవార్త! బిల్లు వచ్చింది - కరెంటుబిల్లు! చూళ్ళేదా? ఇద్దో టీవీ మీదే ఉంది" అంటూనే బిల్లుతీసి ఇచ్చింది భాగ్యమ్మ.

"ఆ. ఁ...కరెంటు బిల్లా?" అంటూ షాక్ తిన్నంతగా అరిచాడు సింహాచలం.

"ఎందుకట్ల అరుస్తావు? నువ్వు ఊహించినంత భయంకరంగా లేదు. బిల్లు- రెండు నెలలకీ కలిసి ఎనభై రూపాయలే!"

బిల్లుని చూడగానే సింహాచలం ముఖం పొద్దుతిరుగుడు పువ్వంత విచ్చుకుంది- "అవునే - క్వా ఈజిట్ పాజిబుల్..." అన్నాడు.

"ఏమో, ఐడోంట్ నో!" అంటూ వంటింట్లోకి వెళ్లింది భాగ్యమ్మ.

నిజంగా నమ్మలేకుండా ఉన్నాడు సింహాచలం .. ఏమైనా కరెంటు సామాన్లింతే.అవి ఎప్పుడు సరిగ్గా పనిచేస్తాయో ఎప్పుడు లేవో ఎవరికీ తెలియదు. ఈ విషయం తెలీక ఊరికే ఆ కరెంటు వాళ్ళతో గొడవపెట్టుకున్నాడు తను - మీటరు మార్చమని. బుర్రంతా చెడగొట్టుకున్నాడు. అర్ధరోజు సెలవు కూడా వృథా చేసుకున్నాడు. ఇంక తను ఎవరి చుట్టూ తిరగాల్సిన పనిలేదు. వెంటనే ఆనందంగా సిగరెట్టుని వెలిగించుకుని తృప్తిగా పొగ పీల్చి విలాసంగా గాల్లోకి ఊదాడు. కాసేటికి బట్టలుమార్చుకుని బజార్లోకి వెళ్ళాడు. సింహాచలం రాత్రి ఎనిమిది గంటలకి ఇల్లుచేరుకున్నాడు. బట్టలు విప్పుతూ తనని ఈ రోజు ఆనందింప జేసిన మీటరు వైపు యాంత్రికంగా చూశాడు.

అంతే, అతని చూపులు అక్కడే అతుక్కుపోయాయి...

కెవ్వుమని కేకపెట్టబోయి, తమాయించుకుని "ఏమేవ్!" అంటూ అరిచాడు.

"ఏమండీ!" అంది లోపల్నించి భాగ్యమ్మ.

"ముందిట్లా రావే!" అన్నాడు మరింత గట్టిగా.

"ఏమయిందీ!" అంటూ వచ్చింది భాగ్యమ్మ.

"ఎవరాపని చేసింది?" అన్నాడు.

"ఏ పనీ?"

"మీటరుకి వైరు పెట్టడం!" అంటూ మీటర్ని చూపించాడు. మీటరు కింద ఆకుపచ్చటి వైరు మీటరు చక్రాన్ని నిలబెట్టేందుకు దండలా వేలాడుతోంది.

"అంతేకదా! సుధాకరు పెట్టినాడులే!" అందామె - అతి తేలిగ్గానే.

"ఏడీ వాడు? రేయ్ సుధాకరూ!" అంటూ కేకపెట్టాడు సింహాచలం.

"వాడు మిద్దెమీద చదువుకుంటున్నాడులేండి - వాన్నెందుకు డిస్టర్బ్ చేస్తారు" అంది భాగ్యమ్మ - మెల్లగా.

"అది కాదే! ఇది ఎంత అవినీతో తెలుసా?" అన్నాడు - ఉపోద్ఘాతంగా.

"తెలుసు - మంచి మీటరు వేయించుకొనేదానికి, రోజూ ఆ కరెంటు ఆఫీసు చుట్టూ తిరిగినా పట్టించుకోకపోవడంలో గొప్ప నీతి ఉందా? రెండు నెలల్నించీ రాత్రి పూట ఈ పనిచేస్తుండబట్టే, మనకి అసలైన కరెంటుబిల్లు వచ్చింది."

"ఎవరయినా మీటరు రీడింగు, ఉద్యోగి వస్తే - ఇది చూస్తే -ఇంకేమయినా ఉందా? కేసు బుక్ చేస్తాడు - కోర్టు కీడుస్తాడు" అంటూ మండిపడ్డాడు సింహాచలం.

"నువ్వుగీన అట్లా ఉద్యోగం చేస్తే ఆ పనే తీరా చేసేది - వీళ్ళు నా వాళ్ళూ, ఇది నా ఇల్లూ అని కూడా ఉండదు నీకి.. నీదంతా ఏదో సోది.. అప్పుడే నెలకిందటే ఆ మీటరు చూసే ఆయప్ప వచ్చి ఆ వైరుని చూసి కేసు రాస్తాననె.. యాభై రూపాయల కాగితము చేతిలో పెడతానే నవ్వుతా ఎల్లిపాయె! ఈ యప్పదంతా ఇనోదము.. కాల్చుని కరెంటుకి దుడ్లు కట్టేది నీతి.. ఎక్కువ తిరిగే చక్రాన్ని నిలబెట్టేది అవినీతి. ఎందో అర్థమే కదప్పా నీకత!" అంటూ ఉంది తల్లి వంటింట్లోంచి.

తలపట్టుకొని - మీటర్ని నిలబెట్టేసిన ఆకుపచ్చటి వైరుని చూస్తూ ఉండిపోయినాడు సింహాచలం.

(ఆహ్వానం - నవంబరు, 1994)

# మీసాలు

"టిఫిన్ రెడీ అయ్యిందీ!" అంటూ వంటింట్లోంచి కేక పెట్టింది సావిత్రి.

"ఆఁ...వస్తున్నా!" అంటూ తనూ ఓ చిన్నపాటి కేకపెట్టాడు వీరయ్య అద్దంలో తనివితీరా మీసాల్ని చూసుకుని పురి పెట్టుకుంటూ.

ఆ, ఇంట్లో టిఫిన్లూ, భోజనాలూ ఏయే సమయాల్లో తింటారో ఆ చుట్టుపక్కల ఇళ్ళవాళ్ళకందరికీ తెలిసిపోతుంటుంది. అలా తెలిసిపోవడానికి కారణంవాళ్ల కేకలే! సావిత్రి వాళ్లది పల్లెటూరు అవడం వల్ల ఆమెకు గట్టిగా కేకలుపెట్టి మాట్లాడ్డం అలవాటు. ఆమె అలవాటే వీరయ్యకూ వచ్చేసింది.

'అద్దం ముందర నిలబడితే చాలు - భోజనం, టిఫెనూ ఏమీ కాబట్టవు. అట్లే మీసాల్ని దువ్వుకుంటూ, పురిపెట్టుకుంటూ మురిసిపోతా ఉంటావు!" అంటూ చిరుకోపం ప్రదర్శిస్తూ వీరయ్య పక్కనే నిలబడింది సావిత్రి. అతని మీసాల్ని అద్దంలో మొహాన్నీ మార్చిమార్చి చూస్తోంది.

అతను ఆమెవైపు చూడకుండా తన మీసాల్నే చూసుకుంటూ ఉన్నాడు. కాసేపు ఎడమ బుగ్గని గాలినింపి బుడగలా చేస్తాడు. మారి కాసేపు కుడి బుగ్గని బుడగలా మార్చేస్తాడు. ఇలా మీసాల అందాల్ని వివిధ కోణాల నుంచీ పరిశీలించి చూస్తూ ఉన్నాడు. మీసాలలోని ప్రతి వెంట్రుకనీ క్రమశిక్షణతో ఒకదాన్తో ఒకటి ఎట్లా ఒదిగి చివర్లో మెలితిరిగి ఉన్నదీ పరీక్షగా చూస్తూ ఉన్నాడు. ఎక్కడయినా ఏ ఒక్క వెంట్రు కయినా తిరుగుబాటు ప్రకటించిందా - దాన్ని ముందు దువ్వెనతో బెదిరిస్తాడు. అక్కడితో అది బెదిరి అణిగి మణిగి ఉందా సరేసరి! లేదూ మొక్కవోని ధైర్యంతో తిరుగుబాటు ప్రకటిస్తూనే ఉందా - ఇక అంతే దాన్ని కత్తెరతో శిక్షిస్తాడు వీరయ్య.

"టిఫెన్ చల్లారిపోతా ఉందీ!" అంది సావిత్రి దీర్ఘం తీస్తూ.

మీసాల ప్రపంచంలోంచి ఇలలోకి ఊడిపడ్డట్టు ఉలిక్కిపడ్డాడు వీరయ్య. కొంత కోపం, కొంత చిరాకూ కలగలపిన చూపులతో శ్రీమతి వైపు చురచుర చూడసాగాడు.

'ఏంది అట్ల చూస్తావు... టిఫెను...." అంది సావిత్రి అతని చూపులకి అర్థాలేవీ వెతక్కుండానే.

"ఏందే! ఎప్పుడూ టిఫెన్ టిఫెన్ అంటూ నా ప్రాణాలు తీస్తావ్ - ఏం పనిచేస్తా ఉండాడా అనికూడా చూడకుండా!"

"సందు దొరికితే చాలు అద్దం ముందర నిలబడి మీసాలు పురిపెట్టే పనేగదా నీది! ఇంతకన్నా నీకు ఇంకో పని ఉన్నట్లు కాపురాని కొచ్చిన ఈ పదేండ్లలో నేను చూడనే లేదబ్బా!"

"నోర్మయ్యవే, ఏం టిఫెన్ చేసినావ్?"

"దోసెలు - సెని గిత్తనాల చట్నీ!"

"అవునా ! అయితే పద పద!"

ఇద్దరూ వంటింటివేపు దారి తీశారు.

వీరయ్యకు మీసాలు మాత్రమే లావుకాదు. శరీరం కూడా లావే...'లావు' అనడం కన్నా దృఢంగా ఉంటాడు అనడమే సబబు! అతను చేస్తోన్న పోలీసు కానిస్టేబులు ఉద్యోగానికి అతని శరీరంతో పాటూ అతని మీసాలు కూడా ఎంతో ఉపయోగకరంగా ఉంటాయి. ఆ మాటే అతని సహోద్యోగులూ, అతని దగ్గరిమిత్రులూ అన్నప్పుడు తృప్తిగా నవ్వుతుంటాడు వీరయ్య. నిజానికి కానిస్టేబుల్ వృత్తిలో ఉన్న ఎంతోమంది కంటే వీరయ్యకు దయా, మానవత్వం అన్నవి ఎక్కువ పాళ్లలో ఉన్నాయనే చెప్పాలి. అందుకే వీరయ్య పై అధికారులు -

"నీకు అంత లావు మీసాలే లేకుంటే బస్టాండులో మూటలు మోసే హమాలీ కూడా ఖాతరు చెయ్యడు తెలుసా!" అని అంటూ ఉంటారు. అలావాళ్ళు అన్నందుకు అతను ఎప్పుడూ నొచ్చుకోలేదు. తనని ఏదో రకంగా కాపాడుతూ ఉన్న మీసాల మీద అతనికి ఎప్పుడూ ఎనలేని ప్రేమే! అసలు ఆ ప్రేమ ఈనాటికి కాదు - దాదాపు పదేళ్ళనాడు జరిగిన ఒక సంఘటన అతన్ని ఎప్పటికీ మురిసిపోయేలా చేస్తూ ఉంటుంది.

అదేమిటంటే -

అప్పటికింకా వీరయ్య 'రిజర్వుడు కానిస్టేబులు' గానే ఉన్న రోజులు. అప్పుడప్పుడే అతనికి కొత్తగా పెళ్లయింది కూడా. తెల్లవారుతున్నట్టే లేవడం, నున్నగా గడ్డం గీసుకుని, చక్కగా గంజిపెట్టి ఇస్త్రీ చేసిన ఖాకీ నిక్కరూ, మందమైన తెల్లటి బనియనూ వేసుకుని పెరేడ్ గ్రౌండ్‌కు వెళ్ళడం -పెరేడ్ అయిపోయాక ఇంటికొచ్చేసి స్నానం పూర్తి చేసుకుని చక్కగా తలనూ, మరీ చక్కగా మీసాల్నీ దువ్వుకుని డ్యూటీకి వెళ్తున్న రోజులు.

ఓ రోజు ఉదయం వీరయ్య డ్యూటీకి వెళ్ళాడు. 'ఎస్.పి.' దొరగారు హఠాత్తుగా రిజర్వుడు కానిస్టేబుల్స్‌ని ఇన్‌స్పెక్షన్ చేయడానికి వస్తున్నట్టు కబురందింది. కానిస్టేబుల్సందరికీ గుండెల్లో గుండెలు లేవు. ఇక వీరయ్య సరేసరి. అసలే అధికారులంటే హడలి చచ్చే మనిషాయె! ఆ వస్తున్నది అలాంటిలాంటి అల్లాటప్ప అధికారి కాదాయె! సాక్షాత్తు ఎస్.పి.దొరగారు! ఎస్.పి.గారు వచ్చి కొద్దినెలలే అయినా అతనంటే అందరికీ భయం. డిసిప్లిన్ లేకపోతేనూ, యూనిఫామ్ ఏ మాత్రం బాగా లేకున్నా గడ్డం షేవ్ చేసుకోడంలో శ్రద్ధ లోపించినట్టు అనిపించినా ఆయన అగ్గిమీద గుగ్గిలంలా మండి పడిపోతాడు. ఒకటి, రెండు ఇంక్రిమెంట్లను కోతపెట్టడానికి కూడా వెనకాడడని అందరికీ తెలుసు. మరి అలాంటి ఎస్.పి దొరగారు ఇన్‌స్పెక్షన్‌కు వస్తూ ఉంటే భయపడని కానిస్టేబులు ఎవరుంటారు?

మరి కొద్ది క్షణాల్లో ఎస్.పి. గారు వస్తున్నారనగా వరసలు తీరి క్రమశిక్షణని పాటిస్తూ నించున్నారు కానిస్టేబుల్స్. వీరయ్య అందరి కంటే చివరి వరసలో

చిట్టచివరి వాడిగా నించున్నాడు. తనవరకూ 'ఎస్.పి. దొర రాకుంటే తలనీలాలూ, నూటొక్క కొబ్బరికాయలూ, ఆకుపూజలూ...' ఇలాంటివి ఎన్నో తనకే జ్ఞాపకం లేనన్ని మొక్కులు అర డజను దేవతలకి మొక్కేసుకున్నాడు వీరయ్య. కానిస్టేబుళ్ళకి ఎదురుగా చెక్క బొమ్మలా నిలబడి ఉన్నాడు ఓ హెడ్ కానిస్టేబుల్. అతని పక్కగా సరదా చూడ్డానికి వచ్చిన వాడిలా నిలుచుని ఉన్నాడు రిజర్వుడు సబ్.ఇన్స్పెక్టర్.

తెల్లటి అంబాసిడరు కారులో ఎస్.పి.గారు రానేవచ్చారు. గంభీరంగా, హుందాగా కారుతలుపు తీసుకుని దిగుతున్నారు. ఆయన యూనిఫాంలో లేరు. నేవీ బ్లూ పేంటులోకి తెల్లటి 'టీ' షర్టుని ఇన్షర్టు చేశారు. కాళ్లకి స్టయిల్గా ఉన్న బ్రౌన్ షూస్ వేశారు. కళ్లకి రోల్డుగోల్డ్ ఫ్రేమ్ ఉన్న ఫోటోగ్రే అద్దాలు పెట్టుకుని ఉన్నారు. నింపాదిగా నడుస్తూ వస్తున్నారు. అతనికి ఎదురెళ్లి రిజర్వుడు ఎస్.ఐ. గారు సెల్యూట్ చేశారు. దాన్ని ఆయన శిరఃకంపంతోనే స్వీకరించి ముందుకు వస్తున్నారు. కానిస్టేబుళ్లందరూ బిర్ర బిగుసుకుని పోయారు.

చెక్క బొమ్మకు నోరు మాత్రమే కదిలినట్లు హెడ్ కానిస్టేబుల్ 'సావ్ధాన్', 'విశ్రమ్' అంటూ గావుకేకలు పెట్టసాగాడు. అందాకా బిర్ర బిగుసుకుపోయిన కానిస్టేబుళ్లందరూ 'రిమోట్ కంట్రోలర్' ఆజ్ఞల్ని పాటిస్తున్న రాబోట్లలా యాంత్రికంగా కాళ్లనీ, చేతుల్నీ జరుపుతున్నారు. వచ్చిన ఎస్.పీ.గారికి సెల్యూట్ చేయవలసిందిగా హిందీలో మరోమారు గావుకేక పెట్టాడు. గొప్ప క్రమశిక్షణతో కానిస్టేబుల్లందరూ పెరేడ్ పద్ధతిలో చక్కగా సెల్యూట్ చేశారు. ఎస్.పీ.దొరగారు యథాలాపంగా, లాంఛన ప్రాయంగా స్వీకరించారు ఆ సెల్యూట్ని.

ఆ తర్వాత మళ్ళీ 'సావధాన్', విశ్రమ్లను చేయించి అందర్నీ 'విశ్రమ్'లో ఉంచేశాడు. కానిస్టేబుల్ ఎస్.పీ గారు ఒక్కొక్కర్నే పరిశీలనగా చూస్తూ నడుస్తున్నారు.

ఎస్.పీ. గారు ఓచోట ఆగిపోయి "స్టుపిడ్...గెడ్డం చేసుకోవడం తెలీదు. పోలీసు ఉద్యోగం అనుకున్నావా? ఏమనుకున్నావ్? దిస్ ఈజ్ ఫస్ట్ వార్నింగ్ టు యూ! మరోసారి నీ గెడ్డం ఇలా కనిపించిందంటే ఐ విల్ సస్పెండ్ యూ!" అంటూ కేకలేస్తున్నారు ఓ కానిస్టేబుల్ని.

వీరయ్య గుండె మాత్రం వేగం పుంజుకున్నది. తను గెడ్డం సరిగా చేసుకున్నాడో లేదో? పెరేడ్కు వెళ్ళాలన్న ఆత్రంలో రోజూ చేసుకునే వెధవ గెడ్డమేగా!' అన్న నిర్లక్ష్యంతో షేవ్ చేసుకుంటాడు వీరయ్య. అందుకే అదురు పుట్టింది. గొంతుదగ్గరా, చెంపల మీదా, ఎక్కడయినా ఒకటి రెండు వెంట్రుకలు ఉన్నాయేమో అని ఒకటే అనుమానం. ఒకసారి గెడ్డాన్ని తడిమి చూసుకుందామా అనుకున్నాడు. 'విశ్రమ్' పోజునుండి ఏ మాత్రం కదిలినా ఎప్పుడో వస్తుందనుకునే ప్రమాదం వెంటనే వచ్చేస్తుందనే భయంతో గమ్మున ఉండిపోయాడు వీరయ్య.

నలుగురైదుగురు చీవాట్లు తిన్నాక వీరయ్య వంతు వచ్చేసింది. గుండెని బండ చేసుకోవాలన్న ప్రయత్నంలో పూర్తిగా విఫలుడై అలా ఎస్.పీ. వంక చూస్తున్నాడు నిస్సహాయంగా.

ఎస్.పీ.గారు వీరయ్యను పరిశీలనగా ఆపాదమస్తకం చూశారు. వీరయ్య లావుమీసాలవద్ద అతని చూపుల్ని ఆపేశారు. వీరయ్య నోట్లో తడి ఆరుకుపోతోంది. ఎస్.పీ. గారు "యూ సీ మిస్టర్!" అంటూ ఎస్.ఐ. గార్ని పిలిచారు.

వినయ పూర్వకంగా ఎస్.ఐ. గారు వచ్చి నిలుచున్నాడు.

వీరయ్యను చూస్తూ ఎస్.పి. గారు "వెరీ గుడ్ ! వెరీ నైస్! చూడవయ్యా ఇతన్ని పోలీసంటే ఇద్దో ఇలా ఉండాలి. ఇతని మీసాల్ని చూడవయ్యా, ఎంత చక్కగా పెంచాడో, మంచి డిసిప్లిన్ ఉన్న కానిస్టేబుల్ ఇలా ఉంటాడండీ!" అన్నారు.

తను వింటోంది కలలోనా, ఇలలోనేనా నమ్మలేక పోతున్నాడు వీరయ్య. చూడండి మిస్టర్ ఎస్.ఐ.గారూ! ఇతని మీసాలపట్ల ఇంత ఇంట్రస్టు ఉన్నందువల్ల ఆ మీసాలకు తగ్గట్టుగా దేహదారుఢ్యం కోసం ఇతనికి పోలీస్ ఫండ్‌లోంచి రెండువేల రూపాయలు శాంక్షన్ చేస్తున్నాను. ఆ డబ్బుతో ఇతను ఓ మంచి పాడి గేదెను కొనేటట్టు చూడాలి. ఇదో కానిస్టేబుల్ నీ పేరేంటో...."

"వీరయ్య సార్!" అన్నాడు అతి నమ్రతతో.

"ఆఁ! చూడు వీరయ్యా ! ఈ బహుమతి నీ మీసాలకే! నువ్వు గేదె ఉందికదా అని పాలని అమ్మేశావో..." అంటూ బెదిరిస్తూ నవ్వేశారు ఎస్.పీ. గారు.

ఎస్.పీ.గారు వెళ్ళిపోయాక కానిస్టేబుళ్ళందరూ చుట్టుముట్టారు వీరయ్యని. అతన్నో హీరోలా చూశారు అంతా. ఆ మరుసటి రోజే ఎస్.పి. గారు రెండు వేల రూపాయలు ఇవ్వడం, అటుతర్వాత రోజున ఓ మంచి గేదెని వీరయ్య కొనడం జరిగిపోయాయి.

అప్పటినుంచీ చాలామంది కానిస్టేబుళ్ళు తనలా మీసాలు పెంచడంలో తనని అనుకరించేవాళ్లు.

వీరయ్యకు రిజర్వుడు కానిస్టేబులుగా ఉండడం ఇష్టం లేక లోకల్ కానిస్టేబుల్‌గా వెళ్ళేందుకు ఎస్.పి.గారికి అర్జీ ఇచ్చుకున్నాడు. ఓ మూడు సంవత్సరాల తర్వాత అతన్ని లోకల్ కానిస్టేబుల్‌గా మార్పు చేశారు.



నీటుగా ఖాకీ డ్రెస్సు వేసుకుని సైకిలు ఎక్కి స్టేషను చేరుకున్నాడు పోలీసు వీరయ్య.

అదో టౌన్ పోలీస్ స్టేషను ఐదు పెద్ద గదులున్నాయి. బయటి గదిలో ఎస్.ఐ. కూచుంటాడు. దానికి పక్కగా ఉన్న గదిలో హెడ్ కానిస్టేబులూ, రైటరూ కూచుని ఉంటారు. దానికి ఆనుకుని ఉన్న గది గార్డు రూము. బయటి గదికి ఎదురుగా ద్వారానికి పక్కగా రెండు లాకప్ గదులున్నాయి. అందులో అనుమానితుల్నీ, అరెస్టు చేసిన వారినీ ఉంచుతారు. మొదటి లాకప్ గదిలో అయిదుగురు కడ్డీల్లోంచి తొంగి చూస్తున్నారు. వాళ్ల చూపుల్ని చూస్తే జీవితమంతా పోగొట్టుకున్నారేమో అన్న భ్రమలో పడిపోతారు. వీరయ్యకి ఇలాంటి వాళ్లని చూసినప్పుడు కడుపు తరుక్కు పోతుంటుంది.

బయటి గదిలోనే కూచున్న ఎస్.ఐ. ముందుకు వచ్చి సెల్యూట్ చేశారు వీరయ్య.

"పన్నెండింటికి నువ్వే కదా సెంట్రీ ఎక్కేది!" అడిగాడు ఎస్.ఐ.

"యస్సార్!" అన్నాడు వీరయ్య.

"కొత్త డి.ఎస్.పి. దొర వస్తున్నారు. కాస్త ఎలర్ట్‌గా ఉండవయ్యా! ఆయన మహా స్ట్రిక్ట్ ఫెలో. కర్నూల్లో స్టాపుని గడగడలాడించాడు" అన్నారు ఎస్.ఐ గారు.

"అలాగే సార్!" అనేసి బయటికి కొచ్చేశాడు వీరయ్య.

పన్నెండు గంటలు అవుతున్నట్టే సెంట్రీ డ్యూటీకి ఎక్కాడు వీరయ్య. మామూలుగా సెంట్రీ డ్యూటీకి ఎక్కడం అంటే చాలా హాయైన పని. ఏముందీ, స్టేషను ఆవరణలో ఉన్న వేపచెట్టు కింద తక్కిన కానిస్టేబుళ్ళతో కబుర్లాడుకుంటూ ఉండడం, లేదంటే ఎస్.ఐ. గారికో, సి.ఐ. గారికో సిగరెట్లూ కాఫీలూ తెచ్చి ఇవ్వడమే డ్యూటీ అన్నమాట. కానీ, ఆ రోజు స్టేషను ముఖద్వారం వద్దనే కొయ్యబొమ్మలా నిలుచుని ఉన్నాడు. అతని చేతిలో తుపాకీ ఉంది. దాని అడుగుభాగం అతని కాళ్ల వద్ద ఉంది. మొన చేతిలో ఉంది. అంటే ఏ క్షణంలోనైనా వచ్చే డి.ఎస్.పి.గారికి తుపాకీతో 'వందనం' చేయడానికి వీలుగా నిలబడ్డాడన్న మాట.

"వీరయ్యదే ఛాన్సురా.. ఈ రోజు నిజమైన సెంట్రీడ్యూటీ చేస్తున్నాడు!" అంటూ చెట్టుకిందనుంచి ఇద్దరు కానిస్టేబుళ్ళు హాస్యాలాడుతున్నారు.

మీసాలచాటునుంచీ నవ్వుకున్నాడే కానీ కదల్లేదు వీరయ్య. స్టేషనులోని వైర్‌లెస్ సెట్‌లో "హలో రవీంద్ర... ఓవర్.. హలో... 378 సెట్ వద్దకు రమ్మనండి....ఓవర్" ఇలా ఏవో శబ్దాలు వినిపిస్తున్నాయి అస్పష్టంగా.

ఇంతలో ఓ నీలంరంగు జీపు స్టేషను ముందు ఆగింది. అందులోంచి డిప్యూటీ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీసు (డీ.ఎస్.పీ) గారు దిగారు. అతను పూర్తిగా ఖాకీ యూనిఫామ్‌లో ఉన్నారు.

ఆత్రంగా స్టేషనులోంచి పరుగు పరుగున వచ్చి సెల్యూట్ చేశాడు ఎస్.ఐ., డీ.ఎస్.పీ. గారికి.

వీరయ్య సెంట్రీగా తన డ్యూటీని మరింత శ్రద్ధగా చేసేందుకు ముక్కుకు సూటిగా చూస్తూ నీలుక్కుపోయి బొమ్మలా ఉన్నాడు కదలకుండా.

స్టేషను మెట్లెక్కుతూ ఉన్న డీ.ఎస్.పీ గారు తనకు దగ్గరగా వస్తున్నట్టే ఎంతో 'స్మార్ట్' గా తుపాకీతో గౌరవ వందనం చేశాడు వీరయ్య.

అంతే.

ఓసారి తేరిపార చూశాడు డీ.ఎస్.పీ., వీరయ్యని. డీ.ఎస్.పీగారి కళ్లు ఏవగింపుగా వీరయ్య మీసాల్ని చూశాయి.

"ఎవరీ మీసాల పోతు?" అన్నాడు డీ.ఎస్.పీ.

"మన కానిస్టేబుల్ సార్!" అన్నాడు ఎస్.ఐ. నమ్రతతో.

"సర్లేవయ్యా! జోకులు మాట్లాడకు. ఐ హేట్ జోక్స్ యూ నో! మన కానిస్టేబుల్ కాకుండా ఎవడో వచ్చి మన స్టేషను ముందు సెంట్రీ డ్యూటీ ఎలా చేస్తాడని

అనుకుంటాను? అంతమాత్రం నాకు కామన్ సెన్స్ ఉండదనుకున్నావా?...." ఇలా సాగుతోంది డి.ఎస్.పీ. గారి ధోరణి.

'మీసాల పోతు' అన్నమాట ముల్లులా గుండెలో గుచ్చుకుని 'కళుక్కు' మంది వీరయ్యకు.

డీ.ఎస్.పీ. గారు అక్కడినుంచి చకచకా వెళ్ళిపోయి ఎస్.ఐ. కూచునే సీటులోనే కూచున్నారు. అతనికి ఎదురుగా ఉన్న కుర్చీలో ఎస్.ఐ. గారు కూచోలేదు.'దొరగారి అనుమతి కొరకు' అలా డీ.ఎస్.పీ. గారి వైపు దీనంగా చూస్తూ ఉన్నాడు.

"వాడు చేస్తోంది పోలీసు ఉద్యోగం అనుకున్నాడా? లేక దాదాగిరి ఉద్యోగం అనుకున్నాడా? పిలూ వాణ్ణి!" అన్నారు.డీ.ఎస్.పీ. గారు ఎస్.ఐ. గారితో.

ఏయ్ 416 దొరగారు పిలుస్తున్నారు. తొందరగా రా!"అంటూ ఎస్.ఐ.గారు గట్టిగానే కేకవేశాడు.

భయం భయంగా చూస్తూ వచ్చాడు వీరయ్య.

"నీ పేరేమిటి?" అంటూ సిటీలో పెరిగిన గొప్పింటి అబ్బాయి జెర్రి పిల్లను చూసినట్టు వీరయ్య మీసాల్ని అసహ్యంగా చూస్తున్నాడు.

"వీ...వీరయ్య సార్!"

"ఎందులో వీరుడివి? వీరుడి ననేనా మీసాలు అంతంత లావుగా పురిపెట్టి మరీ పెంచుతున్నావ్?"

ఏం జవాబివ్వాలో తోచక మౌనంగా నిలుచుండిపోయాడు వీరయ్య బిక్కమొహంతో.

"ఏం అలా గుడ్లు మిటకరించి చూస్తున్నావ్? బజారు రౌడీ నాయాళ్లకీ, నీకూ తేడా ఏముందీ? ఆ బట్టలలోనా? రాస్కెల్ ! కొండముచ్చు మొహానికి పురులు తిరిగిన మీసాలొకటి.. పెద్ద పాలెగాడివా నువ్వు!" అంటున్న డీ.ఎస్.పీ. మాటలకి తన కాళ్ళ కింద భూమి కదిలిపోతున్నట్టు ఉంది వీరయ్యకి. గుండె లయ తప్పి కొట్టుకుంటోంది. అనవసరంగా తన మీసాల్ని ఎద్దేవా చేస్తూ, తిట్టి పారేస్తూన్న డీ.ఎస్.పీ. మీద విపరీతంగా కోపం ముంచుకొచ్చేస్తోంది. పేదవాని కోపం పెదవికి చేటు. ఏం చేయగలడు తను తల వంచుకోవడం తప్ప!

"ఏయ్! నిన్నే ఇటు చూడు ఏంటలా తల వాల్చేశావు మరోమారు నేను వచ్చినపుడు ఇలా బుర్ర మీసాలతో కనిపించావో...దిగ్గొరిగిస్తా ఏమనుకున్నావో! ఎస్.... యూ కెన్ గో. వెళ్ళిపో... నీ మొహం చూస్తుంటేనే ఏవగింపు" అన్నారు డి.ఎస్.పి.గారు.

"సార్! మీసాలు పెంచుకుంటే అలవెన్స్ ఇస్తామని గవర్నమెంటు హామీ కూడా ఇచ్చింది..." అందామనుకున్నాడు. కాని నోరుపెగల్లేదు వీరయ్యకి.

సెంట్రీగా మళ్ళీ యథాస్థానానికి వచ్చి నిలబడ్డాడే కానీ అతని మనసు మనసులో లేదు. అతని తలనిండా విపరీతమైన ఆందోళనా, ఆవేశాలతో నిండిపోవడం వల్ల కళ్ళల్లో నీళ్ళు సుడులు తిరుగుతున్నాయి. తను ఏ మీసాలనయితే ఎంతో ఇష్టంగా తన ఆరోప్రాణంగా భావిస్తూ వచ్చాడో, ఏ మీసాలతో తను ఎందరి మెప్పును

సంపాదించగలిగాడో, అదే మీసాల వల్ల ఈ రోజు డీ.ఎస్.పీ దొరతో చీవాట్లు! మనసంతా వికలమైపోతోంది వీరయ్యకు.

మూడు గంటలకల్లా వీరయ్య సెంట్రీ దిగడం, డీ.ఎస్.పీ గారు వెళ్ళిపోవడం వరసగా జరిగాయి.

తక్కిన కానిస్టేబుళ్ళంతా తనమీసాల గురించి విపరీతమైన సానుభూతి చూపిస్తుంటే భరించలేక బజార్లోకి వెళ్ళిపోయాడు వీరయ్య. అతని మెదడంతా మొద్దుబారినట్టయింది. బస్సుస్టాండులోని ఓ మారుమూల కాకా హోటల్లో కాఫీ తాగేసి, సిగరెట్టు వెలిగించాడు. సిగరెట్టు కూడా రుచించడం లేదు. సగం సిగరెట్టు విసుగ్గా దూరంగా విసిరేశాడు.

"ఇక్కడుండావా? రా రా నిన్ను సి. ఐ. పిలుస్తున్నాడు" అంటూ తన పక్కనే వచ్చి కూర్చున్నాడు రమణ.

రమణకీ, వీరయ్యకీ మంచి స్నేహముంది. వారి స్నేహం ఇప్పటిది కాదు - పోలీసు డిపార్టుమెంటులోకి రిజర్వుడు కానిస్టేబుళ్ళుగా సెలక్షను అయినప్పటిది.

"ఎందుకురా?" అన్నాడు వీరయ్య.

"పెద్దాఫీసర్లు నాకు చెప్తారా అన్నీ!" అన్నాడు రమణ నవ్వుతూ.

రమణతో పాటు నడవసాగాడు వీరయ్య, డీ.ఎస్.పీ. దొర తన మీసాల విషయంలో అన్న మాటలన్నీ చెప్పాడు. అలా చెబుతున్నప్పుడు వీరయ్య గొంతు బొంగురు పోవడం రమణ గమనించకపోలేదు.

"చూడరా వీరా! నువ్వూ, నేనూ మహారాజుబిడ్డలం కాము. కడుపు కోసం దీంట్లో చేరాము. కానీలేరా, మన ఆఫీసర్లే గదా మనల్ని అంటూ ఉండేది... బాధపడొద్దు" అంటూ ఓదార్చాడు రమణ.

సి.ఐ.(సర్కిల్ ఇన్‌స్పెక్టర్) గారి ఆఫీసులోకి అడుగుపెట్టాడు వీరయ్య. రమణ బయటే ఉండిపోయాడు.

ఎదురుగా ఉన్న కుర్చీలో సి.ఐ. కూచుని ఉన్నాడు.

సెల్యూట్ చేశాడు వీరయ్య.

తిరిగి దండం పెట్టలేని దేవుడిలా వీరయ్యనే చూస్తున్నారు సి.ఐ.గారు.

"ఇదో ఫోర్ సిక్స్‌టీన్! నీ మీద కంప్లయింట్ చేశారు డీ.ఎస్.పీగారు. రేపటి కల్లా నీ మీసాలు తీసెయ్యాలి. తెల్సిందా? నువ్వు తీసుయ్యకపోతే నేను అసమర్థుడినైనట్లే లెక్క. నేను సి.ఐ.ని అయినా నా మీసాలు చూడవయ్యా ఎట్లా ఉన్నాయో! దారప్పోగుల్లా ఉన్నాయి. ఇలా వుండాలి మీసాలంటే. డీ.ఎస్.పీ దొరకి ఇలాంటి మీసాలే కదా.... ఏం అర్థమవుతోందా?" అన్నారు సి.ఐ. గారు.

"సార్! పదేళ్ళ కిందట నా మీసాల్ని చూసే అప్పటి ఎస్.పి. దొరగారు పోలీసు ఫండ్‌లోంచి రెండు వేలు బహుమతితో పాడి గేదెను కొనిచ్చారు సార్!" అన్నాడు వీరయ్య అవేశాన్ని కనబరచకుండా ఉండేందుకు ప్రయత్నిస్తూ.

"ఒక్కో ఆఫీసరు ఒక్కో రకమయ్యా. అయనకి అలా మీసాలుండడం ఇష్టం! ఈయనకి మీసాలు ఉండడం ఇష్టం లేదు. ఇప్పుడేమంటావు? మీసాలు తీసెయ్యవా? ఆ ఎస్.పీ.గారు నీకు బహుమతి ఇస్తే ఈ డీ.ఎస్.పీ.గారు కనీసం రెండు ఇంక్రిమెంట్లు కట్ చేస్తారు. ఇంక నీ ఇష్టం..."

"అది కాదు,సార్! మీసాలు పెంచుకుంటే ప్రత్యేక అలవెన్సు ఇవ్వాలని చట్టం చేస్తోంది కదా గవర్నమెంటు.."అంటూ గొణిగాడు వీరయ్య.

"ఆ చట్టం అమల్లోకి రాలేదుగా! ఇన్ని మాటలెందు గ్గానీ.. డీ.ఎస్.పీ. దొరగారికి ఇష్టంలేని మీసాలు తీసెయ్యి... ఎస్. యూకెన్ గో!" అనేసి తల వంచేసుకుని ఏదో రాసుకుంటూ ఉండిపోయారు సి.ఐ.గారు.



ఉదయం అద్దం ముందు నిలుచుని తన మీసాల్ని చూసుకుంటూ సుతారంగా దువ్వుకుంటూ ఉంటే వీరయ్య మనసు గుబులు గుబులుగా ఉంది. ఓసారి తల పంకించి సైకిలు మీద బయల్దేరాడు డ్యూటీకి. దార్లోనే ఉంది సి.ఐ.గారి ఆఫీసు. అక్కడి కొచ్చేటప్పటికి ఆఫీసు బయటే ఉన్నారు సి.ఐ.గారు. టక్కున సైకిలు దిగి సెల్యూట్ చేశాడు వీరయ్య.

"ఏం.....ఇంకా తీసెయ్యలేదు మీసాలు...ఇంక్రిమెంట్లు కట్ చేయాలా?" అన్నారు సి.ఐ.గారు కాస్త కఠినంగానే.

క్రితం రాత్రి తన భార్య ఇచ్చిన ధైర్యంతో అన్నాడు వీరయ్య – "తమరి చిత్తం సార్! ఇంక్రిమెంటు వదులుకోడానికి సిద్ధపడ్డాను."

వీరయ్య కంఠంలో స్థిరత్వం చూసి కంగుతిన్నారు సి.ఐ.గారు.

వెళ్ళొస్తాను సార్!" అని చెప్పేసి ఆనందంగా స్టేషను వైపు దారి తీశాడు వీరయ్య.

(ఆంధ్రప్రభ వీక్లీ - 13 జనవరి, 1993)

# మంత్రి వెడలె

"నిప్పులు మింగటం ఎవరూ చూసి ఉండరు... నువ్వు చూసేవురా? మరి నువ్వో..' అంటూ సీరియస్‌గా మొహం పెట్టి అడిగేడు రాజేష్‌గాడు - నన్నూ, నా పక్కనున్న చలపతిగాడినీ.

రాజేష్‌గాడి ప్రత్యేకతేమిటంటే ఎంత చెత్త విషయాన్నయినా సరే, ఆసక్తి కలిగించేటట్టు చెప్పగలగటం - వాళ్ళ ఆఫీసు బిల్ల బంట్రోతు విషయం మొదలుకునీ అమెరికా ప్రెసిడెంటు బిల్‌క్లింటన్ వరకూ ఎదుటి మనిషి ఉత్కంఠతో వినేట్టు చెప్పగల చతురుడు వాడు. రెవిన్యూ డిపార్టుమెంటులో కాకుండా, వాడు ఏ సినిమా డైరెక్టరుగానో, ఆక్టరుగానో, చేరి వుంటే తెలుగుకి 'ఆస్కారు' వచ్చే అవకాశం ఎప్పుడో దక్కి వుండేదని నాకు గట్టి నమ్మకం!

అప్పటికి అర్ధరాత్రి మీరుతున్నా, నిద్ర తాలూకు బొంగురుతనం వాడి గొంతులో లేదు. రైల్వే సెకెండుక్లాసు వెయింటింగ్ రూమ్‌లో వాడి గొంతు

వాడి ప్రశ్నకు సమాధానంగా - "నిప్పులు మింగటం" చూడలేదంటూ బుద్ధిగా తలలూపాము.

సిగరెట్టు వెలిగించుకుని, పొగని విలాసంగా గాల్లోకి ఊదేడు రాజేష్‌గాడు. మాతో పాటూ తిరుపతి రైలెక్కాల్సిన ప్రయాణీకులు - రైలు ఒకటిన్నర గంటలు ఆలస్యంగా వస్తుదని తెలియటంతో దిక్కు తోచక ప్లాట్ ఫాం మీద అటూ ఇటూ తిరుగుతున్నారు.

"చూసి ఉండర్రా! అయితే నేను చూసేను - ఆపుమా! మా ఆఫీసరు ఖచ్చితంగా ముప్పూటా అన్నానికి బదులు నిప్పులే మింగుతుంటాడురా! నిజంరా! అందుకే మాట్లాడితే అగ్గి కురిపిస్తాడు. చూస్తే నిప్పులు చెరుగుతాడు. నడిస్తే నిప్పుల మీద నడకలా బిరబిరా నడుస్తాడు. ఇక కూచున్నాడా? నిప్పులు పొదిగిన కుర్చీలో కూచున్నట్టే అసహనంగా కదులుతూ ఉంటాడు. ఇక అతగాడి మొహం ఉంటుంది చూసేవూ? అట్లపెనం ఎలా ఉంటుందీ? అలా నల్లగా కమిలిపోయి ఉంటుంది. అతను త్రేతాయుగంలో పుట్టుంటే వాల్మీకి రావణాసురుడిని కీర్తిమంతుణ్ణి చేసేలా రామాయణాన్ని రాసి ఉందును. ద్వాపరయుగంలో పుట్టుంటేనా కంస కీచకాదుల్ని సద్గుణ సంపన్నులుగా చిత్రించి ఉండేవాడు వ్యాసమహర్షి. ఏం చేద్దాం, ఈ కిరాతకుడు కలియుగంలో పుట్టి, ఏ రైటరుకి దొరక్కుండా మా డిపార్టుమెంటులో ఎమ్మార్వోగా అనామకంగా బతికేస్తున్నాడు...." అంటూ వాడు ఇంకా చెబుతోన్నట్టే -

"అయితే మరింకేంరా! నువ్వే కలియుగ వాల్మీకో, వ్యాసుడో అయిపోరాదూ!"

సజెస్ట్ చేసేను, నవ్వుతూ. ఈడ్చి తన మొహమ్మీద కరాటే దెబ్బకొట్టిన వాడినయినా నవ్వుతూ క్షమించేయగలడేమో వాడు, అయితే వాడు ఏదన్నా సీరియస్‌గా చెబుతున్నప్పుడు మాటలకి అంతరాయాన్ని కల్గిస్తే మాత్రం క్షమించడు! అయినా వాడిప్పుడు నన్నేం అనలేదు. ప్రస్తుతం తిరుపతి వెంకన్న కొండకు కలిసి వెళుతున్నా... కాబట్టి మా వాళ్ళకి ఐదు రోజుల తర్వాత 'అయిదో దినం' చేసుకునే పని తప్పింది.

"అది సరేగానొరే!..నా అనుమానం ఏమిటంటే మా ఆఫీసర్ని ఆ బ్రహ్మదేవుడు మనల్ని సృష్టించినట్టు యధాలాపంగా సృష్టించి ఉండడ్రా! సరస్వతీదేవితో బాగా తగూపడినప్పుడు సృష్టించి ఉంటాడు. అందుకే ఆ మొహంలో ఆ నలుపూ, ఆ విసుగూనూ."

"మరి....అట్లాంటి వాడితో ఎట్లా వేగుతున్నా...?" అంటూ చలపతిగాడు అడుగుతూన్నట్టే...

"అడ్డు రాకొరే చలపతిగా! నీ పీక పిసికేసి వెంటనే రైలెక్కిపోగల్ను!" అంటూ సీరియస్‌గానే చలపతి వేపు సిగరెట్టు పెట్టెనీ, అగ్గిపెట్టెనీ నెట్టాడు. "తాగి చావు - అడ్డు ప్రశ్నలేయకు!" అన్న లెవల్లో.

"అట్లాంటి మా ఆఫీసరు దగ్గర పనిచేయడమన్నది మాటలుగాదు - కత్తిమీద సామే!" అంటూ ప్రోలోగ్ ముగించీ అసలు కథలోకి ఎంటరవడానికన్నట్టు సిగరెట్టును గట్టిగా పీల్చి ఫోర్సుగా పొగని గాల్లోకి ఊది, మళ్ళీ చెప్పడం మొదలుపెట్టేడు రాజేష్‌గాడు.

"ఆవేళ మంత్రిగారు వస్తున్నార్రా! కొత్తగా కట్టిన ఆస్పత్రి భవనాన్ని ప్రారంభించేందుకు! అసలే హడావిడి బతుకులు మావి...ఇక మంత్రి గారొస్తున్నారంటే ఇంకెంత హడావిడీ వుంటుందో చెప్పు...అందులోనూ దుర్వాసుడికి బ్రదరయిన మా ఆఫీసరుతో ఇంకెలా ఉంటుందో ఊహించుకోండి....ఆ ఉదయంనుంచీ నా వంట్లో వణుకే. మొత్తంమీద నిలువెల్లా వణుకు ప్రారంభమయింది. మంత్రిగారు వస్తున్నందుకు కాదూ....ఆ వస్తున్న మంత్రిగారికేమాత్రం లోపం జరిగినా ఎన్ని ఈటెల్లాంటి మాటలు, ఎన్నిచూపుల తూపులు నా గుండెల్లో దిగుతాయోననే భయం వల్ల!

మా ఆవిడ ప్రేమతో టిఫిన్ చేయమని అరడజను దోశలు పెట్టింది.... మామూలు రోజుల్లో అయితే డజను లాగించేవాడిని. అప్పుడు అరడజను కాదు కదా అరదోశ కూడా దిగదు. అలాగు గొంతులోకి కూరుకుని మరీ బయల్దేరాను.

తీరా ఇంటి బయటికి వచ్చి నా 'ఓల్డు హార్సు' అదేరా! నా స్పార్క్ మోపెడ్‌ని స్టార్ట్ చేయబోతే, ఊహూఁ స్టార్ట్ కాదే! తానెక్కిన పారని గుర్రాన్ని గ్రక్కున విడవమన్నాడు సుమతీ శతకకారుడు! అయితే నేనెవర్ని? విక్రమార్కుడి అంశంలో పుట్టిన వాడిని కదూ...దాన్ని వదలదలుచుకోలేదు. కళ్ళు మూసుకుని మా ఆఫీసరు అట్లపెనం మొహాన్ని నా మెదడు ఫలకంపై ఓసారి ప్రొజెక్టు చేసుకున్నాను. నాలో రక్త ప్రసరణ పెరిగింది. స్టార్టర్ని చాచి తన్నాను. అంతే - స్టార్టయింది. ఇక అది ట్రావెలర్స్ బంగళా చేరే వరకూ ఆగితే ఒట్టు!

మంత్రిగారి సపరివారం కోసం తయారు చేస్తున్న వంటకాలు ఘుమఘుమలు నా ముక్కుపుటాల్ని తాకి నోరూరిస్తున్నాయి. తలార్లూ, వెట్లూ కాంపౌండ్‌లో షామియానాలూ, కుర్చీలూ వేయడంలో నిమగ్నమై ఉన్నారు.

బంగళాలోంచి మా ఆఫీసరు గొంతు వినిపిస్తోంది. కిటికీలోంచి గదిలోకి తిరిగి చూసి స్థాణువు అయిపోయేను.

నిప్పులమీద నడుస్తూ "మయసభ" సీను ఏకపాత్రాభినయం చేస్తున్న దుర్యోధనుడిలా అటూ, ఇటూ గట్టిగానే గొణుగుతూ పచార్లు చేస్తున్నారు మా ఆఫీసరు.

"ఒక్కడు లేడు... స్టాఫంతా ఏమయ్యిందో తెలీదు...ఈ సూపర్నెంటుగాడొకడు మొప్పి ముండాకొడుకు..ఆఫీసంతా వాడి అజమాయిషీలో ఉందని పెద్ద ఫోజు.. యూజ్‌లెస్ ఫెలో...స్టాఫుతో పనిచేయించడం రాని దద్దమ్మ! ఈ ఆరై (రెవెన్యూ ఇన్‌స్పెక్టరు) గాడొకడు ఉడతలు పట్టేమొహం వీడూనూ! షర్టును నీటుగా ఇన్సర్ట్ చేసీ, కాళ్ళకి బూట్లూ, కళ్లకి గాగుల్సూ పెట్టి పిట్టల దొరలా ఉంటాడు. డబ్బులు ఎక్కడ దండుదామా - ఏ పార్టీతో ఎంత మొత్తం గుంజేద్దామా - ఏ డీలరు దగ్గర ఎంత వసూలు చేద్దామా అనే చూస్తూ ఉంటాడు! అరే - మంత్రిగారొస్తున్నారు ఇక రెండుగంటల్లో - జాగ్రత్తగా సౌకర్యాలూ అవీ చూద్దాం అన్న జ్ఞానం లేదు. ఈ ప్రోటోకాల్ డ్యూటీ అంటే ఏమనుకున్నాడో! పీకలకు వస్తాయి. మర్యాదల్లో ఏ మాత్రం లోపాలు జరిగాయా, ఇక్కడినుంచి కర్నాటక బోర్డరు మడకశిరకో, చిత్తూరు జిల్లా బార్డరు తనకల్లుకో వేస్తారు! థూథూ!! ఈ పనే పలికిమాలిన పని - ఈ స్టాఫుతో వేగడం కంటే ఏ కాశీలోనో, బదరీనాథ్‌లోనో సన్యాసుల్లో కలవడం నయం..."

ఆ ఒక్క పనీ ఆయన చేసి వుంటే మా ఆఫీసు స్టాఫంతా ఆంధ్రదేశంలో ఉన్న అన్ని గుళ్లల్లోనూ ఆకుపూజలు చేయించి, కొబ్బరికాయలు కొట్టి వుండేవాళ్లం. అంట్లాంటివి ఎప్పుడూ జరగవు కాబట్టే తెలుగువాళ్ళు పార్టీ నిరీశ్వరవాదులు అవుతూంటారు. సో...అసలు విషయానికి వద్దాం...మా ఆఫీసేరుగారు మయసభ సీనుని నిప్పుల మీద ఏకపాత్రాభినయం చేస్తున్నాడు. సరిగ్గా అప్పుడు కర్మకాలి తలారి ఓబులేషు దొడ్డి గుమ్మం తలుపు తీసుకుని లోపలికి వచ్చేడు.

సాలీడు వలలోకి పొరపాట్న వచ్చిన కీటకంలా కళ్ళు పెద్దవి చేసి నాలిక కొరుక్కుంటూ విధిలేక నడుముకు బిగించి ఉన్న టవల్ని తీసి తలకి గబ గబ యాంత్రికంగా చుట్టేసుకున్నాడు.

సాలీడు చూసింది కీటకాన్ని...టకటకా...అడుగులు వేస్తూ దగ్గరికెళ్ళింది. కీటకం కనుగుడ్లు వెళ్ళబెట్టి,బిత్తరి చూపులతో వినయంగా - "నన్ను నములుకు తింటావా? - ఒక్కో అవయవాన్నే ఉడబెరుక్కు తింటావా? లేదా ఒక్కసారి నన్ను అమాంతం గుటుక్కున మింగేస్తావా? నీ ఇష్టం నా కర్మ కాలిపోయి ఇటొచ్చేను!" అన్నట్టు చేతులు కట్టుకుని అతి వినయంగా నిలబడిపోయింది కీటకం.

"ఇంతసేపూ ఎక్కడ చచ్చావురా!" అంది సాలీడు గుడ్లురుముతూ.

"నేనా దేవరా.. బం...బంగ్లా ఎనకల రెడ్డితో మా..మాట్లాడ్తూ ఉంటిని దేవరా!" కీటకం గొంతు వణుకుతూ తడబడుతోంది.

సాలీడుకి అసలే బీ.పీ., రక్తప్రసరణ హెచ్చింది.....

"ఇంకా ఎక్కడున్నార్రా రెడ్లూ! రెడ్లనీ, కరణాల్నీ రామారావు గవర్నమెంటు 1983లోనే రద్దు చేసింది కదరా! ఇంకా రెడ్డంట రెడ్డి!" అసహనంతో సాలీడు మండిపడింది.

రెడ్డంటే మునసబు రెడ్డి కాదు దేవరా! ఈ...ఈ బంగ్లా వాచ్‌మేన్ అం.. అంజిన రెడ్డి దేవరా!" అంది కీటకం.

"ఆ! సర్లే - తాగడానికి మంచి నీళ్ళురా...పో!" అంటూ కేకపెట్టింది సాలీడు.

ఎంతకీ కదలదే కీటకం!

సాలీడు వలలో కాళ్ళు చిక్కుకుపోయాయేమో!

"ఇంకా నిలబడి చచ్చావేం రా! నీళ్లు రా! తాగడానికి మంచినీళ్ళురా! ఎక్కడ దొరికార్రా! నా ప్రాణానికి ఛీఛీచీ ....ఈ మొప్పి ముండా కొడుకులతో వేగలేక ఛస్తున్నా! పోరా ముందు మంచినీళ్ళు తెచ్చి ఛావూ!" అంటూ రక్త ప్రసరణ మరింత పెంచుకుని అరిచింది సాలీడు.

కీటకం బెరుకు బెరుకుగా చూస్తూ - భయ భయంగా అడుగులేస్తూ నా పక్కనుంచి వెళ్ళిపోయింది. ఇక నేను సాలీడు వలలోకి అడుగుపెట్టేనా ఇక అంతే- వేయించిన వడియాన్ని నమిలినట్టు కరకరమని నమిలి మింగేయగలదు. అందుకే వెనక్కి తిరిగి బ్రతుకు జీవుడా అని అడుగువేస్తున్నట్టే -

"ఎవరదీ - రాజేషా? ఏమయ్యా రాజేష్!" నా కర్ణభేరి పగిలిపోయేలా వెనుక నుంచీ ఉరుము!

"కలడందురు దీనుల ఎడ... కలడందురు పరమయోగి గణముల పాలన్...' అంటూ పోతన పద్యాన్ని నెమరేసుకుంటూ తిరిగాను. నేను దీనుడినీ, పరమయోగినీ అవునా, కాదా అని ఆలోచించలేదా క్షణంలో. ఉరుము వెనుకే సాలీడు ప్రత్యక్షం!

"గుడ్మాణింగ్ సార్" అన్నాను అప్రయత్నంగా - నవ్వాలని ప్రయత్నించాను - అయితే నా పెదాలు కో ఆపరేట్ చేస్తేనా!

"ఆఁ ఏం గుడ్మార్నింగో - ఈ రోజు నాకు బేడ్ మార్నింగ్‌లా ఉంది! ఏమిటయ్యా ఇదీ? ఇదేం ఆఫీసనుకున్నావా? బంగాళా అనుకున్నావా? నువ్వు ఇక్కడ చెయ్యాల్సింది ప్రోటోకాల్ డ్యూటీ అని తెలుసా? టైమెంతయిందనుకున్నావ్. ఎనిమిది గంటలు.. ఇప్పుడొస్తే ఎలా? కొంచెమన్నా ఇంగితం ఉండాలయ్యా మనిషన్నాక! ఏదోలే ఈ ఆఫీసరుగాడొకడు పనికిమాలిన వెధవ - ఎప్పుడూ అరుస్తుంటాడు. వీడి మాటల్ని ఒకచెవితో విని మరొకచెవితో విడిచి పెట్టవచ్చులే అనుకున్నావు! అందుకే ఇప్పుడొచ్చావు. మరో రెండు గంటల్లో మంత్రిగారు సపరివారంగా ఇక్కడి కొస్తున్నారే - ఏదో పెళ్ళికో, పేరంటానికో వచ్చినట్టు ఇప్పుడొస్తే ఇక్కడ నీ డ్యూటీ నేను చేయాలా? అవును మరి! నువ్వు ఆఫీసరువీ, నేను అర్దెగాణ్ణీ!..." అంటూ సుప్రభాతం చదువుతోంది సాలీడు.

"నేను తెల్లారే ఇక్కడికి వచ్చానుసార్!" అబద్ధమాడేను "ప్రాణమాన విత్తభంగ మందు.." బొంకవచ్చునని పోతన వారు - అబద్ధాలు ఎప్పుడెప్పుడు ఆడాలో చక్కగా లిస్టు ఇచ్చేరు తెలుగువాళ్లకి. అందుకే యాంత్రింగానయినా అంత చక్కటి అబద్ధం ఆడగలిగేను.

అయినా అంత తేలిగ్గా నమ్మేస్తే సాలీడు ఆఫీసరెలా అవుతాడు?

"మరి ఇక్కడ ఎందుకు లేవు ఇందాకా?" అంటూ ఆరా తీయడం ప్రారంభించింది సాలీడు.

నేనేం తక్కువ తిన్నానా! "రైల్వే గెస్టు హౌస్‌లో కూడా మంత్రిగారి పరివారానికి ఆరేంజ్‌మెంట్సు ఉన్నాయి కద సార్! అక్కడికి వెళ్ళాను. ఇక్కడ వంటావార్పూ రెడీ చేయమనీ తెల్లారే వెళ్ళి చెప్పి మళ్ళీ ఇప్పుడొస్తున్నాను సార్!" అన్నాను తడబడకుండా.

సాలీడు మరేం మాట్లాడలేదు. సడన్‌గా ముఖ కవళికల్ని మార్చేసి కళ్ళు చిట్లిస్తూ- 'ముందు పనిచూసుకో పోరా! ఎందుకలా నిలుచున్నావ్?" అని అంటూ ఉంటే నాకు దిమ్మతిరిగిపోయింది.

ఎంత కోపమొస్తే మటుకూ నన్నీ సాలీడు 'రా' అంటూ సంబోధిస్తుందా? మరెప్పుడయినా అయుంటే ఆ సాలీడుని ఎంత వైవిధ్యంగా హత్య చేద్దామా అని ఆలోచించేవాడినే -

అయితే - సాలీడు దృష్టి నామీద కాదనీ, నా వెనకాల ఒక జీవి ఉన్నదనీ, దానిపైనే సదరు దృష్టి కేంద్రీకృతమైఉందని గ్రహించేక మనసు నెమ్మదించిన వాడినై తలతిప్పి చూసేను. ఆ జీవి ఎవరో కాదు - ఇందాకటి తలారి ఓబుళేసు ఉరఫ్ కీటకం.

"దే.... దేవరా! నీళ్ళ తెమ్మంటిరి కద దేవరా! తె....తెచ్చినాను దేవరా!" గాజుగ్లాసుతో సవినయంగా మనవి చేసుకుంది కీటకం.

"నీళ్ళా? మరి ఆ కూత ముందుగా కూయలేకపోయేవా?" అంటూ కీటకం చేతుల్లోంచి విసురుగా లాక్కుని గుటగుటా తాగేసి ఖాళీగ్లాసుని ఇచ్చేస్తూ... "ముందు వెళ్ళు ఇక్కణ్ణించి! పని చూసుకో.. ఆ షామియానా సరిగ్గా వేయించు!" అంటూ గదిమింది సాలీడు. "బతికి యుండిన సుఖములు బడయవచ్చు!" అనుకుందేమో కీటకం - ఉరుకుల పరుగుల మీద చల్లగా జారుకుంది.

"ఇద్దో రాజేష్! ఇటు చూడూ...మంత్రిగారి పిఏ నుంచీ ఇంతకుముందే ఫోను వచ్చింది. మంత్రిగారి వియ్యంకుడు కూడా వస్తున్నాట్ట. - ఆయనకి మటన్ కరీలోకి అలచంద వడలు ఉండి తీరాలట! ఊ...ఆ తర్వాత పి.ఏ.కి లివర్‌ఫ్రైలోకి చపాతీలే కావాలట! ఇక మంత్రిగారి భార్య...ఛఛ...సతీమణిగారికి చేపలకూరలోకి జొన్న రొట్టెలే ఉండాలట! ఆవిడగారికి జొన్నరొట్టెలంటే ప్రాణమట. ఏం చేస్తావో ఏమో మరి! నాకు తెలీదు.. అందరికీ అన్నీ అయిటమ్స్ ఉండితీరాలి! ఎవరికీ ఏవీ తక్కువ కాకూడదు!" అంటూ వరండాలోకి వెళ్ళి టెలిఫోన్ ఉన్న టేబుల్ వద్ద కుర్చీలో కూచుంది సాలీడు.

నాకు అరికాలీనుంచీ నడనెత్తి వరకూ ఏకబిగిన మండింది. ఇన్ని గొంతెమ్మ కోరికలు కోరితే ఎలా? ఏదో అలచంద వడల్ని ఏ కొట్టం హోటల్లోంచో ఇరవయి

రూపాయలవి తెప్పించవచ్చు. ఇక లివర్ ఫ్రయ్యీ, చేపలకూరా కాకా హోటల్నించి ఎంతో ఒకింత తెప్పించవచ్చు. ఈ జొన్నెరొట్టెల్ని ఎక్కడనుంచీ తెప్పించడం! ఈ డిపార్టుమెంటులో చేరకముందే మలయాళ మంత్రాలేవో నేర్చుకుని ఉంటే భావుణ్ణు! 'హాంఫట్ అంటూ కోరినదల్లా గాల్లోంచి సృష్టించి ఉందును. దరిద్రపు చదువు - తెలుగు ఎం.ఏ. చదువుకున్నాను. ఎందుకూ? అని చింతిస్తూ తలారి ఓబుళేసుని కేకేసి పిలిచి "నువ్వు అర్జెంటుగా మీ ఇంటికెళ్ళి ఐదో, ఆరో జొన్న రొట్టెల్ని చేయించి తీసుకు రావాలి" అని చెప్పేను. వాడు తలగోక్కుంటూ కదల్లేదు. తనపెళ్ళాం పుట్టింటి కెళ్ళిందని చెప్పాడు. మరి తరుణోపాయం ఏమటీ!" "శరే, చద్ది జొన్నరొట్టె లున్నాయా? పోనీ!" అన్నాను. ఉన్నాయన్నాడు. "మరింకేం! వాటినే పొయ్యి మీద వేడిచేసి పట్రా!" అని చెప్పేసి, ఇంకా తేవాల్సిన ఐటెమ్స్కి డబ్బులిచ్చి పంపేను.

★ ★ ★

మరో అరగంటలో మంత్రిగారొస్తున్నట్టు ఫోన్లో సమాచారం అందింది. మా విసుగు రాముడు ఉరఫ్ సాలీదు అలియాస్ ఆఫీసరు నిప్పులమీద మయసభ సీను ఏకపాత్రాభినయాన్ని కొనసాగిస్తున్నాడు - గదిలో. తనలోని టెన్షన్నంతా నాలోకి ఇంజెక్ట్ చేయడమే మావిసుగురాముడిలోని గొప్ప కళానైపుణ్యం! దీన్ని అరవై అయిదో కళగా ఇప్పటికైనా ఆంధ్రదేశంలోని విశ్వవిద్యాలయాలు గుర్తిస్తే బావుణ్ణు!!!

ఉన్నట్టుండి కాంపౌండు బయట నినాదాల హోరుతో నిండిపోయింది. ఏం ప్రమాదం ముంచుకొచ్చిందా అని చూద్దుము కదా! దాదాపు రెండొందలమంది గుంపుగా పోగయివున్నారు. వాళ్ళ చేతుల్లో స్లోగన్స్తో నిండి వున్న అట్టలు వున్నాయి!

"ఎస్.ఐ. పాపారావు జిందాబాద్!"

"అధికారపార్టీ జులుం నశించాలీ!"

"అఖిల పక్షం వర్ధిల్లాలీ!"

"ఎస్.ఐ. పాపారావుని తిరిగి ఈ ఊరికి బదిలీ చేయాలీ!"

"వద్దురా!వద్దురా! అధికార పార్టీ జులుం వద్దురా!"

"ముద్దురా! ముద్దురా! ఎస్.ఐ. పాపారావే ముద్దురా!"

"హద్దురా! హద్దురా! అధికారపార్టీ అవినీతికిదే హద్దురా!"

ఇలా సాగుతున్నాయి నినాదాలు!

మా "విసుగురాముదు' మయసభ సీను చాలించి వచ్చేదు. "ఏంటండీ! ఆ గలాటా ఏంటీ? మ్యానర్ లెస్ బ్రూట్స్! ఇంకాసేపట్లో మంత్రిగారొస్తున్నారు - ఇలా గలాటా చేయడం ఏమన్నా బావుందా? వాళ్ళెందుకట్లా చెవికోసిన మేకల్లా అరుస్తున్నారో వెళ్ళి కనుక్కుని రా పో!" అంటూ హుకూం జారీ చేసేసి, మళ్ళీ నిప్పుల మీద మయసభ ప్రాక్టీసు చేయడానికేమో గదిలో కెళ్ళాదు.

అధికార పార్టీ ఎమ్మెల్యేగారికి కోపం వచ్చి తన పలుకుబడితో ఎక్కడో దూర ప్రాంతాలకి ఎస్.ఐ. పాపారావుని బదిలీ చేయించాడట. అందువల్ల తక్కిన రాజకీయ

పార్టీలన్నీ 'అఖిలపక్షం' గా తయారయి మంత్రిగారి ఎదుట తమ నిరసన తెలపాలని వచ్చేయిట!

ఆ విషయమే మా విసుగు రాముడికి తెలియజేసేను. ఎక్కడన్నా ఎస్.ఐలు ట్రాన్స్‌ఫరయితే నినాదాలు చేస్తారేమయ్యా! ఏ ఎస్.ఐ. అయినా తన్నడం కేసుపెట్టడమేగా చేసేది! ఏ రాయి అయితేనేం పళ్ళు ఊడగొట్టుకోడానికి! ఈ కొత్త ఎస్.ఐ. కూడా తంతాడు, కేసులు పెడతాడు, ట్రాన్స్‌ఫరవుతాడు. ఈ మాత్రానికే నిరసనలు తెలిపేదేనా! ఎప్పుడన్నా మంత్రిగారు – రానీ ఇదే తలనొప్పండీ, నినాదాలు చేయడం! నిరసనలు తెలుపడం! వీళ్ళని ఆ భగవంతుడు కూడా బాగు చేయలేదు!" అంటూ ఆ అఖిలపక్షం నిరసనకు నేనే బాధ్యుడినైనట్టు మండి పడ్డాడు విసుగురాముడు. నిలువు గుడ్లేసుకుని వింటున్నాను.

"మంత్రి గారొచ్చాకనే అరవమని చెప్పవయ్యా! ఇదేం గోలండీ కాకి గోల! ఛఛఛఛ..నా చేతకాదురా భగవంతుడా!" అంటూ అపసోపాలు పడుతున్నాడు విసుగురాముడు.

బంగళాకి ఫోన్ మీద ఫోన్‌లు వస్తున్నాయి.

"మంత్రిగారు ఎప్పుడొస్తున్నారు? ఎన్నిగంటలకి? ఎన్ని నిమిషాలకి? మంత్రిగారు ముందు ఆస్పత్రి ప్రారంభోత్సవం చేస్తారా? లేక మీటింగులో పాల్గొంటారా?" అంటూ...

విసుగురాముడు మొహాన్ని ధుమ ధుమ లాడిస్తూనే సమాధానాలు చెబుతున్నాడు.

మంత్రిగారు రావల్సిన సమయం ఆసన్నమైంది.

"టాపులేని జీపు రెడీ అయ్యిందో?" అనడిగేడు విసుగురాముడు నన్ను.

అయ్యిందని తెలిపాను.

బయట కారు శబ్దం అవుతున్నట్టే అఖిలపక్షం వాళ్ళు నినాదాలు పెద్దపెట్టున చేయడం మొదలుపెట్టేరు.

కొంపదీసి మంత్రిగారి కారేమోనని దడదడ లాడుతోన్న గుండెలతో వరండాలోకి వచ్చేను. తీరా చూస్తే అది దొరకారు!

"దొరా! తెల్లదొరా?!?" అడిగాడు చలపతిగాడు. రాజేష్‌గాడి కథనానికి అడ్డు తగులుతూ.

ఒరే....వీడెవడ్రా – సందేహాల్రావు! ఎక్కడ దొరికావురా నాకు! తెల్ల దొరలు ఇంకెక్కడున్నార్రా వెధవా? 1947ఆగస్టు 15కు ఆ తెల్లదొరలు వెళ్ళిపోయారు కదరా! వాళ్ళు పోతూ పోతూ మన నల్ల దొరలకి అధికారం అప్పగించి వెళ్ళారు! వాళ్ళ రాజ్యాంగాన్నీ ఎంతో వినయవిధేయతలతో మనదేశం సొంతం చేసుకుని నెత్తిమీద పెట్టేసుకుందా? అయితే మన డిపార్టుమెంటు మాత్రం ఇంగ్లీషుతో పాటూ వాళ్ళు నేర్పిన కట్టుబానిస లక్షణాన్ని కూడా తన సొంతం చేసుకుంది! అందుకేనోయ్ పై అధికారులంతా మాకు దొరలే తెలుసా?" అన్నాడు రాజేష్‌గాడు.

"ఆc, ఎంతవరకూ చెప్పేనూ... ఊc దొరగారు కారులోంచి దిగేరు, బంగాళాలో మేము నిన్నటినుంచీ వెలగబెట్టిన కార్యాల్నీ, వంటకాల్నీ పర్యవేక్షించేరు. అన్ని సవ్యంగా ఉన్నట్టు తృప్తి చెందేరు. "వెరీగూడ్... చాలా బావున్నాయి. ఏర్పాట్లన్నీ..." అని దొర అంటున్నట్టే ఫోన్ మోగడం ప్రారంభించింది. దొరగారే ఫోన్ ఎత్తేరు.

దొరగారు సిగరెట్టు కాలుస్తూ తాపీగా ఫోన్లో, "ఊహూc...అలాగా... సర్సరే.. ఓకే.. ఇట్సాల్ రైట్!" అంటూ తెలుగింగ్లీషుల్లో పొడి పొడి మాటలతో సమాధానాలు ఇస్తూ ఉన్నారు.

దొరగారు ఫోన్ పెట్టేసేరు వారు ఏం చెబుతారా? ఎపుడెపుడు చెప్పిందాన్ని శిరసావహించడమా అని ఆత్రంగా ఎదురు చూస్తున్నాడు విసుగురాముడు అతి వినయంగా.

"మిస్టర్ ఎమ్మార్వో!" నెమ్మదిగా అన్నారు దొరగారు.

"సర్?...చిత్తం సర్!"

విసుగు రాముడికి రెండు మొహాలుంటాయంటే ఎవరికీ నమ్మబుద్ధి కాదుకానీ... దొరముందు చూడాలి, ఆ రెండో మొహాన్నీ...బానిస లక్షణాన్ని పుణికి పుచ్చుకుని ఉన్న ఆ ముఖకవళికలూ, ఆయన నిలుచున్న తీరూ, కనువిందుగా ఉంటుంది నాకైతే.

దొరగారు సిగరెట్ దమ్ములాగి పొగని మాట్లాడుతూ వదులుతున్నారు–" "మంత్రిగారు రావడం లేదండీ! ఉభయగోదావరి జిల్లాల్లో తుఫానువల్ల దెబ్బ తిన్న ప్రాంతాల్ని చూడ్డానికి వెళ్తున్నారట...సో, మంత్రిగారి ప్రోగ్రాం క్యాన్సిల్ అయినట్టే!" అన్నారు హుందాగా –

"చిత్తం సార్!"

దొరగారు సిగరెట్టు తాగుతూ ఏదో యోచిస్తూ ఉండిపోయేరు.

"సార్! ఇంతకష్టపడీ నలభైవేల రూపాయల ఖర్చుతో ఏర్పాటు చేసిన ఏర్పాట్లన్నీ వేస్టేనా" అంటూ సన్నగా గొణిగేను.

"చూడూ! మన డిపార్టుమెంటులో వేస్టంటూ ఏముందయ్యా! కాకుల్ని కొట్టీ గద్దలకేయడం మన నీతి.. ఆకలి దంచేస్తోంది... దొరగారికి డైనింగ్ హాల్లో వడ్డించండి! నాకు మాత్రం ఇక్కడికే తెమ్మని చెప్పు!" అంటూ గొణిగినట్టుగా విసుగురాముడు అన్నాడు. రెండు నిమిషాలు తరువాత దొరగారి దగ్గరికి వెళ్ళి భోజనాల విషయం ఆయన చెవిలో వేసేరు. దొరగారు సంతోషంగా లేచేరు.

అందాకా ఎక్కడ ఉన్నారో మా ఆఫీసు స్టాఫంతా వచ్చి వాలేరు భోజనానికి. దొరగారి సిబ్బంది కూడా భోజనానికి వచ్చేసింది. మంత్రిగారి సపరివారానికి వండిన వంటలన్నీ అరగంటలో మాయమయి పోయేయి. కలికానికి కూడా ఏవంటా మిగల్లేదు.

"అదృష్టమంటే అట్లా ఉండాల్రా! హాయిగా మీరయినా తిన్నారుగా" అన్నాడు చలపతిగాడు.

"రేయ్ చలపతిగా! పూర్తిగా వినకుండా మాట్లాడేవంటే -పుత్తూరుకు వెళ్ళినా ఫలితం లేకుండా ఉండేట్టు నీ ఎముకల్ని విరిచేసే గల్ను! అసలు కథ అపుడు మొదలయిందిరా! మేమంతా తృప్తిగా తిని బ్రేవ్‌మని త్రేంచనయినా లేదు. ఫోనొచ్చింది. ఏమనీ - మంత్రిగారు మనసు మార్చుకుని వచ్చేస్తున్నారు. మరో అరగంటలో బంగాళాలో భోంచేసుకునీ ఆస్పత్రి కొత్త భవనాన్ని ప్రారంభించేకే ఉభయ గోదావరి జిల్లాల్ని చూడటానికి వెళ్తున్నారు...అని ఇక అప్పుడుచూడూ మా తిప్పలు, ఆ దేవునికే తెలుసు!" అంటూ రాజేష్‌గాడు మా వైపు చూశాడు.

రైలుబండి వస్తోందని ఎవరో చెబుతోంటే ముగ్గురం పైకి లేచేం.

(ఆదివారం వార్త - 8 జూన్, 1997)

# కాలిముల్లు

భారతీయ శిక్షాస్మృతి అంటూ ఒకటి ఉంది కాబట్టి రామనాథం హాయిగా, ఠీవిగా తిరగ్గలుగుతున్నాడు. లేకుంటేనా నేనే ఏదో ఒ దుర్ముహూర్తం చూసుకుని ఓ వరస్టు ఈవినింగ్ అతనిలో విరగని ఎముకంటూ లేకుండా తన్ని తగలేసేవాడినేమో! అని ఎప్పుడూ అనిపిస్తూ ఉంటడం కానీ రామానాథం నాలో ఇంత కసీ ద్వేషం ఉంద ఊహించి ఉండదు. అందుకే తన ధోరణి కించిత్తుకూడా మార్చుకునే ప్రయత్నం చేసేవాడు కాదు.

అసలు రామనాథంమీద నేను పెంచుకుంటున్న కసిని చూసి అతను నాకు బద్ధ శత్రువేమోనని మీరు అనుకుంటే అది తప్పకుండా పప్పులో కాలు వేసినట్టే మరి! ఎందుచేతంటే అతను మాపొరుగువాడూ, మా కుటుంబమిత్రుడూనూ. అయితే, నానాటికీ అతనిమీద కసి అనండీ, ద్వేషం అనండీ, మరింకేదయినా అనండీ.... అలాంటివి ఏవైనా నాలో కలగడానికి కారణాలు రెండే రెండు, అతను చక్కటి లౌక్యుడు కావడం ఒకటీ, ఏ వస్తువునైనా కొనడంలో బేరసారాలు తెలిసినవాడు కావడం మరొకటీ!

అతనికి లౌక్యం తెలిసినా బేరసారాలు తెలిసినా నాకంటూ ఒరిగేదీ, తరిగేదీ ఏమీ లేదు. కాకపోతే సదరు లౌక్యం, బేరసారాలు ఎవరికీ తెలీనట్టు తరచూ అందరి ముందూ ప్రదర్శిస్తూ ఉంటాడు. అలాంటి ప్రదర్శనలకి బలి అయిపోతున్న వాళ్లలో నేనే మొదటివాడిని అని నా గట్టినమ్మకం. నిజం చెప్పాలంటే నాపెళ్లాం పిల్లల ముందు తల ఎత్తుకోలేనంతగా నన్ను ఫూల్‌ని చేయడం అతనికి అతి మామూలు అయిపోయింది.

ఎప్పుడయినా మార్కెట్టుకి వెళ్ళి ఏ ఉల్లిపాయలో అయిదు కిలోలు తెచ్చానే అనుకోండి.

అంతే!

రామనాథానికి ఎలా తెలుస్తుందో ఏమిటో గానీ వెంటనే పౌరాణిక సినిమాల్లో నారదుడిలా ప్రత్యక్షమౌతాడు మా ఇంటి ముంగిట్లో.

"ఏమప్పా! వెంకటేసులూ! ఉల్లిగడ్డలు ఎంతకి తెస్తివి?" అంటూ అడుగుతాడు.

"కిలో మూడు రూపాయలు రామనాథం!" అంటాను నేను లెక్కలమాష్టారి ప్రశ్నకు మొద్దబ్బాయి బెరుకు బెరుకుగా ఇచ్చిన సమాధానంలా ఉంటుంది నా పరిస్థితి.

"నీకీ జన్మకి లెక్కలు రావు వెధవా!" అన్న లెక్కలమాష్టారి ధోరణిలో చిత్రంగా నవ్వి వెంటనే ఫీలింగు మార్చేసి, జీవితంలో పూర్తిగా మోసపోయిన నిర్భాగ్యుణ్ణి

చూసినట్టు ఒక బలహీనమైన చూపు కళ్ల చివర్లలో సంధించి ఫకాల్న నవ్వేస్తూ రెట్టింపు గొంతుతో "ఎంతా? మూడు రూపాయలా కిలో?" అంటాడు రామనాథం.

"మరి మీరెంతకి తెస్తిరి రామనాధమన్నా!" అంటుంది మా ఆవిడ వంటింటిలో నించి. ఇక్కడికి ఎప్పుడు ఊడిందా అని నాకు ఒకటే ఆశ్చర్యం. అప్పుడు నా పరిస్థితి ఎలా ఉంటుందో చెప్పాల్సిన పనిలేదు.

"పెద్ద సైజు నారింజకాయంత ఉన్నాయమ్మా! ఉల్లిగడ్డలు కిలో రెండు రూపాయలకి పొద్దున్నే మార్కెట్టులో తెస్తి. ఇవి చూస్తే పిల్లోళ్ళు ఆడుకునే గోలీలంత ఉండాయి! మూడు రూపాయలంట కిలో. యాల అంతరేటుపెట్టి వచ్చెనో, ఈయప్ప! ఏందీ తెల్దు" అంటూ నావైపు చూసి మళ్ళీ ఫక్కున నవ్వేస్తాడు. అప్పుడు నేను మా ఆవిడ వైపు చూడను. ఎంచేతనంటే నాకు తెలుసు ఆవిడ చూపుల తూపులవాడి!

అట్లానే నిల్చున్నపాటున భూమి విచ్చుకుంటేనో, నేను అందులోకి కుంగిపోతేనో ఎంత బావుండును అనిపిస్తుంది.

అసలు చెప్పాలంటే రామనాథం కారణ జన్ముడనే నా అభిప్రాయం. అతను బేరం చేయడానికే పుట్టాడో, లేకుంటే రామనాథం బేరం చేసినపుడు అమ్మేవాళ్ళే అతని మాటలకి మెస్మరైజ్ అయిపోతారో నాకైతే ఎన్నటికీ అర్థంకాని విషయం. కాకపోతే అతనికి మాత్రమే తక్కువ ధరకి ఎందుకిస్తారు?

మా ఆవిడ ఎన్నాళ్ళగానో ఓ గోడగడియారం తెమ్మని పోరు పెడుతోంది. అలారం టైమ్‌పీసుతో సరిపెట్టుకోమని ఎంతో నచ్చచెప్పి చూశాను. ఊహూ! వినలేదు. పైగా గోడగడియారం ఇంటికి చాలా అందం అన్న పాయింటు లేవదీసింది. అది లేకున్న ఇల్లు ఇల్లేకాదంది. ముందరింటి ముకుందమ్మ, పక్కింటి పార్వతమ్మ, చివరింటి సుభద్రమ్మలకు గోడగడియారాలు ఉండడంవల్ల మనల్ని తక్కువగా అంచనా వేస్తారని భయపెట్టింది. దాంతో నేను ఆమె దారికి రాక

ఓ శుభోదయాన క్వార్జ్ గోడగడియారాన్ని తెగించేసి కొనేశాను. తెల్లటి గోడకి గులాబీ రంగు గడియారం ఎంత అంతంగా ఉందో చెప్పలేం! ఇక మా ఆవిడయితే మురిసిపోయింది. ఆ గడియారాన్ని తెచ్చినందుకు నన్ను ఒకటే పొగడ్డం మొదలు పెట్టింది. మా పిల్లలింక సరేసరి! ఆ గడియారాన్ని తయారుచేసినవాడే ఉంటే ఎంత పొంగిపోయేవాడో ఏమోగానీ నేను మాత్రం బాగా పొంగిపోయాను. అంతటితో ఊరుకోలేదు. మా శ్రీమతివైపు గర్వంగా చూస్తూ కాలరు ఎగరేసు కున్నానన్నది నిజం!

కాలరయితే ఎగరేసుకున్నానేగానీ ఆ రామనాథం ఏ క్షణంలోనైనా ఈ అనందాన్ని అపహరించుకుపోతాడనే దిగులు నా గుండెల్లో ముల్లులా పొడుస్తూనే ఉంది. అయినా నా గుండెని గుండ్రాయిలా మార్చేసుకుని ఈజీ ఛైర్లో కూచుని డైలీ పేపర్ని తిరగేస్తూ ఉన్నాను.

"ఇదేనా కొత్త గోడగడియారం?" అన్న మాటలు వినబడితే తలెత్తి చూశాను. ఇంకేముందీ! ఎదురుగా రామనాథం!!!

"ఆс..అవును ఇదే..." అన్నాను అదురుతోన్న గుండెలతో.

"చాలా బావుంది వెంకటేసులూ!" అని రామనాథం మెచ్చుకుంటూ ఉంటే నాకు మూర్ఛవచ్చినంత పనయ్యింది. అవును మరి, రామనాథమేమిటీ! మెచ్చుకోవడమేమిటీ! 'కలయా నిజమా, వైష్ణవ మాయయా? ఆకటా! ఏమి ఈ విధివైచిత్ర్యము' అని నా మనసు ఆనందంతో వంకర్లు తిరుగుతోంది.

"నిజంగానా రామనాథం?"

"యస్.... అయితే రేటు కొంచెం ఎక్కువప్పా!" అన్నాడు రామనాథం నాకళ్ళలోకి చూస్తూ.

అప్పుడు అరికాళ్ళించి మండకుండా ఉంటుందా నాకు? "రామనాథం! దాని రేటు ఎంతో నేను చెప్పలేదు. అప్పుడే నేను ఎక్కువ రేటు పెట్టినట్లు మాట్లాడేస్తున్నావు! నన్ను ఫూల్‌ని చేయడం నీకు బాగా అలవాటయింది" అన్నాను కొంచెం కరుగ్గానే.

"కొంచెం తగ్గవయ్యా! నీ గడియారం వెల నూటయాభై రూపాయలు కదా!" అన్నాడతను. ముసిముసి నవ్వులు రువ్వుతూ, గారడీవాడిలా ఫోజుపెట్టి.

'భగవాన్! ఎదుటి మనిషి మనసులో మాట తెలుసుకునే ఏ టెలీపతీనో ప్రాక్టీసు చేయడం లేదు కదా!, అదే జరిగితే ఈ ప్రపంచంలో నాలాగా ఇంకెందరు నిర్భాగ్యులో తమ ఆస్తుల్ని కోల్పోక తప్పదు కదా!' అని భయం వేసి వెన్నులో సన్నని వణుకు ప్రారంభమయింది.

"నీకెట్ల తెలుసు దాని రేటు?" అన్నాను భయం భయంగా. "అప్పుడే ఆశ్చర్యపోతే ఎట్లప్పా! ఇంకా చెప్పాలా? ఆ గడియారం అసలు రేటు నూటా అరవై రూపాయలు అని షాపువాడు నీకు రేటు చెప్పినాడు. నువ్వు చాలాసేపు బేరమాడీ ఆడీ పదిరూపాయలు తగ్గించి నూటయాభైకి రేటు తెంచేసి తెచ్చినావు. ఆ పదిరూపాయలు తగ్గించినందుకే తెగ మురిసిపోతా వున్నావు! అవునా?" ముప్పయి రెండుపళ్ళూ కనిపించేలా నవ్వేస్తూ అన్నాడు.

అమ్మ రామనాథం! అసాధ్యుడిలా ఉన్నాడే. నేనుఎట్లా బేరమాడిందీ చెప్పేస్తున్నాడు. ఏం చేసేది? ఒప్పుకోక తప్పిందికాదు.

"అది సరేగానీ... ఇవన్నీ నీ కెట్ల తెలిసినాయి?" అన్నాను.

అతను బాలనాగమ్మని చూసిన మాయల మరాఠీలా నవ్వి, టీపాయిమీద ఉన్న సిగరెట్టు పాకెట్టులోంచి ఓ సిగరెట్టుని తీసుకుని నింపాదిగా వెలిగించుకుని, పొగని గుండెల దాకా పీల్చి, వాయిదాల పద్ధతిలో పొగని ముక్కులోంచి కాసేపూ, నోట్లోంచి కాసేపూ ఊది, నా వైపు చూసి ఓసారి కనుబొమ్మలు రెంటిని ఇంగ్లీషు హీరో లెవల్లో ఎగరేసి చెప్పడం ప్రారంభించాడు.

"నాకెట్ల తెలుసని గదా నీ ప్రశ్న? మా కొలీగ్ లేడూ మోహనరావు. అతనికి ఒక గోడ గడియారం కావాలంటే ఈ గడియారం కొన్న షాపుకే వెళ్ళినాం. అతనూ అచ్చం

ఇదే రకం గడియారాన్నే సెలక్ట్ చేసినాడు. ఆ షాపువాడు నువ్వు కూడా అచ్చం ఇలాంటి గడాయారాన్నే కొన్నట్టు చెప్పాడు. అయితే ఒక్క విషయం. నువ్వు ఆశ్చర్యపడిపోకూడదు. ఈ గడియారం అసలు ధర 110/- రూపాయలు. షాపువాడు లాభం ఆశించకుండా అసలు ధరకే ఇచ్చేసినాడు" అంటూ ఫకాల్మంటూ భేతాలుడిలా నవ్వాడు.

"నేను అప్పుడే అనుకొంటిని రామనాధమన్నా! ఈ మనిషి నూట యాభయి ఆ గడియారానికి పెట్టి తెచ్చినాడంటే కనీసం ముప్ఫయ్యో, నలభయ్యో మోసపోయి వుంటాడనీ!" అంటూ నా వెనకనుండి మా ఆవిడగొంతు.

నలభయి కాదు వెయ్యిన్నీ నలభయి రూపాయలు మోసపోయినా నాకు ఎలాంటి బాధా కలగదు కానీ, మా ఆవిడ దృష్టిలో నేను పనికిమాలినవాడిని అవడం, అందులోనూ రామనాధం ముందు నిజంగా భరించరాని బాధ. నరకలోకంలో రంపాలతో కోయడం, సలసల కాగే నూనెలో వేయించడం ఇవన్నీ ఆ బాధ ముందు ఎందుకూ పనికిరానివి. వచ్చిన పని అయిపోగానే చక్కగా సిగరెట్టు తాగుతూ వెధవనవ్వు నామీద రువ్వి వెళ్ళిపోయాడు రామనాధం.

మా ఆవిడ ఆ గోడగడియారిన్ని చూస్తున్నప్పుడు నలభై రూపాయలు మోసపోయిన విషయం జ్ఞాపకం చేస్తున్నట్టు నాలో గిల్టీ ఫీలింగు తొంగి చూసేది.

'ఏదయినా వస్తువు కొందామా!' అన్నప్పుడల్లా "ఆ రామనాధం అన్నయ్యని తీసుకుపోండి!" అంటోంది మా ఆవిడ. అంతకన్నా నా వ్యక్తిత్వాన్ని దారుణంగా అవమానించుకోవడం మరొకటి ఉందా? నేను ఎన్నివేలు నష్టపోతే మటుకూ ఆ రామనాధాన్ని పిల్చుకుపోయి వస్తువులు కొంటానా? అందుకే ఓ వరెస్ట్ ఈవినింగ్ అతన్ని తన్ని తగలేయడం మాత్రం ఖాయం!

★ ★ ★

టేప్ రికార్డర్ కమ్ ట్రాన్సిస్టరు కొనాలని నా చిరకాల వాంఛ! ఇన్నాళ్ళూ డబ్బు ఇబ్బందితో కొనలేకపోయాను. ఈసారి నా సెలవుజీతం రావడంతో చిరకాల వాంఛకు ప్రాణం వచ్చింది. ఏదేమైనా సరే కొనేయాలనీ తీర్మానించుకున్నాను. తీరా కొన్నాక నన్ను నేను చిత్రహింసలు పెట్టుకోవలసిందేనేమో ఆ రామనాధం గాడి దయవల్ల!

నా అదృష్టమేమోగానీ రామనాధం ఊళ్ళోలేదన్న సంగతి ఆరోజు ఉదయమే తెలిసింది. దక్షిణ భారతంలోని పుణ్యక్షేత్రాలు చూడ్డానికి సకుటుంబంగా వెళ్ళిపోయారట!

"ఇది మంచి సమయము గదరా!" అని పాడుతూ నా మనసు ఆనందతాండవ మాడింది.

వెనుకాముందూ చూడకుండా ఓ మిత్రుడిదగ్గర ఉన్న టూ ఇన్ వన్ విదేశీ సెట్‌ని కొనేశాను. చాలా చక్కగా వుంది. దాన్ని కొన్నది పదహారు వందలకే అయినా ఆ రామనాధానికి పధ్నాలుగు వందలకి కొన్నట్లు చెప్పేయాలని నిర్ణయించుకున్నాను.

ఈ దెబ్బతో గురుడు ఖంగుతినడం ఖాయం! అతనలా ఖంగు తింటున్నప్పుడు మా ఆవిడ నా పక్కనే ఉండాలి. ఇది నా ఆశా, ఆశయమున్నూ.

ఒక వారంరోజు తర్వాత టూర్‌నుంచి రామనాధం వచ్చేశాడు. సాయంత్రం అయిదింటికల్లా మా ఇంట్లో వాలిపోయాడు. నేను ఈజీఛైర్‌లో కూచుని ఠీవిగా చూశాను. అతను నా ఎదురుగా ఉన్న కుర్చీలో కూచోగానే నేను టేబులుమీద వున్న టూ ఇన్ వన్ సెట్టును కావాలనే ఆన్ చేశాను. టేపులోంచి 'వయ్యారి గోదారమ్మా' అంటూ సినిమాపాట మొదలయింది. రామనాధం నోరు వెళ్ళబెట్టుకుని కళ్ళు పెళ్ళగించి చూస్తూ వుంటే నాకు ఒకటే గర్వం! ఇంక రేటు చెబితే నోరు ఊరువాకిలంత అవుతుందేమో, కళ్ళు ఊడి కిందకి టపీమని రాలిపడతాయేమో!

"ఎప్పుడు కొన్నావు?" అడిగాడు రామనాధం. నిద్రలో మాట్లాడుతున్నట్లు ఉంది అతని గొంతు.

"మొన్ననే..." అంటూనే మా ఆవిడని కేకేశాను. "ఇందూ! మీరామనాధం అన్నయ్య వచ్చినాడే. మంచి కాఫీ చేసి తీసుకురా!"

ఇంక ఎంతసేపూ.. రామనాధం 'ఖంగుతిను కాలము ఆసన్నమయినది కదా!" అని నా మనసు గొప్ప థ్రిల్‌గా ఫీలవుతోంది.

"ఎంతప్పా! వెంకటేసులూ!" యాంత్రికంగా నోరు మెదుపుతూ అడిగాడు రామనాధం.

"నువ్వు చెప్పుకో ౬ ాద్దాం!" అన్నాను నా మాటల్లో అతనికి కొంతయినా ఫోజు కనిపించి ఉండాలి.

"అట్ల కాదు. నువ్వు చెప్పల్ల ముందు!" అన్నాడతను.

అతనిలో నవ్వూ, సంతోషం మాయమైనట్టు అనిపిస్తోంది నాకు. రేటు చెప్పేసి అతన్ని ఖంగుతినేలా ఆశ్చర్యపరచాలని ఉబలాటపడుతోంది మనసు. నేను ఎంత తక్కువ రేటు చెప్పినా దానికి మరింత తక్కువరేటు చెప్పేసి తన ఆధిక్యతని ప్రకటించుకుంటే నా మానాలు ఏంగానూ? అందుకే నేను రేటు మాత్రం చెప్పదలుచు కోలేదు.

ఇందూ మా ఇద్దరికీ కాఫీలు అందించింది.

రామనాధం కాఫీ ఒక గుక్కతాగి "పదమూడు వందలకి కొనవచ్చు!" అన్నాడు నా కళ్ళల్లోకి పుల్కూ పుల్కూ చూస్తూ.

నాకు అరికాల్నించీ ఏకబిగిన మండసాగింది. "ఇద్దో రామానాధం! నన్ను ఫూల్ చేయాలనే బుద్ధి మనసులో పెట్టుకుని ఇట్ల తక్కువ చేసి మాట్లాడేది ఏం బాగాలేదు. నువ్వు గొప్ప తెలివిమంతుడువీ, లౌక్యం తెలిసినవాడివీ కావచ్చు. ఈసెట్టు పదమూడు వందలకే వస్తుందని చెప్పేదుందే ఉత్త అతిశయోక్తి!" అన్నాను కోపంగానే.

రామనాధం మొహంలో రవ్వంతయనా మార్పులేదు. "పోనీ, ఎంతకి కొన్నావో చెప్పనన్నా చెప్పు మరి?"అన్నాడు సన్నగా నవ్వుతూ.

అసలు ధర చెప్పబోయి తమాయించుకుని పద్నాలుగు వందలకి కొన్నట్లు అబద్ధపు ధర చెప్పేశాను.

అతను పకాపకా నవ్వి, "వెంకటేశులూ! నువ్వేమీ అనుకోనంటే ఒక్కమాట చెప్తాను. ఈ సెట్టు అసలు ధర 1200/- రూపాయలు. నువ్వు రెండువందలు అనవసరంగా పోగొట్టుకున్నావు."

మా ఆవిడ మా ఇద్దర్నీ గమనిస్తోంది.

"నేనేమీ అనుకోనుగానీ, నువ్వు దాని అసలు ధర ఎట్ల చెప్పగలుగుతున్నావో నాకు అర్థం కావడంలేదు" అన్నాను. చంపేయాలన్నత కోపాన్ని దిగమింగుకుని.

"ఇది నెలకిందట మా తమ్ముడు ఫారిన్ నుంచి తెచ్చినదే. కాబట్టి..టూర్‌కి వెళ్ళే ముందు ఆ పరమేశంగాడికి అమ్మేసిపోయాను లాభం ఆశించకుండా. ఒక్కమాట నాతో అని వుంటే నీకే అమ్మేవాడిని. పాపం..." అంటూ రామనాథం చెబుతూ ఉంటే నా గొంతులో పచ్చివెలక్కాయ ...మా ఆవిడకి నా మొహం చూపడమెలాగనీ.

(విపుల - డిసెంబరు, 1993)

# దొంగొచ్చాడు

"ఆ రోజు రాత్రి రాజు గారింటికి కన్నం వేశాడు. దొంగ..."అంటూ శ్యామల కథ చెబుతూ మంచంమీద నడుం వాల్చింది.

"దొంగ ఎలా వుంటాడమ్మా?" అనడిగింది నాలుగేళ్ళ చిట్టి - కళ్ళు చిట్లించి గదిపైకప్పు నుంచి వేలాడుతోన్న దీపం వేపు చేస్తూ.

"ఎలా ఉంటాడంటే... ఊ.... ఎలా ఉంటాడంటే.. పెద్ద పెద్ద మీసాలు పెట్టుకొనీ...చారల, చారలచొక్కా వేసుకొనీ.. గళ్ళ లుంగీ కట్టుకొనీ..." అంటూ సినిమా 'దొంగ' ని ఊహించుకుంటూ చెబుతోంది శ్యామల.

"అంటే మన పక్కింటి అంకుల్‌లా ఉంటాడన్నమాట!...అయితే పక్కింటి అంకుల్ దొంగేనన్నమాట!" టక్కున అంది ఆ పిల్ల! అదిరిపడి చూసింది శ్యామల చిట్టివేపు- "కొంప ముంచేట్టున్నావు గదే.. మరీ అంకుల్‌తోనో, ఆంటీతోనో అనేవ్! తమాషాకు అలా చెప్పాను. నిజానికి దొంగంటే ప్రత్యేకంగా ఏమీ ఉండదు. అందర్లాగే ఉంటాడు పేంటూ చొక్కా వేసుకొనీ..."

"అంటే అందరూ దొంగలేనన్నమాట!!"

"అబ్బా! దీంతో...ఏయ్... చిట్టీ! అందరూ దొంగలు ఎలా అవుతారే?..." అంటూ శ్యామల తల పట్టుకుంది.

"మరీ!!!" అంది నొసలు ముడివేసి - చిట్టి.

"ఒకరి వస్తువులు తీసుకెళ్ళేవాళ్ళు దొంగలవుతారు. వాళ్ళు ఆడవాళ్ళు కావచ్చొ, మగవాళ్ళు కావచ్చు."

"ఆ తెలిసింది, తెలిసింది.. మన పిండి జల్లెడ ఎప్పుడూ తీసుకుపోతుందే ఎదురింటి పిన్ని.. - ఆమె దొంగేనన్నమాట!"

"నీ తెలివి యేడ్చినట్టుంది పోవే...అడిగి తీసుకుపోవడం దొంగతనం అవదు...మన వస్తువుల్ని ఎవరయినా మనకీ తెలీకుండా తీసుకెళ్ళారనుకో-వాళ్ళు దొంగలవుతారు. అలాగే ఎవరి వస్తువులన్నా మనం వాళ్ళకి తెలీకుండా తెచ్చుకున్నా మనుకో, అప్పుడు మనం కూడా దొంగలమవుతాం - తెల్సిందా?"

"ఊ.....తెల్సింది" అంది చిట్టి - ఆవులిస్తూ.

"ఏం తెలీడమో.. దొంగకథ వింటావా? ఇలా ప్రశ్నలు వేస్తూనే ఉంటావా?" అంది శ్యామల చాలా ఓపిగ్గా.

"అమ్మా అమ్మా...మనం దొంగలయితే బావుంటుంది కదే...ఎంచక్కా మనకి లేని వస్తువుల్ని ఎవరి దగ్గర్నించైనా తెచ్చుకోవచ్చు. పద్మ దగ్గర జిరాఫీ బొమ్మొంది... అది తెచ్చుకుంటానే" అంది హుషారుగా.

"ఆ, తెచ్చుకో, తెచ్చుకో... అలా తెచ్చుకొంటే, నువ్వు దొంగపిల్లవనీ - పోలీసులు పట్టుకుపోయి జైల్లో పెడతారు . ఏమనుకున్నావ్!" అంది శ్యామల - కాస్త కోపాన్ని మిళితం చేస్తూ.

"అమ్మో - పోలీసులే" అంది చిట్టి భయంగా వాళ్ళమ్మ వేపు చూస్తూ.

చలం 'బిడ్డల శిక్షణ' ఎందుకు చదివానా అని ఆ క్షణంలో విసుక్కుంది శ్యామల.

"అప్పుడేమయిందంటే... ఆ....ఆ దొంగ..." అంటూ కథ చెప్పడం కొనసాగించింది శ్యామల.

ఓ అయిదు నిమిషాల తర్వాత 'టక్‌టక్' మంటూ తలుపు చప్పుడయింది. 'శ్యామూ' అంటూ భర్త పిలుపు కూడా వినిపించింది.

"ఏయ్ చిట్టీ! మీ నాన్న..." అన్నది శ్యామల, పాపతో - తలుపు తీయడానికి లేస్తూ. గోడ గడియారం వేపు చూసింది పదయింది.

అప్పటికే పాప నిద్రపోయింది.



ఉదయం పది గంటలయింది.

బయటి గదిలోనే ఓమూలలో పక్కింటి పద్మా, రాధలతో అన్నాలు వండి వార్చే ఆట ఆడడంలో నిమగ్నమయి వుంది చిట్టి.

"ఏయ్ చిట్టీ! స్టోర్లో చక్కెర తెద్దాం రా!" అంటూ పిల్చింది శ్యామల - చేతిలో సంచీ, కార్డూ పట్టుకుని.

"నేను రానమ్మా, ఆడుకుంటున్నాను" అంది చిట్టి తలయినా ఎత్తకుండానే.

"మరైతే నేను తొందరగా వచ్చేస్తా ఎక్కడికీ వెళ్లొద్దమ్మా ఇల్లు వదిలి - అర్థమయ్యిందా" అనేసి, సమాధానం కోసం చూడకుండా వెళ్ళిపోయింది శ్యామల.

కాసేపటికి ఓ లావాటి ఆవిడ వాకిట్లో నుంచుని 'ఒసే పద్మా! రాధా!... మీ డాడీ వచ్చారు రండి!" అంటూ పిల్చింది.

అంతే - చిట్టిని వదిలేసి పరుగెత్తికెళ్ళిపోయారు పద్మా, రాధలు.

వాళ్ళు వెళ్లిన వేపు ఓసారి చిత్రంగా చూసి ఒక్కతే ఆడుకుంటూ వుండిపోయింది చిట్టి.

మరికాసేపటికి కాంపౌండు గేటు 'కిర్రు' మంటే తల్లి వస్తుందేమోనని తలెత్తి చూసింది చిట్టి.

తల్లి రాలేదు కానీ - ఎవరో మగవాడు! లావాటి మీసాలూ, సన్నని నీలపు చారలున్న తెల్లటి చొక్కా - అదే రంగు ప్యాంటు వేసుకుని వున్నాడు. లావుగా వుండీ, చామనఛాయగా వున్నాడు. అతను మెట్లెక్కేసి ఏకంగా గదిలోకి దూసుకొచ్చేశాడు.

"మీ అమ్మ ఎక్కడమ్మా!" అడిగాడు అతను. అదిరిపోయింది చిట్టి.

"లేదు - స్టోరుకెళ్ళింది!" అంది చిట్టి బిక్కుబిక్కుమని అతని మొహం కేసి చూస్తూ.

"ఊహూ. అలాగా!" అంటూ దేవుడి గదిలోకి వెళ్ళిపోయి, కొన్నిక్షణాల తర్వాత బయటి కొచ్చాడు - చేతిలో తాళం చెవులున్నాయి. అతను తిన్నగా బీరువా దగ్గరి కొచ్చాడు. బీరువాని తీసిందే తడవుగా అందులో వున్న బట్టల్ని చిందరవందర చేశాడు. చివరికి తనకు కావలసిన డబ్బు దొరికింది. అతనిమొహం వికసించింది. యథాప్రకారం బీరువాకి తాళం వేసేసి, తాళం చెవుల్ని దేవుడి గదిలో పెట్టేసి వచ్చేశాడు.

చిట్టి భయం భయంగా మూలలో నక్కి వుంది.

అతను తప్పకుండా దొంగయి వుంటాడనపించింది చిట్టికి. రాత్రి అమ్మ చెప్పిన 'దొంగ' లాగే వున్నాడతను. అందులోను తమ డబ్బు కూడా తీసుకుపోతున్నాడు!

'దొంగ' వెళ్ళిపోతూ, పోతూ చిట్టికి ఓ ముద్దు యిచ్చి వెళ్ళిపోయేడు.

చిట్టికి ఏడుపు వచ్చేసింది..

'దొంగ' అలా వెళ్ళిన మూడునిమిషాలకల్లా శ్యామల స్టోరునుంచి చక్కెర మోసుకు వచ్చింది.

తల్లి వస్తూనే - "అమ్మా! మనింటికి దొంగ వచ్చి వెళ్ళాడే" అంటూ బావురుమంది చిట్టి.

శ్యామల నవ్వుతూ - "దొంగేంటే!!! ఎప్పుడొచ్చాడూ? నిజంగా!" అంది హాస్యంగా.

"అవునమ్మా! నిజ్జంగానే దొంగ...మన బీరువా తీసి డబ్బు తీసికెళ్ళాడమ్మా!" అంది చిట్టి ఏడుపు గొంతుతోనే. పాప అలా చెప్పేటప్పటికి అనుమానం వేసి వెంటనే బీరువా తీసి చూసింది. బాగా ఇస్త్రీ చేసిపెట్టిన బట్టలన్నీ చిందరవందరగా పడున్నాయి. డబ్బు చూసుకుంది. అందులో డబ్బు లేదు! అంతకు ముందురోజు రాత్రి భర్త తన సెలవుజీతంగా రెండువేల రూపాయలు తెచ్చి యిచ్చాడు. ఆ డబ్బుతో మిక్సీ కొందా మనుకొంది కూడా. శ్యామల గుండెలు పగిలిపోయాయి! సాయంత్రం భర్త వస్తే ఏం సమాధానం చెబుతుంది తను!

"ఎలాగున్నాడే దొంగ?" అంది వణుకుతున్న కంఠంతో.. ఏడుపు ముంచుకొస్తోంది శ్యామలకి.

తనకు వచ్చిన తీరులో దొంగను వర్ణించి చెప్పింది చిట్టి.

చిట్టి చెప్పే వర్ణన ఎవరిదో శ్యామలకైతే అంతుబట్టనే లేదు.

ఇరుగూ పొరుగూ ఇళ్ళవాళ్ళని విచారించింది. 'మీ ఇంటివేపే మేము చూడలే' దన్నారు - వాళ్ళు.

సాయంత్రం భర్త వచ్చాక, అతనడిగే యక్ష ప్రశ్నలకీ సమాధానం చెప్పడం కంటే ఎక్కడికయినా పారిపోవడం క్షేమదాయకం అనిపిస్తోంది శ్యామలకు - చిట్టి మొహం చూసి ఆ ఆలోచనను విరమించుకుంది.

ఇరుగూ పొరుగు ఆడవాళ్ళు అందరూ ఇంట్లోకి వచ్చేశారు. అందరినోటా ఒకటేమాట – "ఎవరయినా పసిపిల్లని ఇంట్లో వుంచి స్టోరు కెళ్తారా?" అని.

"వారం కిందట మా చెల్లెలి వాళ్ళింట్లో కరెంటు మీటరు చూసేదానికని ఎవడో వచ్చి...మేడ మీద వున్న మీటర్ని చూసే సాకుతో టేపు రికార్డరు తీసికెళ్ళాడు శ్యామలా!" అంది ఎదురింటి వనజ.

"మొన్న ఆదివారంనాడు– జీసస్‌నగర్‌లో మా(ఫ్రెండు వాళ్ళు ఉదయం తొమ్మిందింటికి చర్చికి వెళ్ళారు...సరిగ్గా ఆ సమయం చూసుకొని ఎవరో ఇద్దరు దొంగనాకొడుకులు ఆ ఇంటి తాళం తీసి వాళ్ళ కలర్ టీవీని తీసికెళ్ళారు. ఇదంతా చూసిన ఆ చుట్టు పక్కల వాళ్ళు ఆ దొంగనాయాండ్లని మా (ఫ్రెండువాళ్ళ బంధువులేమో, లేకపోతే అంత నిర్భయంగా ఎలా తీసుకు వెళ్తున్నారు టీవీని అనుకున్నారట – చూడు శ్యామలక్కా! దొంగతనాలు ఎంతపబ్లిగ్గా జరుగుతున్నాయో! ఇంక పసిపాప వున్న ఇంట్లో డబ్బు దొంగిలించుకెళ్ళడం ఏం పెద్ద విషయం చెప్పు! ముందు పోలీసు కంప్లయింటు ఇవ్వండి!" అంది పక్కింటి సుబ్బలక్ష్మి.

ఈ విషయం వినడంతో హడలిపోయింది శ్యామల. సరే అయ్యేదేదో అయ్యింది. ముందీ విషయం తన భర్తకు తెలియజేయాలి అనుకుంది. అనుకున్నదే తడవుగా పక్కింటి నారాయణమ్మ వాళ్ళబ్బాయికి చెప్పింది –"బాబూ! తాలూకాఫీసులో మావారుంటారు... మీ ఇంట్లో 'దొంగ'లు పడ్డారండీ!' అని చెప్పిరావా?" అని అలా 'దొంగ' కు 'లు' చేర్చకపోతే ఆయన ఆఫీసు వదిలి రాడని శ్యామల నమ్మకం.

పక్కింటబ్బాయి 10 నిమిషాల్లో తిరిగొచ్చేసేడు. చేతిలో ఓ చీటీతో. అందులో ఇలా ఉంది –

"ఇంట్లో దొంగలు పడితే సాయంత్రం పోలీసు రిపోర్టు ఇవ్వవచ్చు.... ఇప్పుడు మా ఆఫీసులో దొరలుపడ్డారు (అంటే జాయింటు కలెక్టరూ, ఆర్డీవోలు) కాబట్టి సాయంత్రానికిగానీ రాలేను"

ఆఫీసే జీవితంగా బతికే మొగుడికి అదొక్క కారణంగా విడాకులు ఎందుకివ్వ కూడదు? అనిపించింది శ్యామలకి – ఆ క్షణంలో.



సాయంత్రం ఆరున్నర గంటలయింది.

శ్యామల వంటింట్లో స్టౌ మీదవుంచిన పాలుపొంగు వస్తోన్న గిన్నెనే గమనిస్తోంది. ఆమె మనసు దుఃఖంతో గుబులు, గుబులుగా వుంది. తనింత బాధపడుతూ వుంటే– ఎంతకీ రాని మొగుడుని తలుచుకుంటూంటే తన రక్తం సలసల కాగిపోతూ వుంది, తీరా అతనొచ్చాక – డబ్బు పోయింది. తన నిర్లక్ష్యం వల్లనే అని తనని తిడితేనో– అని అనుకుంటే గుండెలు అవిసిపోతున్నాయి.

"అమ్మా! అమ్మా!!" అంటూ బయటినుంచి చిట్టి కేకలు!

"ఏం చిట్టీ!" అంటూ ఇంట్లోంచి బదులు కేకలేసింది శ్యామల.

"అమ్మా! దొంగ వచ్చాడే!' అంటూ మళ్ళీ అరుపు, అదిరిపడి లేచింది.

"ఏదే, ఏదే..." అంటూ ఆత్రంగా వచ్చింది.

"అద్దో ఆ గదిలో" అంది చిట్టి.

గుండెలు అదురుతుండగా భయం భయంగా గదిలోకి తొంగి చూసింది.

"ఎక్కడమ్మా దొంగ?" అన్న స్వరం గదిలోంచి.

"నువ్వే దొంగవి!" అంది సీరియస్‌గా మొహం పెట్టి చిట్టి.

శ్యామలకి నవ్వాలో ఏడవాలో తెలియలేదు.

"నేను దొంగని కాదమ్మా మీ నాన్నని" అన్నాడతను లుంగీ చుట్టుకుంటూ.

"మీరు దానికి నాన్న అని దానికేం తెలుసండి. పాపం! అది ఈరోజు చూస్తోంది మిమ్మల్ని. అది ఇంకా నిద్రలేవకుండానే పొద్దున్నే ఆఫీసో ఆఫీసంటూ వెళ్ళిపోతారు. అది నిద్రపోయాక గానీ రాత్రిళ్ళు ఆఫీసునుంచీ రారు. ఇక ఆదివారాలూ, పండుగ సెలవుల్లో కూడా ఆఫీసునే పట్టుకుని వేలాడుతూ ఉంటారాయె. మరేమయినా మాట్లాడితే ఆఫీసు ఇన్‌స్పెక్షనంటారు, జమాబందీ అంటారు. మీ గుమస్తాలకి ఆఫీసే పెళ్ళాం పిల్లలూ" అంది విసుగ్గా, బాధగా - కన్నుల్లో నీటిపొర కమ్మేస్తుండగా.

చిట్టి మాత్రం దొంగను చూసినట్టే చూస్తోంది- తండ్రిని.

(ఆదివారం ఆంధ్రజ్యోతి - 18 నవంబర్, 1990)

# జ్ఞాపికలు

రామనాథానికి ఎవరో తట్టి లేపినట్టు మెలకువ వచ్చింది.

ప్రతిరోజూ ఇదే వేళకి మెలకువ వస్తుందతనికి. తనకి కుడివైపు వున్న కిటికీలోంచి బయటికి చూస్తాడు. ఎదురింటిలో అప్పటికే దీపాలు వెలుగుతూ వుంటాయి. పిల్లలు వరండాలో చదువుతూ కనిపిస్తారు. తన గదిలో ఆకుపచ్చగా వెలుగుతోన్న జీరో బల్బు చిరు వెలుతుర్లోనే గోడ గడియారాన్ని చూస్తాడు. అది అయిదుగంటలయినట్టు టైము చూపిస్తుంది. వెంటనే లేచి, ట్యూబులైటు వేసీ, బాత్‌రూమ్‌కు వెళ్ళి వచ్చీ ఆఫీసు నుంచీ తెచ్చుకున్న ఫైళ్ళను రాయడానికి ఉపక్రమిస్తాడు.

ఆరున్నర అవుతున్నట్టే బెడ్ కాఫీ ఇస్తుంది అతని భార్య పద్మావతి. పెన్నుని కింద పెట్టకుండానే కాఫీ తాగేసి, ఏడు గంటలవరకూ అలా ఫైళ్ళను రాస్తూనే వుంటాడు. ఆ తర్వాత కాలకృత్యాలు తీర్చుకునీ, స్నానం చేసీ, అరగంట పూజ చేసుకుని, ఎనిమిదిన్నరకల్లా ఫైళ్ళతో ఆఫీసు చేరుకుంటాడు. అప్పటికి అక్కడ వాచ్‌మేన్ మాత్రమే వుంటాడు – నేరుగా తన సీటు దగ్గరకెళ్ళి బీరువా తెరుస్తాడు. పైనుంచీ రెండవ అరలో ఓ మూలన కొలువయి వున్న ఏడు కొండలవాడి పటానికి రెండు క్షణాలు మొక్కుకునీ అప్పుడు ఫైళ్ళు రాయడం మొదలుపెడతాడు. అప్పట్నించీ రాసీ రాసీ, మధ్యలో ఒకటిన్నర ప్రాంతంలో ఇంటినుంచి అటెండరు తెచ్చిన క్యారియర్ని ఖాళీ చేస్తాడు. మళ్ళీ ... ఇక ఫైళ్ళు రాయడమే! అలా రాత్రి ఎనిమిదిన్నర గంటల వరకూ రాసీ, ఫైళ్ళతోనే ఇల్లు చేరుకుంటాడు. భోజనానంతరం ఒక గంటసేపయినా ఫైలు రాయందే అతనికి నిద్రపట్టదు మరి! ఇంచుమించూ అతని ముప్ఫయ్యేళ్ళ సర్వీసులోని దినచర్య ఇదీ!

ఇందులో ఆదివారాలూ, సెలవుదినాలూ, పండగలూ, పబ్బాలూ పెద్ద మినహాయింపేమీ కావు!

అయితే -

ఇదంతా గత కాలానికి సంబంధించిన గుర్తులుగా మిగిలిపోతున్నాయి ఇవాల్టితో ...

అవునూ ...

నిన్ననే రామనాథం రిటయిరయ్యాడు!

నిన్న సాయంత్రం ఆర్డీవో ఆఫీసు మీటింగు హాలులో తన పదవీ విరమణ సభ జరిగింది. దాన్ని 'పదవీ విరమణ సభ' అనడం కంటే 'అభినందన సభ' అనడం సబబుగా వుంటుందేమో ననిపించేంత ఘనంగా జరిగింది!

ఆ ఆఫీసులో వున్న సీనియర్ మోస్టు డిప్యూటీ తాసిల్దారులలో రామనాథమే మొదటివాడూ, అందరి అభిమానానికి పాత్రుడూనూ. అతనంత అభిమానాన్ని సంపాదించుకోడానికి కారణం – ఆఫీసుకు సంబంధించిన ప్రతి సబ్జక్టూ, క్షుణ్ణంగా అవగాహన కలిగివుండటమే! ఎట్లాంటి కష్టతరమైన డ్రాఫ్టైనా అలవోగ్గా అటు ఆంగ్లంలోనూ, ఇటు తెలుగులోనూ రాసేయగలడు తను. అతనికున్న ఒక సుగుణం ఆఫీసులో అందరితోనూ కలివిడిగా మాట్లాడ్డమైతే, మరో సుగుణం ఎన్ని గంటలయినా సీటుకు అంటుకుపోయి ఫైళ్ళను రాస్తూ వుండిపోవడటమే! ఈ రెండు సుగుణాలనీ మించిన సుగుణం మరొకటి ఉంది. తనకున్న రెవిన్యూ విషయ పరిజ్ఞానంతో పై అధికారుల్ని ఇట్టే ఆకట్టుకోగలగటం! బంగారానికి పరిమళమబ్బి నట్టుగా ఈ సుగుణాలకి తోడుగా అతనికి అపారమైన జ్ఞాపకశక్తి వుంది. అది ఆఫీసులో అందర్నీ ఎప్పటికప్పుడు అబ్బురపరుస్తూ వుంటుంది. ఫలానా ఉద్యోగి సర్వీసు విషయంలో ఒక ఇబ్బంది వచ్చిందే అనుకోండి, దానికి సంబంధించిన డిస్పోజల్ ఏదయినా వుందా? అని ఎవరయినా రామనాథాన్ని అడిగితే, అతను తడుముకోకుండా ఆ డిస్పోజల్ ఎన్నేళ్ళ కిందటిదో, దాని నెంబరు చెప్పి, అది రికార్డు రూంకు ఎప్పుడు వెళ్ళిందో కూడా అవలీలగా చెప్పేసి, అందర్నీ చకితుల్ని చేయగలడు!

అందుకే – పదవీ విరమణ సభలో ఉద్యోగులంతా అతన్ని పూలమాలల్తో ముంచెత్తేరు. శాలువాలతో సత్కరించేరు. మెమెంటోలతో అభినందించేరు. తమ ప్రసంగాలలో అతను ఆఫీసుకీ, డిపార్టుమెంటుకీ చేసిన సేవని శ్లాఘించేరు! ఎన్నడూ ఒక్కమాటయినా మాట్లాడని ఆర్.డి.ఓ. (రెవిన్యూ డివిజనలు ఆఫీసరు) గారు కూడా రామనాథం గురించి మాట్లాడుతూ, 'తనకి కుడిభుజం పోయింది' అని గాద్గదిక స్వరంతో మాట్లాడుతోంటే పులకించిపోయేడు రామనాథం. తన సర్వీసులో అంకిత భావంతో పనిచేసిన మనుషుల్ని అతి కొద్దిమందినే చూశాననీ, వారిలో రామనాథమే మొదటివాడనీ – ఆయన చెబుతోంటే రామనాథం గుండె ఉబ్బిపోయింది. 'ఎవరయినా ఆఫీసరు పిలిస్తే పలుకుతారు. కానీ రామనాథం పిలవకనే పలుకుతాడు' అని ఆర్డీవో అన్నపుడు రామనాథం కళ్ళు చెమ్మగిల్లేయి! 'కంప్యూటర్లకి మించిన కంప్యూటర్ మనిషి మెదడు – అని సైంటిస్టులు అంటారు. అది రామనాథం విషయంలో నిజమైన నిజం! ఇంకా బాగా చెప్పాలంటే కంప్యూటర్నే మించిన బ్రెయిన్ రామనాథానిది అంటే, అతిశయోక్తి కాదేమో!' అంటూ ఆర్డీవోగారి ప్రసంగం కొనసాగుతూ వుండగా, కరతాళధ్వనులు మిన్నుముట్టేయి. అప్పుడు రామనాథం రెండు ఎవరెస్టులపై నిలుచున్నంత ఆనందంతో ఉప్పొంగిపోయేడు.

సభ అయిపోయేక అందరూ ఇంటివరకూ బేండు మేళాలతో ఊరేగింపుగా తీసుకువచ్చి తనని ఆత్మీయంగా విడిచివెళ్ళారు. బంధుమిత్రులతో ఇల్లంతా కళకళ లాడింది. అంత ఆనందాన్నీ మనసులో నింపుకునీ రాత్రి ఏ పన్నెండింటి వరకో తన భార్యతో ఆఫీసు విషయాల్నే ముచ్చటిస్తూ వుండపోయేడు రామనాథం.

ఇట్లా ఆలోచనలతో పరవశించిపోతున్నాడతను ... అప్పుడే తను రిటైర్డు అయి ఒక్క రోజు గడిచిపోయింది! నిన్నటిదాకా డిప్యూటీ తహసిల్దారు తను! మరి ఈ

రోజు నించీ రిటైర్డు డిప్యూటీ తహసీల్దారు. ఆ మాట అనుకోగానే మనసులో నైరాశ్యం అలుముకుంది రామనాథానికి. నిన్నటిదాకా విరామమెరుగక పరిశ్రమించిన చేయి ఈవాల్టినుంచీ గడిచే రోజుల్నీ, గడవని కాలాన్నీ, పెన్షన్ డబ్బునీ లెక్కించటం కోసం ఉపయోగపడుతుంది! ఎంతలో ఎంత మార్పు!

"ఏమండీ కాఫీ!" అంటూ పద్మావతమ్మ పొగలుకక్కే పెద్ద కప్పును అందించింది.

నవ్వుతూనే బెడ్‌కాఫీని అందుకున్నాడు. పద్మావతమ్మ తనూ నవ్వేసి వెళ్ళిపోయింది ... గోడగడియారం ఆరున్నర అయినట్టు సూచిస్తోంది. అంటే తను గంటన్నర నించీ గత స్మృతులను నెమరేసుకుంటున్నాడన్నమాట!

నెమ్మదిగా కాఫీ తాగేసేడు ...

ఇంట్లోంచి చిన్న పిల్లల కేకలు, మరీ చిన్నపిల్లల ఏడుపులూ, పెద్దవాళ్ళ మాటలూ అన్నీ కలగాపులగంగా వినిపిస్తున్నాయి రామనాథానికి.

అబ్బో! చాలామంది బంధువులే వున్నట్టున్నారు. అసలు ఎవరెవరు వచ్చారో కూడా తను గమనించలేదు. నిజానికి రాత్రే అందర్నీ మాట్లాడించి వుండాల్సింది. అయినా తనకు వీలెక్కడుందీ? 'ఇవాళ మాట్లాడించేస్తే సరి' అని తనకు తనే సర్దిచెప్పుకున్నాడు రామనాథం.

కాలకృత్యాలు తీర్చుకునేందుకు గదిలోంచి బయటికి వచ్చేడతను. ఎందుకో పక్కగదిలోకి చూసేడు. చామనఛాయలో వున్న ఓ నలభై సంవత్సరాల మనిషి గడ్డానికి బాగా సబ్బు నురగ దట్టించి, అద్దంలోకి చూస్తూ షేవ్ చేసుకోవడంలో నిమగ్నమయి వున్నాడు. ఒంటినిండా రోమాలున్నాయి. చారల లుంగీ మాత్రం కట్టుకుని ఉన్నాడతను. 'ఇతనెవరయి వుంటాడబ్బా!' అని ఒక్క క్షణకాలం ఆలోచించేడు. ఆ మాటే అతన్నడిగితే ఏమనుకుంటాడో...ఊహూ... మంచిదికాదు. తర్వాత పద్మని అడిగి తెలుసుకుంటే సరి. తను ఈ ముప్పయి ఏళ్ళలో ఎవరి పెళ్ళికిగానీ, ఏదన్నా ఫంక్షనుకి కానీ వెళ్ళి వుంటే ఎవరెవరు బంధువులు అన్న విషయం తెలిసుండేది. తనకి ఆఫీసే లోకమాయె! అలా అనుకుంటూ వుండగానే వంటింటివైపు నుంచీ పసిపిల్లల ఏడుపు వినిపించి, అప్రయత్నంగా ముందుకు అడుగువేసేడు. అతనలా వెళుతున్నట్టే ఏడుస్తోన్న పిల్లని సముదాయిస్తూ ఒక ఇరవయి అయిదేళ్ళ అమ్మాయి ఊయల వూపుతోంది. ఆమె రామనాథం వైపొకసారి చూసి నవ్వి, పిల్ల ఏడుపు మరీ ఎక్కువకావడంతో నోటితో ఊూ...ఊూ...ఊూ ...మంటూ ఊయల్ని మరింత వేగంతో ఊపసాగింది. "ఎవరమ్మా నువ్వూ?" అనడుగుదామని నాలిక చివరిదాకా వచ్చింది. 'వొద్దొద్దు...అట్లా అడిగి నా అమాయకత్వాన్ని బయట పెట్టుకోవడం ఎందుకూ?' అనుకుని ముందుకు నడిచేడు. అక్కడినించీ రెండు మూడు అంగల్లో వరండా వస్తుంది. అయితే తను వెళ్ళాల్సింది బాత్రూమ్‌కి కదా అన్న విషయం గుర్తొచ్చి వెనక్కి తిరుగుతున్నవాడల్లా – వరండాలో పేపర్ని నిశితంగా చదువుతోన్న అద్దాల మనిషిని చూసేడు. అతనికి ముప్పయి అయిదేళ్లుంటాయి. బనియను, లుంగీలతో వున్నాడు. "మరి ఇతనెవరో!"...ఏమో... పద్మని అడిగితే సరి! అనుకుంటూ బాత్రూం వైపు వెళ్ళేడు. కాంపౌండులో

నలుగురు పిల్లలు బంతి ఆడుతూ కనిపించేరు అక్కడికి. 'ఆహా! నిజంగా పెళ్ళి ఇల్లులా వుంది!' అనుకుని సంబరపడిపోతూ బాత్రూంలోకి దూరిపోయేడు రామనాథం.

ఎనిమిది గంటలకల్లా స్నానాదులు పూర్తిచేసుకుని, తన గదిలోని మంచంపైనే కూచుని వున్నాడు. తనకి బాత్రూం నుంచీ వచ్చేటప్పుడు తటస్థపడ్డ మరి నాలుగు కొత్త ముఖాలు 'ఎవరా' అన్నది అతని మనసులో ఓవైపు మెదులుతూనే వుంది.

పెద్ద ప్లేటులో పద్మావతమ్మ వేడి వేడి ఇడ్లీలు తెచ్చింది – "మీకిష్టమని ఇడ్లీలూ, చెనిగిత్తనాల చెట్నీ చేసినా!" అందామె.

అతను మంచం మీద నుంచే ప్లేటు అందుకున్నాడు.

"పద్మా! నేను పొద్దిన్నించీ చూస్తున్న వాళ్ళంతా ఎవరూ?" అడిగేరు.

"ఎవరండీ?" అందామె కనుబొమ్మల్ని ముడివేసి.

ఇంతలో "బావా! బాగున్నావా?" అంటూ గదిలోకి దూసుకొచ్చేడు పరమేశం. అతను పద్మావతమ్మ చిన్న తమ్ముడు. హిందూపురంల్లోని బ్యాంకులో ఆఫీసరుగా పన్జేస్తున్నాడు.

'బావున్నాను' అన్నట్టు తలాడించి "రా. రా! టిఫిన్ చేద్దాం!" అన్నాడు రామనాథం.

"నాదయిందిలే ... నిన్న నీ రిటైర్మెంటు ఫంక్షనుకి రాలేకపోయినాను బావా! బాగా జరిగిందంట కదా!" అంటూ దగ్గరలోనే వున్న ఓ కుర్చీని లాక్కుని కూచున్నాడతను.

"నువ్వు రావాల్సిందిరా! ఎవురికేగాని అంత బాగా జరిగుండదు!" అంది పద్మావతమ్మ సంతోషంగా.

"సరేగానీ ... ఒరే పరమేశా! ప్రస్తుతం మనింట్లో కొన్ని కొత్త కొత్త మొఖాలు పొద్దన్నించీ చూస్తున్నాను, వాళ్లు ఎవరెవరో, నాకేమవుతారో కొంచెం పరిచయం చేయరా! ఏ పెళ్ళికన్నా, పేరంటానికన్నా వెళ్ళుంటేనా, నాకెవరన్నా పరిచయమయ్యేకి... మీ అక్కయ్యతో ఆ మాటే అడుగుతూ వుంటే నువ్వొస్తివి!" అన్నాడు దీనంగా మొహంపెట్టి.

"ఊ ... హూ ... ఇన్నాళ్ళకి మీకు మనుషులు కావాల్సొచ్చినారా? లేకుంటే ఫైళ్ళే జీవితం గదా!" అంది పద్మావతమ్మ చిరుకోపంతో.

"బాబ్బాబూ! పుణ్యముంటుంది పరిచయం చేయరా! మీ అక్కయ్య దెప్పిపొడుపులు మామూలే కదా!" అంటూ టిఫిన్ తింటున్నవాడల్లా బతిమాలుతున్నట్టు మొహం పెట్టేడు.

"సరే బావా! డోన్ట్‌వర్రీ!!" హామీ ఇచ్చేడు పరమేశం.

రామనాథం తినడంలో నిమగ్నమయిపోయేడు.

ఒకసారి అందర్నీ ఇక్కడికి తీసుకురమ్మని అక్కయ్యకి కళ్ళతోటే చెప్పి పంపేసేడు పరమేశం.

"బావా! నీ సర్వీసులో ఎక్కువ భాగం ఆర్డీవో ఆఫీసులోనే కదా!" అనడిగేడు పరమేశం.

"అవున్రా! 14 సంవత్సరాలా ఏడు నెలలా ఇరవై నాలుగు రోజులు పనిచేసినాను" అన్నాడు.

"ఎంతమంది ఆర్డీవోలు మారినారు?"

ఒక్క క్షణం ఆలోచించి – "ఫుల్ అడిషనల్ ఛార్జి ఆర్డీవోలతో సహా 18 మంది ఇప్పుడున్నది పందొమ్మిదో ఆర్డీవో..." చెప్పేడు రామనాథం.

"వాళ్ళ పేర్లు చెప్పగలవా బావా?"

రెండు క్షణాలు కళ్ళు మూసుకునీ, తెరిచాడు. ఇక చెప్పడం ప్రారంభించాడు రామనాథం – పరమేశం ఆశ్చర్యపోతున్నాడు.

"మరి సూపర్నెంటులూ?"

"ఇరవయి మందిరా"

"ఊ బాగుంది ... నీ పనితనాన్ని మెచ్చుకుని ఎన్నిసార్లు సర్టిఫికెట్లు ఇచ్చినారు?"

గోడలకి తగిలించి వున్న సర్టిఫికెట్లనీ, అభిమానంతో ఇచ్చిన జ్ఞాపికల్నీ తినడం ఆపి ఎంతో మురిపెంగా చూపించేడు రామనాథం.

ఈలోగా ఆ గదిలోకి కొత్తవాళ్ళందర్నీ పిల్లల్తో సహా తీసుకువచ్చింది పద్మావతమ్మ.

నలుగురు ఆడవాళ్ళూ, నలుగురు మగవాళ్ళూ, వాళ్ళ పిల్లలూ ... కుటుంబాల వారిగా, గ్రూప్ ఫోటోకి నిలబడ్డట్టు నవ్వు మొహాల్తో నిలబడ్డారు – నాలుగు జట్లుగా...

వాళ్ళందరివైపూ ఒకసారి చూసి బిత్తరపోయేడు రామనాథం. ఏం జరుగుతోందీ ... తను రహస్యంగా కనుక్కుందామనుకున్న విషయం కాస్తా బట్టబయలు అయిపోయేట్టు వుందే! ఇప్పుడేం చేయడం ...అనుకుంటూ వాళ్ళవైపు చూడనట్టు వుండాలని తంటాలు పడుతున్నాడు రామనాథం.

"బావా! ఇక్కడున్న వాళ్ళనేనా ఇందాకా నువ్వు ..." అంటూ ఆపేశాడు పరమేశం.

'అవు' నన్నట్టు తల వూపి, పిల్లల వైపు చూస్తూ, వాళ్ళలో నవ్వుతున్న పాపని రమ్మన్నట్టు చేతులు చాచేడు రామనాథం.

ఆ పాప రానన్నట్టు తల ఆడించి, వాళ్ళమ్మ కుచ్చిళ్ళలో ఒదిగిపోయింది.

"ఇందాకా నీ సర్టిఫికెట్లూ, జ్ఞాపికలూ చూపించి మురిసిపోయావు కద బావా! మురిసిపోవాల్సింది – వీళ్ళని గురించీ ... నీ నిజమైన జ్ఞాపికలు వీళ్ళే ... అంటే నీ పిల్లలే వీళ్ళంతా ... వాడు పెద్దోడు రవి, వీడు రెండోవాడు సోము ... ఆమె పెద్దమ్మాయి దివ్య, ఇదేమో మీ చిన్నమ్మాయి రమ్య ..." అంటూ కోడళ్ళనీ, అల్లుళ్ళనీ, వాళ్ళ పిల్లల్నీ పేరుపేరునా పరిచయం చేసేడు పరమేశం. నోరు తెరిచి అట్లా వుండిపోయేడు రామనాథం.

(ఆదివారం ఆంధ్రజ్యోతి – 27 ఏప్రిల్, 1997)

# హోమ్‌సిక్

అందరం కలిసి బయల్దేరి వుంటే బావుండేది పద్మా!" లక్షన్నొకటోసారి అన్నారు మావారు.

నాకు ఎక్కడలేని కోపం వచ్చింది. దాన్ని నవ్వుగా అనువాదం చేసి –"నాలుగు రోజులుండి రావడానికి అందరూ ఎందుకండీ! డబ్బు దండగకదూ?" అన్నాను. ఈ జవాబు కూడా లక్షన్నొకటోసారిదే.

రాయదుర్గం కొండల వెనకాల అయిదుగంటలకే దాక్కొంటున్నాడు సూర్యుడు.

బస్‌స్టాండ్ బాగారద్దీగా ఉంది.

బెల్లంచుట్టూ మూగిన ఈగల్లాగ– అప్పుడే స్టాండులోకి వచ్చిన బస్సును చుట్టుముట్టారు ప్రయాణికులు. మా బుజ్జిగాడూ, చిట్టి రేగుపళ్ళు తింటూ వాళ్లని వింతగా చూస్తున్నారు. మావారు వెళ్ళవలసిన బస్సు అనంతపురం ఫాస్టు సర్వీసు కావడంవల్ల అంతరద్దీగా లేదు.

అనంతపురంలో విజయవాడ బస్సు దొరుకుతుందంటారా?" మావారిని అడిగాను.

"సామాన్యంగా దొరుకుతుంది. ఒకవేళ అది మిస్ అయితే దావణగేరే టు విజయవాడ బస్సు దొరుకుతుంది."

"అలాగా" అన్నాను.

"డ్రైవరు వచ్చేశాడు బస్సుస్టార్ట్ చేస్తాడేమో" అన్నారు చిట్టిని ఎత్తుకుంటూ.

డ్రైవరు వచ్చాడే కానీ బస్సు ఎక్కలేదు, డోర్ దగ్గరే నిలుచున్నాడు. బ్రహ్మ దేవుడతన్ని అందర్నీ చేసినట్టు మట్టితో కాకుండా తారూ, రాక్షసి బొగ్గూ కలిపి వండి మరీచేసినట్టు నల్లగా మెరుస్తున్నాడు. అతని పెదవులు మరీ నల్లగా వుండి కిళ్ళీ నములుతున్నందువల్లనేమో రాక్షసి బొగ్గుకు నిప్పు అంటుకున్నట్టున్నాయి. కుడి మోచెయ్యి స్టైయిల్‌గా బస్సుకు ఆనించి మరింత స్టైయిల్‌గా కుడికాలును ఎడమ కాలును చుట్టేసి, సిగరెట్‌ని పెదవులకు అంగుళం దూరంలో వుంచుకుని, ఎవరో స్టూడెంట్‌తో డ్రైవర్‌లా కాకుండా బస్ ఓనర్‌లా మాట్లాడుతున్నాడు. గీతోపదేశాన్ని ఎంతో శ్రద్ధగా వింటోన్న అర్జునుడిలా నమ్రతతో వింటున్నాడా స్టూడెంటు.

కొందర్ని చూస్తే కొన్ని అనుభూతులకు లోనవుతాము. మా పాలవాడిని చూస్తే అకారణంగానే వాడిపై జాలి చూపించాలనిపిస్తూ వుంటుంది. మరి, మా వారిని చూస్తే అవసరంగా రెండు ఈటెలమాటల్ని విసరాలని అనిపిస్తూవుంటుంది నాకు. సైకాలజిస్టులు ఈ గుణానికి ఏ పేరు పెడతారో తెలియదు కానీ, ఆ డ్రైవర్‌ని చూస్తే మటుకు హెల్ప్, హెల్ప్ అంటూ అరవాలనిపిస్తుంది. ఇంగ్లీషు సినిమాలో

లాగ నవ్వుతూ మాట్లాడుతూనే దవడమీద రెండు వేస్తాడేమో అనిపిస్తూవుంది. కొంపదీసి కొద్ది క్షణాలలో, ఆ స్టూడెంటు దవడని.....అని అనుకోగానే జాలేసింది ఆ కుర్రాడిమీద.

అందాకా తాగుతున్న సిగరెట్టును కిందికి జారవిడిచి, దాన్ని నిర్దాక్షిణ్యంగా చెప్పుకాలితో రాచేసి, జానపద విలన్లా బస్సులోకి ఎగిరేడు. థాంక్ గాడ్! ఆ స్టూడెంటు నేమీ చేయలేదు.

"వెళ్ళొస్తా పద్మా! పిల్లలు జాగ్రత్త, చిట్టికి మూడు పూటలా టాబ్లెట్లు మింగించడం మరచిపోకు. రేపటికల్లా తగ్గిపోతుందిలే జలుబు" అంటూ చిట్టిని, బుజ్జిగాణ్ణి ముద్దాడి బస్సు ఎక్కారు.

దేవుడు వరమిచ్చినా పూజారి వరమీయనట్టు - డ్రైవరు స్టీరింగ్ ముందు కూచున్నా కండక్టర్ రైట్ అననందువల్ల బస్సు కదల్లేదు.

ఇలా పిల్లల్నీ, నన్నూ వంటరిగా వదిలి వెళ్ళడం ఇదే ప్రథమం. అందరం కలిసే వెళ్ళాలని మొదట పట్టుబట్టారు వారు. నెలకూ, రెండు నెలలకోసారి వందల కొద్దీ మైళ్ళు ప్రయాణాలు చేస్తుంటే సంసారాలు ఏమైపోవాలి. మనమేం దేశ సంచారులమా? అని రణరంగానికి కత్తి ఝళిపించేసరికి అప్పుడు మెత్తబడిపోయి తనొక్కడే వెళ్ళడానికి ఒప్పుకున్నారు.

అసలు వచ్చిన చిక్కేమిటంటే మావారు హోమ్‌సిక్. తల్లిదండ్రినీ, ఉన్న ఊరునీ విడిచి వుండలేరు. చదువుకునే రోజుల్లో ఓసారి మహాబలిపురంకు ఎడ్యుకేషనల్ టూర్ వెళ్ళారట. సముద్రస్నానాల అనంతరం మావారు కనిపించకపోయేసరికి లెక్చరర్లు భయపడిపోయి బెజవాడకు టెలిగ్రామ్ ఇచ్చారట. ఈయన హోమ్‌సిక్ సంగతి తెలీక.

ప్రభుత్వానికి మావారి హోమ్‌సిక్ తొలగించాలని కుతూహలమేమో అందుకే ఆంధ్రదేశంలో ఈ మారుమూల ఊరికి బదిలీచేశారు. దూరం ఆయనకో లెక్కా, సంవత్సరం తిరక్కుండానే ఓ డజనుసార్లు సకుటుంబ సమేతంగా ఏదో ఓ మిషపై ప్రయాణాలు కట్టించారు బెజవాడకి. ఇలా సాగితే ఇక మనం అప్పుల్లోంచి ఈ జన్మకి బయటపడగలమా అన్చెప్పి "ఈసారి మీరొక్కరే వెళ్ళి రండి" అన్నాను.

"మా నాన్నకి జ్వరం అని తెలిసి అందరూ వెళ్ళకుంటే ఏం బావుంటుంది?" అని లా పాయింటు తీశారు.

"సరే మీరు వెళ్ళాక....మామగారికి సీరియస్‌గా వుంటే టెలిగ్రామ్ యివ్వండి. నేనూ, పిల్లలూ వచ్చేస్తాం" అని హామీ ఇచ్చాను.

పూజారి వరమిచ్చాడులా వుంది. దేవుడు బస్సుని స్టార్ట్ చేస్తున్నాడు.

బస్సు కదిలింది.

ఆయన మావేపు దిగులు దిగులుగా చూస్తూ చెయ్యి వూపుతుంటే నా కళ్ళల్లో నీటిపొర కమ్మేసింది.

బస్సు వెళ్ళిపోయింది. మాపిల్లలు వాళ్ళ నాన్నకు ఇంకా టాటా చెబుతూనే వున్నారు.



ధన్...ధన్...ధన్... తలుపుకొడుతున్న శబ్దం.

అందుకే నాకు మెలకువ వచ్చినట్టుంది.

టైమ్‌పీస్ అయిదున్నర గంటలు చూపిస్తోంది. తెల్లవారి వెలుగులు మా కిటికీ తెరలతో దోబూచులాడుతున్నాయి.

ధన్...ధన్...ధన్... మళ్ళీ శబ్దం. తలుపులు కొట్టడం, విరగొట్టడం ఒకటి కాదని తెలియని వెధవ ఎవరా అని నాలో కోపం బుసలుకొడుతోంది.

వెళ్ళి తలుపు తీశాను.

ఎదురుగా మావారు...

నా పతి దేవుడు!!!

రెండుక్షణాలు ఊపిరి తీసుకోవడం మరచిపోయాను.

అనీమిక్ పేషెంటులా పాలిపోయిన మొహం, అర్ధగజం లోతుకు వెళ్ళిన కళ్ళూ. ఆ కళ్ళు చూసే ఆదుర్దా చూపులూ, రేగిపోయిన జుట్టూ చూస్తుంటే ఏదో కీడు జరిగిపోయినట్టు శంకిస్తోంది నా మనసు.

"నిన్న సాయంత్రమేగా మీరు బెజవాడ బయల్దేరింది?" చాలా సందేహాలతో నా గొంతులోంచి అప్రయత్నంగా మాటలు వస్తున్నాయి.

నా మాటలు వారికి వినబడ్డట్టు లేవు. సర్రున లోపలికొచ్చేశారు.

"చిట్టికి ఎలా వుంది?" అడిగారు. ఎదురుగా మంచంమీద పడుకుని వున్న పాప చెక్కిలిపై చేయి వుంచుతూ.

"దానికేం నిక్షేపంలా వుంది. రాత్రి నుంచి జలుబు కూడా తగ్గింది. అది సరేకాని బెజవాడ వెళ్ళలా? ఏం?" నా ప్రశ్న నాకే ఎలాగో వుంది. బెజవాడ వెళ్ళుంటే ఇక్కడెందుకుంటారు?

"అందరం కలిసి వెడదామంటే విన్నావుటే. మిమ్మల్ని విడిచి వెళ్ళిన క్షణంనుంచి మీ దిగులే. ముఖ్యంగా చిట్టికి సిరియస్ అయిపోయినట్టూ, నువ్వేమో కంగారుతో ఏడుస్తున్నట్టు నాకు ఒకటే ఆలోచనలు. దాంతో బుర్రవేడెక్కి నంద్యాలలో బస్సు దిగేశాను. ఈ ఊరిదే లారీ వస్తుంటే అందులో వచ్చేశాను."

ఆయన ఏం చెబుతున్నారో వినాలనే ఆసక్తి లేదు నాలో. ఆయన్ని ఎలా కోపగించుకోవాలో తెలియని స్థితిలో పడ్డాను. నష్టపోయిన బస్సుచార్జీల తాలూకు డబ్బు కళ్ళముందు గిరగిర తిరుగుతోంది. ఆయన్నని ఏం లాభం? తల్లిదండ్రులు వున్న యిల్లు ఆయనకి హోమ్ అయితే, ఇది 'స్వీట్‌హోమ్' అన్న విషయం మరిచిపోవడం నాది కదా బుద్ధితక్కువ.

(మయూరి వీక్లీ - 27 జూన్, 1986)

# తివిరి ఇసుమున

ఆ కొట్టం హోటలు పెద్ద రద్దీగా ఏం లేదు.

హోటలు ప్రొప్రయిటరూ, సర్వరూ అన్నీ ఆంకాళమ్మే. ఆంకాళమ్మ ఆడమనిషన్న పేరేగానీ, గొంతులోనూ, వ్యవహారంలోనూ మగ మనిషే. ఆమె ఆడమనిషని అనడానికి తార్కాణం ఆమెకున్న ఇద్దరు మగపిల్లలే. మనిషి భారీగా వుంటుంది. ఏ పంజాబులోనో ఆడవాళ్ళు అలా ఉండడం జరుగుతుంది, కానీ ఆమె మాత్రం పూర్తిగా నూరు పైసల తెలుగావిడే! ఆ హోటల్లో టిఫిన్ చేయడమన్నా, కాఫీ తాగడమన్నా ఇష్టం హరిహరరావుకి. అతను ఆర్ఐ (రెవెన్యూ ఇన్‌స్పెక్టర్) అవడం వల్ల అందరికంటే చక్కటి, చిక్కటి స్ట్రాంగు కాఫీ ఇస్తుంది ఆంకాళమ్మ.

ఎప్పటిలాగే ఆవేళ కూడా పదకొండు గంటలయినా ఆఫీసుకు వెళ్ళకుండా టిఫిన్ తినేసి, స్ట్రాంగుకాఫీ తాగుతూ ఉన్నాడు హరిహరరావు.

"ఈ మాయ జగత్తులో మాయకానిదేదీ?" అని ప్రశ్నించాడు బైరాగి ఆంకాళమ్మను. హోటల్ రద్దీగా లేనందువలన కష్టమర్లకు సర్వుచేసే పని పెద్ద కొడుకుకి వదిలేసి మూలలో ఉన్న బైరాగి టేబులు ముందు కూచుని ఉంది ఆంకాళమ్మ.

బైరాగి వేసిన ప్రశ్నకు సమాధానం చెప్పాలని లేదు ఆంకాళమ్మకు. తల ఊపింది అతనే చెబుతాడులే అని. రెండుక్షణాలు అలా ఆమెను చూసి "అంతా మాయే!" అని తేల్చి చెప్పాడు బైరాగి.

ఆ మాటకు కూడా తల ఊపింది ఆంకాళమ్మ.

"మనం సంత చేసుకోడానికి ఈ లోకానికి వచ్చినాం.....ఇక్కడ సంత జేసుకొనేది అయిపోతూనే ఎవరికి వారు వెళ్ళిపోతానే ఉంటారు. ముందుగా సంత జేసుకున్న వాళ్ళు ముందుగా దాటుకుంటారు ఈ లోకం నుంచీ - అన్ని మతాలూ, అన్ని వేదాంతాలూ, అన్ని సిద్ధాంతాలూ ఇవేనామ్మ జెప్పేదీ.... మనం మూర్ఖంగా ఉండి తెలుసుకోలేం - అంతే. అంతా మాయ కాదేమమ్మా. నువ్వు మాయ, నేను మాయ, ఈ హోటలు మాయ, నీ యజమాని మాయ అంటే నీ మొగుడు....నీ మొగుడూ మాయే....నీ పిల్లలు మాయే...అంతా మాయ, మాయ, మాయ.....అంటూ చెప్పుకు పోతున్నాడు బైరాగి. బైరాగికి భుజాల వరకూ పెరిగిన జుత్తూ, దట్టంగా పెరిగిన గెడ్డం, మీసాలూ - ఒక్కసారిగా మాట్లాడుకుని తెల్లబడ్డట్టున్నాయి. నుదిటిమీద రూపాయి కాసంత ఎర్రటి కుంకుమ బొట్టు నిగనిగలాడుతోంది. అతని కళ్ళూ, పెదవులూ నిర్మలంగా ఉండటం వల్ల అతను

ఏం చెప్పినా నిజమేనని గుడ్డిగా నమ్మేంతగా ప్రభావితం చేస్తున్నాయి. మాటలు మాత్రం కర్నాటక రాష్ట్ర సరిహద్దులోని తెలుగు యాస ధ్వనిస్తున్నాయి.

హరిహరరావు కాఫీ తాగడం పూర్తి చేసి, సిగరెట్టు అంటించుకునేందుకు అగ్గిపెట్టెని చేతిలో సిద్ధంగా ఉంచుకున్నాడు. బైరాగి 'అంతా మాయ, మాయ, మాయ' అనడం అతన్ని ఎంతో ఆకట్టుకుంది. హరిహరరావుదో చిత్రమైన మనస్తత్వం, ఎప్పుడు ఏ సిద్ధాంతం వింటే, ఏ ఫిలాసఫీ వింటే అప్పటికి అందులోనే జీవిస్తాడు. ఇప్పుడతనికి తను ఇంతవరకూ తాగిన కాఫీ మాయగా అనిపిస్తోంది. సిగరెట్టు మాయే కదా కాల్చకుంటేనేమి అని కొంతసేపు సంశయించీ ఇదీ మాయే కదా కాల్చేద్దాం అన్న నిర్ణయానికి వచ్చేశాడు. అందుకే మాయసిగరెట్టును అంటించేసి, మాయపొగని పీల్చాడు. మాయ పెదవుల్తో మాయపొగ మాయనోటి గుండా మాయ ఊపిరితిత్తుల్లోకి పోయి, మాయ మాయగా తిరిగి రాగా, మాయ ముక్కుతో "పోన్లే పాపం", మాయ కదా అని నెమ్మదిగా వదిలేశాడు. ఆ క్షణంలో తనూ మాయగా, హోటల్ మాయగా, ఆంకాళమ్మ మాయగా, బైరాగి మాయగా, హోటల్ మాయగా, ఎమ్మార్వో మాయగా, పార్టీలు మాయగా - ఇలా గొలుసుగా అంతా మాయ అనిపిస్తూ, తన భార్యాపిల్లలూ మాయగా అనిపిస్తోన్నారు.

హరిహరరావు గొప్ప దేశనాయకుల సభకు వెళ్తే అట్లా దేశభక్తిలో పడి కొట్టుకు పోతాడు. తను ఈ దేశంలో పుట్టినందుకు పులకించిపోతాడు. ప్రపంచంలో తన దేశం గొప్ప, దేశంలో తన రాష్ట్రం గొప్ప, రాష్ట్రంలో తన జిల్లా గొప్ప, జిల్లాలో తన ఊరే గొప్ప. ఇలా తను ఎంతగానో పొంగి పోవడమే...

మతపరమైన మీటింగుకు వెళితే...తన మతం ప్రపంచానికి ఇచ్చిన సందేశం.... మానవాళికిచ్చిన వేదాంతం...తన మతంలో పుట్టిన గురువులు, పీఠాధిపతులు, ఇంకే మతంలోనూ ఉండరు. ఇలా అనుకుని పరవశించిపోతాడు. అర్ధనిమీలిత నేత్రాలతో తను మతం కోసం ప్రాణాలిచ్చేస్తాడు - ఓనాడు.. అంతే!

హరిహరరావులో మరో గొప్ప సుగుణం ఏంటంటే, అతన్ని ఏ విషయమైనా కొన్ని క్షణాలు మాత్రమే ఊపగలుగుతుంది. ఆ తర్వాత అతను కొన్ని క్షణాల్లో అతి మామూలు మనిషయి పోగలడు.

"అయ్యా! దేవర పిలుత్తాండాడు. రావల్లంట!" అంటూ తలారి పెన్నప్ప పిలుపుతో మాయలోంచి ఊడిపడ్డాడు హరిహరరావు. ఏమిటి అన్నట్టు చూశాడు పెన్నప్పవైపు.

"దేవర పిలుత్తాండాడు"

పెన్నప్ప పరిభాషలో 'దేవర' అంటే ' ఎమ్మార్వో' అని హరిహరరావుకి తెలుసు. ఆఫీసరు మాయ అయినా, ఆఫీసరు పిలుపు మాయ కాదుకదా అనిపించిందతనికి.

"అప్పుడే వచ్చినాడా ఎమ్మార్వో...వస్తున్నాని చెప్పు పెన్నప్పా!" అన్నాడు లేవకుండా మాయ సిగరెట్టును తాగుతూనే. సిగరెట్టును చివరి దాకా పీల్చి చెప్పు కాలితో నలిపేసి ఆఫీసుకు బయల్దేరాడు హరిహరరావు.

హరిహరరావుకు ముప్ఫయ్యేళ్ళ వయస్సుంటుంది. మనిషికాస్త లావుగా, ఎర్రగా, పొడుగ్గా ఉంటాడు. సాదాసీదాగా ఉండే చొక్కా, ప్యాంటూ వేసుకుంటాడు.

ఎండని తట్టుకునేందుకు కళ్ళకి అధునాతనమైన నల్ల కళ్లజోడు పెట్టుకుంటాడు. పై అధికార్లంటే ఎంతో నమ్రత, విధేయత చూపుతాడు. అందుకే అతన్ని జూనియర్ అసిస్టెంటు స్థాయినించి కూడా అధికారులు బాగా ఇష్టపడేవారు. మంచి సీట్లను కేటాయించేవారు. ఆఫీసుకొచ్చిన పార్టీలు ఎవ్వరైనా ఆఫీసరు కోసం అడగరు, హరిహరరావు కోసం వెదుకుతారు. కొత్తలో రెవెన్యూ శాఖలో ఉద్యోగం వచ్చినందుకు ఆనందం తాండవ మాడాడు. బాగా డబ్బును రెండు చేతులా సంపాదించవచ్చునని అనుకున్నాడు. అనుకున్నట్లుగానే డబ్బు సంపాదించాడు కూడా. ఈలోగా సీనియర్ అసిస్టెంటుగా ప్రమోషన్ రావడంతో, ఉద్యోగ బాధ్యతలతోపాటు పై సంపాదన కూడా పెరిగింది. దాంతో మూడు లక్షల కిమ్మత్తుగల ఇంటిప్లాటులూ, రెండు లక్షల కిమ్మత్తు గల ఇంటినీ కొనేశాడు. అయితే, అతనికా సంపాదన తక్కువేననిపించింది. వాణిజ్యశాఖ, రిజిస్ట్రేషన్, ఎక్సైజు శాఖలో జూనియర్ అసిస్టెంట్‌గా చేరేందుకు మార్గాన్ని ఏర్పరచు కున్నాడు. అరుదుగావచ్చే ప్రమోషనూ, సీనియారిటీని నష్టపోతావు అని మిత్రులు హితవు చెప్పారు. వినలేదు హరిహరరావు. తనకు సీనియారిటీ కంటే ప్రమోషను కంటే 'డబ్బే' ప్రధానం అని వాదించాడు. అయితే అతని కలలు ఫలించలేదు. సరిగ్గా అప్పుడే 'రెవెన్యూ ఇన్‌స్పెక్టరు' (కోర్సు) వచ్చిందతనికి. కర్నాటక లాటరీలో మొదటి బహుమతి తగిలినంత ఆనందపడిపోయి ఎక్సైజుకు ఎగనామం పెట్టి రెవిన్యూలోనే ఉండిపోయాడు.

మోటార్ బైక్‌లో ఆఫీసుకు చేరుకున్నాడు హరిహరరావు.

ఆఫీసులోకి అడుగుపెడుగుతున్నట్లే ఆఫీసంతటికీ కాఫీలు పట్టుకు రమ్మని తలారి పెన్నప్పకు డబ్బులిచ్చేసి ఎమ్మార్వోకి నమస్కరించి ఆయనకి ఎదురుగా ఉన్న కుర్చీలో కూచున్నాడు.

ఎమ్మార్వోని చూస్తే నక్క జ్ఞాపకానికి వస్తుంది హరిహరరావుకి. నక్కలు బట్టలు వేసుకోవు. అందులోనూ బ్రౌన్ రంగులో ఉన్న సఫారీ డ్రస్సు అస్సలు వేసుకోవు. గాజు ఫ్రేమ్ ఉన్న కళ్లజోడు పెట్టుకోవు. చక్కగా తల దువ్వుకోవు. కాని అతని కళ్ళు నక్క కళ్ళలా మిలమిలలాడుతూ ఉంటాయి. అతని ముక్కు నక్క ముక్కులా ముందుకుసాగి ఉంటుంది. అతని పళ్ళు నక్క పళ్ళలా ఉంటాయి. అతని చూపులు నక్క చూపుల్లా సూదుల్లా ఉంటాయి. అయినా అతను వేషభాషల వల్ల తను నక్క జాతికాదని భ్రమ కలిగించేటట్లుగా ఉంటాడు. అతని మాటలు నక్క ఊళలలా ఉండవు. పులి గాండ్రిపుల్లా ఉంటాయి. అతను నక్కలా ఉంటాడు. పులిలా గాండ్రిస్తాడు. అతను ఎప్పుడు ఇకిలిస్తాడో, ఎప్పుడు సకిలిస్తాడో, ఎప్పుడు గాండ్రిస్తాడో పామును మెళ్ళో వేసుకున్న శివుడికీ, పామ్మీద పదుకునే విష్ణుమూర్తికీ, విష్ణుమూర్తి బొడ్డులో మొలిచిన తామరపువ్వుమీద కూచున్న నాలుగు ముఖాలున్న బ్రహ్మదేవుడికీ తెలీదు.

అతని తలకి పైన గోడలకి దివంగత దేశనాయకులు గాంధీ, నెహ్రూ, రాజేంద్ర ప్రసాద్ పటాలున్నాయి. వాటివైపు నెలకోసారి కూడా చూడదతను. అవన్నీ ఇతరుల కోసం, తనకోసం ఎదురుగా ఉన్న గోడకి కలియుగదైవమని భక్తులు కీర్తించే

వెంకటేశ్వరుడి పటం మొదలుకొని షిరిడీ, సత్య సాయిబాబాల ఫోటోలు అరడజను ఉంటాయి. అవికాక టేబులుకున్న గాజు ఫలకం కింద దజను దేవతల ఫోటోలు పేర్చి ఉంటాయి. ఏ దేవుడి మీదా స్పష్టమైన భక్తి ఉన్నట్లు కనబడదు. ఏ క్షణంలో ఏ దేవుడు కాపాడతాడోనని పొద్దున్నే ఆఫీసు గదిలోకి వచ్చి తన ఉచితాసనాన్ని అలంకరించే లోపుగానే అన్నిటికీ ఒకే ఒక జనరల్ నమస్కార బాణాన్ని సంధించి వదులుతాడు. అతని భక్తి అంతా లక్ష్మీదేవి మీదనే. అందుకే ఆపటం స్టీలు ఫ్రేమ్‌లో టేబిలు మీద ఉంటుంది.

"నిన్న ఆర్డీవో ఆఫీసులో కాన్ఫరెన్సు జరిగింది హరిహరరావు!" అంటూనే కింగ్ సైజు సిగరెట్టు వెలిగించాడు ఎమ్మార్వో.

"సార్!" అన్నాడు 'అలాగా' అన్న అర్థం వచ్చేలా. అక్కడ ఏం జరిగింది అన్నట్లు మొహం పెట్టి చూశాడు ఆఫీసరు మొహంలోకి హరిహరరావు.

సిగరెట్టు పొగని అలా గాల్లోకి వదిలి, కాలింగ్ బెల్ నొక్కాడు ఎమ్మార్వో. అటెండరు వచ్చాడు. 'కాఫీలు పట్టుకురా! డబ్బులు పట్టూ!" అంటూ జేబులోంచి డబ్బు వెలికి తీస్తున్న ఫోజు ఇచ్చాడు. అట్లాంటి ఫోజులు అలవాటే హరిహరరావుకి. అందుకే నవ్వుకుంటాడు.

"అప్పుడే పెన్నప్పని కాఫీలకని పంపించినాను సార్! ఈ పాటికి వస్తుంటాడు" అన్నాడు.

"అట్లనా సరే......వెరీ గుడ్! కాన్ఫరెన్స్ గురించే కదా నేనిందాకా చెప్తూ ఉన్నింది"

"అవున్సార్!" అన్నాడు నవ్వుతూ హరహరరావు. ఎమ్మార్వో తీరుబడిగా నానుస్తూ 'కాన్ఫరెన్సు' అంటున్నాడు. అంటే ఏదో తన నెత్తిన బండ వేసే ఉద్దేశం ఉన్నట్లుగా మనసు కీడు శంకిస్తోంది. ఏ ఐదువందలో, వెయ్యో ఇవ్వమన్నారు అని అంటాడని ఊహిస్తున్నాడు హరహరరావు.

"దొంగనాకొడుకులప్పా! ఈ ఆర్డీవో ఆఫీసు నా కొడుకులూ. దొర యాడ ఉంటాడో, అంతా ఈ నా కొడుకులదే పెత్తనం. థూ థూ మనమిక్కడ ఉద్యోగాలు చేస్తున్నారనుకున్నాడా, కమీషను వ్యాపారాలు చేస్తున్నామనుకున్నాడా రాస్కెల్! బుద్ధిలేదు. ఆ సూపర్నెంటు గానికి."

ఆఫీసరు ఆర్డీవో ఆఫీసు సూపర్నెంటుని తిడుతున్నాడూ అంటే అది ఖచ్చితంగా తనకు బెల్టు వేసే ఉద్దేశమేనని అర్థమయిపోయింది హరిహరరావుకి. "దొరబిడ్డ పెండ్లంటప్పా" అన్నాడు సిగరెట్టు బూడిదని యాష్ట్రేలోకి రాలుస్తూ. ఎమ్మార్వో.

"అట్లనా సార్!"

"అట్లనా అంటావే.. ఆ సూపర్నెంటు ప్రతి ఎమ్మార్వోని పిలిచి అదే పనిగా చెప్పినాడప్పా! ఒక్కొక్క ఎమ్మార్వో మూడువేల రూపాయల ఇయ్యాలంట. ఒక్కోస్టాకు పాయింటు నుంచి సిఎస్‌డీటీ (సివిల్ సప్లయిస్ డిప్యూటీ తాసిల్దారు) ఒక్క వెయ్యి రూపాయలు, ఒక మూట బియ్యమూ, ఒకమూట చక్కెరా ఇయ్యాల్లంట. లెక్క వెయ్యి ఎంతయితాదో" అంటూనే సిగరెట్టును ఆత్రంగా పీల్చి గాల్లోకి ఊదాడు

ఎమ్మార్వో లెక్కవేస్తున్నట్లుగా కాసేపు గాల్లోకి చూసి – "అంటే ఈ డివిజనులో 25 మండలాలు కదా ఉండేది. స్టాకుపాయింట్లు దాదాపు 12 ఉన్నాయి. అంతా ఒక లకారానికి చేరుకుంటుంది. చెక్కరా, బియ్యం మూటలు అదనం అన్నమాట. ఇవికాక హెడ్ క్వార్టర్సులో ఎంత వసూలు చేస్తారో తెల్దు. యాదన్నా పాడయి పోనీలే గానీ, మనది మనం చూసుకుందాం. ఇప్పుడు మన వంతుకు మూడువేలు ఇయ్యాల్ల కదా! ముందు నీ వంతుకు ఎంత ఇస్తావో చెప్పూ!" అంటూ నవ్వాడు ఎమ్మార్వో – అచ్చు నక్కలా.

ప్రమాదాన్ని ముందుగా పసికట్టిన హరిహరరావు చెక్కు చెదరకుండా ఎమ్మార్వో కళ్ళల్లోకి చూస్తూ పెదాల మధ్య ఇరుకు నవ్వును బిగించి" మీరే చెప్పండి" అన్నట్లు తల నమ్రతగా ఆడించాడు.

"నాకు తెలుసు – నువ్వు చెప్పలేవు... నేనెంత చెప్తే అంతే.. నీలాంటి ఆర్ఐ ఈ అరవై మూడు మండలాల్లో ఎవరికీ లేడని నేను బల్లగుద్ది చెప్తానయ్యా!" ఆఫీసరు పొగుడుతుంటే అయిసు కావడం ప్రతి ఉద్యోగికీ ఉండే బలహీనతే. అదే ఆ సమయంలో హరిహరరావునీ ఆవహించింది.

పెన్నప్ప కాఫీ తెచ్చాడు. చక్కటి పింగాణీ కప్పులో సదరు కాఫీ ఎమ్మార్వోకీ, ఆర్ఐకీ సరఫరా అయింది.

"మంచి కాఫీనయ్యా. బాగుంది... నువ్వు తెప్పిస్తేనే కాఫీ ఇంత బావుండేది. హోటలు ఆంకాళమ్మ ఎన్నిరేషను కార్డులు చేసినావో, ఎన్ని హౌస్ సైటులు ఇప్పించావో, నాకైతే తెల్దుగాని, నీ నించీ ఆర్డరుపోతే చాలు. అతిచక్కటి, చిక్కటి కాఫీ పంపిస్తుంది" అంటూ తను వేసింది జోకే అని తెలియజెప్పేందుకు గల గల నవ్వాడు ఎమ్మార్వో.

"అదేం లేదు సార్!" అన్నాడు నవ్వుతూ హరిహరరావు. మెల్లగా కాఫీని చప్పరిస్తూ, బెల్టు దెబ్బ ఎంత మాత్రం పడుతుందా అని ఒకవైపు ఆలోచిస్తునే ఉన్నాడు.

"నువ్వు రెండు వేలు ఇయ్యావయ్యా! నేను వెయ్యేస్తే సరిపోతుంది. మూడు చెక్కుపోస్టులకు ఆరు మంది డీటీలు (డిప్యూటీ తహశీల్దారు) ఉన్నారు కదా – తలా వెయ్యి ఇయ్యమందాం. ఆఫీసు ఖర్చులకి అవే పడుంటాయి"

ఈమాట అంటూనే 'అమ్మా! నక్కనాయాలా! ఆఫీసు ఖర్చులకి ఆర్ఐ వుండగా ఆరువేలరూపాయలు ఇచ్చే మొగమేనానీది' అంటూ మనసులోనే గొణుక్కున్నాడు హరహరరావు.

మారు మాటాడకుండా – "అట్లే కానీయండి సార్!" అనేసి ఆలోచిస్తూ ఉన్నాడు. హరిహరరావు బుర్ర పాదరసంలా పనిచేయడం ప్రారంభించింది. తళుక్కుమని ఓ మెరుపు బుర్రలో మెరవడంతో శరీరంలో ఉత్సాహం పుంజుకుంది.

"మనకు నాలుగు రోజులు టైమిచ్చినారు. డబ్బు అడ్జస్టయినా, కాకున్నా, మనం అప్పు చేసైనా సరే మూడు వేలూ పంపిద్దాం. ఆతర్వాత కావల్సింటే వసూలు చేసుకుందాం! ఏమంటావ్?" అన్నాడు ఎమ్మార్వో – సూటిగా నక్క కళ్ళతో, నక్క చూపులు చూస్తూ.

"అట్లే, చేద్దాంలెండి సార్!" అంటూనే లేచి ఎమ్మార్వో గదిలోంచి బయటికి వచ్చేశాడు. అతనికి మహా ఉత్సాహంగా ఉంది. గంతులేద్దామా అనిపిస్తోంది. ఆహా దొర కూతురి పెళ్ళి, ఓహో దొర కూతురి పెళ్ళి, అందరితో అరిచి చెబుదామా అనిపిస్తోంది. ఆఫీసు స్టాఫు చూస్తారని మానుకున్నాడు.



హరిహరరావు అసలే అద్భుతమైన ప్రతిభాశాలి. ఎడారిలో పెడితే ఇసుకని కిలో ఇరవై రూపాయలు వంతున అక్కడి మనుషులకి అమ్మివేసే రకం. తివిరి ఇసుమున తైలము తీసే హరిహరరావుకు నువ్వులు ఇచ్చి నూనె తీసిపెట్టమనడం ఒక లెక్కా? నువ్వుల మంత్రం జపించాడు – 'దొరబిడ్డ పెండ్లి" అంటూ. ప్రతి హోల్‌సేల్ డీలర్నీ, ఎఫ్‌పీషాపు డీలర్నీ సందర్శించాడు. లెక్కల్ని చెక్ చేసి పారేస్తానన్నాడు. రిజిష్టర్లు సరిగా మెయింటైన్ చేయలేదని హూంకరించాడు. లైసెన్సు సస్పెండు చేసేందుకు రికమెండ్ చేసేస్తాన్నాడు. కిరాణా షాపుల వాళ్ళని అదిరించాడు. చక్కెర, బియ్యం స్టాకుకి కొన్న బిల్లుల్ని చూపించమన్నాడు. భారతదేశంలో అమ్మకం రూల్సన్నీ కాగితాలకే పరిమితమని వ్యాపారస్తులకీ తెలుసు. అందుకే సరుకులు కొన్నందుకూ, అమ్మినందుకూ రసీదులు పుచ్చుకోరూ, ఇవ్వరూ. ఈ బలహీనతపై కూడా డబ్బు చేసుకున్నాడు హరిహరరావు. "ఎవరయినా ఇదేం పనీ" అని అడిగితే. "ఈ పాపం నాది కాదు, 'దొరబిడ్డ పెళ్ళి' ఇందులో నాజేబులోకేం రాదు" అనేవాడు.

గడువు లోపలే ఎమ్మార్వోకి డబ్బు ఇచ్చేశాడు హరిహరరావు – తన జేబులో పదివేలు వేసుకుని.

('సరికొత్త కథ' – కథా సంకలనం – 24 సెప్టెంబర్, 1995)

# కౌజుపిట్టలు

మధ్యాహ్నం పన్నెండు గంటలయింది.

మండిపడుతోన్న ఆఫీసరులా ఉన్నాడు సూర్యుడు. ఆఫీసరు కోపంలా ఉంది ఎండ. ఆ కోపానికి ఆహుతయ్యే ఆఫీసు స్టాఫ్‌లా ఉంది లోకమంతా.

'ఎంత ఎండబ్బా!" అనుకున్నాడు ఆంజనేయులు. మరి కాసేపట్లో జేసీ (జాయింట్ కలెక్టరు) గారు ఆ బంగళాకి వస్తారు. అంచేత వెన్నులో అదురుగా, గుండెల్లో బెదురుగా, కాళ్ళల్లో వణుకుగానూ ఉంది ఆంజనేయులికి. అతనక్కడ 'ఆరై' (రెవెన్యూ ఇన్‌స్పెక్టర్) కాబట్టి, ఈ బంగళా దగ్గర 'ప్రోటోకాల్' అని గౌరవంగా ఆంగ్లంలో పిలువబడే 'కట్టుబానిస' పని చేస్తున్నాడు.

బ్రిటీషోడు కట్టించినందువల్ల ఆ బంగళా ఎప్పటినించో చెక్కు చెదరకుండా అధికార దర్పం సమసిపోని వృద్ధ మహారాజులా ఉంది. వృద్ధ మహారాజుని సదా రక్షించేందుకు అలర్టుగా నిలుచున్న యువ సైనికుల్లా ఉన్నాయి ఆ ఆవరణలోని వేప, రావి, చింతచెట్లు.

'అబ్బా! ఎంత ఉక్కగా ఉంది, ఒక్క ఆకయినా అల్లాడలేదు. గట్టిగానే అన్నాడు ఆంజనేయులు. గాలిని సరఫరా చేయడం చెట్టు ధర్మమైనట్టూ, సదరు ధర్మాన్ని పాటించకపోయినందువల్ల వాటివేపు చికాగ్గా కొత్త జడ్జిగారు పాత ముద్దాయిని చూసినట్టు ఓసారి వేపచెట్టునీ, దాని తాలూకు కొమ్మల్నీ, ఆకుల్నీ విడివిడిగా చూసేడతను.

వెట్లూ, తలార్లూ బంగళా వెనకాల పాత్రల్ని శుభ్రపరుస్తున్న శబ్దాలు వినిపిస్తున్నాయి...ఆంజనేయులికి.

బంగళా బయటి గదిలో జేసీ గారు వస్తూనే అతని నాలుకనీ, ముక్కు పుటాల్నీ, మనసునీ, తృప్తిపరిచే రకరకాలయిన శాఖాహార, మాంసాహార పదార్థాలు ఘుమఘుమ లాడుతోన్నాయి.

వరండా మెట్ల మీదనించీ లేచి వేపమాని కిందకి వచ్చి నిలుచున్నాడు ఆంజనేయులు. ఎడం చేత్తో కాలరుని మెడనించీ, ఎడంగా జరిపేడు గాలి తగలడం కోసం. అతను చెట్టుకింద ఉన్నాడే కానీ, అతని చూపులు మాత్రం గాల్లో ఉన్నాయి. అతని ఆలోచనలు మాత్రం పార్టీల చుట్టూ, ఆ పార్టీలు ఇవ్వాల్సిన డబ్బు చుట్టూ గింగుర్లు కొడుతున్నాయి.

వేపచెట్టు కొమ్మలో కాకీ, కాకిపిల్లా కావ్‌కావ్ మంటూ గోల చేయడంతో అతని ఆలోచనలు అప్పుడప్పుడు డిస్టర్బ్ అవుతున్నాయి.

"అమ్మా! అమ్మా! ఆకలిగా వుందే ఏమైనా పట్టుకు రావే!" అంటూ తల్లికాకిని పిల్లకాకి గోముగా అడుగుతోంది - సన్నటి కొమ్మమీదకి వాలి. అదలా అరుస్తోంటే దాని బుల్లిరెక్కలు గోముగా వణికిస్తోంటే, తల్లికాకి ముచ్చటగా చూస్తూ "ఉండవే నీ గోలొకటీ, ఏదయినా పురుగో పుట్రో కనిపించనీ.. నేలమీద ఒక కన్ను వేసి ఉంచాను లేవే... ఎండకదా ఒక్క పురుగూ వచ్చి చావడం లేదు" అంది మరో కొమ్మమీంచి.

"ఏమో నాకవన్నీ తెల్దు.. ఆకలే అమ్మా ఆకలే!" పిల్లకాకి గోల.

ఆంజనేయులు ఈ రెండింటి గోలనీ ఒక్క నిమిషంపాటు చూసి కోపం తెచ్చుకున్నవాడై. నేలనున్న గులకరాయి నొకదాన్ని తీసుకుని పిల్లకాకి మీదకి విసిరాడు. పిల్లకాకి గులకరాయ దెబ్బను తప్పించుకోడానికి ఆ కొమ్మమీది నుంచీ రివ్వున మరో కొమ్మమీదికి పోయింది. అయితే గోల చేయడం మాత్రం ఆపలేదు.

మరొక్క రాయి తీసుకుని మళ్ళీ విసరాలని అనిపించినా, తల్లికాకీ, పిల్లకాకీ కొమ్మలు దాటుతాయే కానీ చెట్లు దాటిపోవనే సత్యాన్ని గ్రహించినవాడై ఊరకుండి పోయనాడు ఆంజనేయు.

'అమ్మా! అమ్మా! ఇందాకా నాపై రాయి విసిరాడు చూడవే వాడిపైన రెట్ట వేస్తానే!" అంది పిల్లకాకి.

"అలాగే చెయ్యవే!, అదికూడా చెప్పాలా?" అంది తల్లికాకి.

తల్లి దగ్గర్నించీ పర్మిషన్ వస్తూనే ఆపనే చేసింది పిల్లకాకి.

రెట్ట నేరుగా వచ్చి ఆంజనేయులి తలమీద 'టప్' మని పడింది. పిల్లకాకివైపు చురచుర చూసి బండ బూతుల్ని మనసులోనే తిట్టుకుంటూ దగ్గర్లోనే ఉన్న చెత్త కాయితంతో తుడిచేసు కున్నాడు ఆంజనేయులు.

దూరంగా కారు వస్తున్నట్టు శబ్దమయితే రోడ్డు వైపు చూసేడు. అల్లంత దూరంలో తెల్లటి కారు శరవేగంతో దూసుకు వస్తున్నది.

ఆంజనుయులి గుండెలు దడదడలాడాయి. 'ఇంకా ఎమ్మార్వో రాకనే వచ్చేస్తున్నాడే జేసీ.. ఏం జేసేదబ్బా.. కానీలే ఏమయితే అదే అయింది' అనుకుని కారు వచ్చి ఆగుతూనే తను వినయ విధేయతలతో 'జేసీ' గారికి ఎలా నమస్కరించాలో ఒకసారి మెదడు తెరపై రిహార్సల్ చేసుకున్నాడు ఆంజనేయులు.

ఆ కారు జేసీ గారిది కానందువల్ల రోడ్డుపై తిన్నగా కుడివైపు నించీ ఎడమవైపుకి

'హమ్మయ్య!' అనుకున్నాడు ఆంజనేయులు. కాసాపురం ఆంజనేయులు స్వామికి ఓ దండం పెట్టుకున్నాడు.

పై అధికారులు వస్తున్నారంటే కింది ఉద్యోగులకు భయం ఉంటుందన్నది సహజమైన విషయమే. అయితే ఈసారి 'జేసీ' గారి రాక మాత్రం ఒక్క ఆర్లై ఎమ్మార్వోలనే కాదు. 'ఊరగాద్రి' పాత తాలూకాకి సంబంధించిన విడపగల్లూ, వజ్రాలపేట మండలాల అధికార్లనూ, ఆర్లైలనూ కూడా భయకంపితుల్ని చేస్తోంది. వాళ్ళంతా అంత భయ కంపితులు కావడానికి కొంత కారణం ఉంది.

సరిగ్గా ఆరు నెలల కిందట ఇలాగే జేసీగారి ప్రోగ్రాం ఉందని మూడు మండలాల ఎమ్మార్వోలూ, ఆరైలూ ఆయనకు ఏ లోటూ రాకుండా మర్యాదలు జరపడానికి భయభక్తులతో నిరీక్షిస్తూ ఉన్నారు. సరిగ్గా రెండు గంటలు అవుతున్నట్టే జేసీ గారు రానే వచ్చేరు. ఆకలిగా ఉన్నదంటూ అవురావురుమంటూ భోజనాలకి కూర్చున్నారు. అతనికి వడ్డించడానికి ముగ్గురు ఎమ్మార్వోలు జొరబడ్డారు. జేసీగారు చపాతీని నోట్లో పెట్టుకున్నారో లేదో మొహమంతా అదో మాదిరి పెట్టేసి - ఆంగ్లంలోనూ, తెలుగులోనూ, విడివిడిగానూ, కలిపీ తిట్టేసేడు. దాని సారాంశం ఏమిటంటే "ఇదసలు తిండేనేమండీ, ఏదో తిండికి మొహం వాచీ ఇట్లా క్యాంపులకి ఎగబడి వస్తున్నామనుకొన్నారా? ఈ జేసీ గాడి మొహానికి రుచులేం తెలీవులే - ఏది మొహాన కొట్టినా తిని చస్తాడులే అనుకున్నారా... లేకపోతే ఇది కోడికూరా? ఇది మటన్ ఫ్రయ్యా?...ఇధి పలావా? ఇది ఇట్లా చేస్తే ఇటు పక్కకి ఇంక రాడులే అనే దురుద్దేశం కనబడుతోంది నాకు!"

"సార్! సార్! అదేం లేదు సార్!...."అంటూనే చేతుల్ని పిసుక్కుంటూ మొహాలు దీనంగా పెట్టేస్తూ చెక్కబొమ్మల్లా ఉండిపోయినారు ముగ్గురు ఎమ్మార్వోలు.

"మీరు సరేనండీ, ఆరై ఏం చేసినట్టూ... చక్కగా రుచిగా వండించడం రాకపోతే ఆరైగా ఎట్లా పనికొస్తాడంట!" అని కోప్పడ్డాడు జేసీగారు.

ఆరై కోర్సులో పై అధికార్లకు గొప్ప రుచిగా వంటలు వండించడం కూడా ఒక భాగమని ఆ రోజు తెలిసి వచ్చింది ఆంజనేయులికి.

జేసీగారినుంచీ మెచ్చుకోళ్ళు రాకున్నా తిట్టకుంటే చాలుననీ, ఈసారి జేసీ గారికి ఏవేన్నా ఇష్టమో ఆయన అటెండర్నీ, డ్రైవర్నీ పదే పదే వేగుల వాళ్ళలా కనుకున్నాడు. జేసీగారి నాలిక్కి ఇష్టమైన కూర కౌజుపిట్టల ఫ్రైయ్యేనని తెలుసుకున్నాడు. అంతకు ముందు రోజే పచ్చనోట్లని రెండింటిని ఖర్చుపెట్టి డజను కౌజుపిట్టల్ని తెప్పించేడు. కౌజుపిట్టల్ని బాగా వండే వంట మనిషిచేత వండించేడు ఆంజనేయులు. ఈసారి తప్పకుండా తనని జేసీగారు మెచ్చేసుకుంటారని లోలోపల అతనికి భరోసా కూడా లేకపోలేదు.

బంగళాలో ఫోన్ రింగవుతోంది.

గబా గబా లోపలికి వెళ్ళి ఫోన్ ఎత్తేడు ఆంజనేయులు. ఫోన్‌లో ఎం.ఆర్.ఓ. గొంతు వినిపిస్తూనే అటెన్షన్లో నిలబడి వినయంగా అంతా వింటూ 'ఎస్ సార్, అలాగే సార్!' అంటూ ఉన్నాడు. రెండు నిమిషాల తరువాత ఫోన్‌పెట్టేసి మళ్ళీ వరండాలోకి వచ్చేడు. మరో అరగంటలో వచ్చే జేసీగారికోసం 'బీ రెడీ' అంటూ ఫోన్‌లో హెచ్చరించినందుకు ఎమ్మార్వో మీద కోపమొచ్చింది. కొత్తగా ఉద్యోగంలో చేరిన వాడికున్న అదురూ, వణుకూ రెవెన్యూ వాళ్లకి రిటైరయ్యే వరకూ పోదేమో అనుకున్నాడు.

ఐదు నిమిషాల తరువాత మూడుమండలాల ఎమ్మార్వోలూ, తమ తమ హెడ్‌క్లర్కులూ, ఆరైలతో పాటూ అక్కడికి చేరుకున్నారు. వరండాలో ఉన్న కుర్చీలల్లో ఎమ్మార్వోలు మాత్రం ఆసీనులయ్యారు. తక్కిన వాళ్ళు నిలబడే ఉన్నారు.

"ఈసారి జేసీగారు అయిసు కావాల్సిందే.... చూడండి ఎట్లా వస్తున్నాయో మసాలా వాసనలు.. ఇప్పటికప్పుడే వాట్ని నమిలి మింగేద్దామా అనిపిస్తోంది!!' అన్నాడు (ఉరగాద్రి) ఎమ్మార్వో.

"అవునవును నోరూరుతా వుంది. మరి జేసీగారి టేస్టు ఎట్లుందో!' విడపగల్లు ఎమ్మార్వో.

"ఈసారి నోరెత్తకూడదు అన్నట్లున్నాయి ఐటెమ్స్" అన్నాడు వజ్రాలపేట ఎమ్మార్వో, ఆంజనేయులి వేపు చూస్తూ.

ఆంజనేయులికి, ఎమ్మార్వోల మాటలు వింటూంటే నవ్వు వస్తోంది జేసీగారు వస్తోంది కేవలం 'తిండికోసమే' అన్నట్టుగా ఉన్నాయి.

"ఇంతకీ జేసీగారు వస్తున్నది ఇంటి స్థలం తకరారు కేసు ఎంక్వయరీకేనా" అన్నాడు విడపగల్లు ఎమ్మార్వో.

'అదే - బళ్ళారి నారాయణప్ప ఇంటి స్థలం కేసు... అదేం తెగేదా తెల్లారేదా!' ఈ జేసీ మనిషి ఎన్నిసార్లు రావాలో" అన్నాడు ఉరగాద్రి ఎమ్మార్వో.

"ఎంతమంది జేసీలు మారేరో అది చెప్పండి సార్!" అన్నాడు వజ్రాలపేట ఎమ్మార్వో.

"సార్! తెల్లకారు వస్తోంది...ఇట్లే మన బంగళా వైపు తిరిగింది సార్!" అనరిచాడు ఆంజనేయులు. 'సార్ బాంబు.. మన మీదికే పడ్తోంది' అన్నట్టుగా ఉంది అతని గొంతు.

అప్పుడే బాంబు పేలినట్లుగా అదిరిపడి ముగ్గురూ కంగారుగా లేచి నిలుచున్నారు.

'జేసీ'గారి కారు వచ్చి ఆగింది. కారులోంచి తెల్లవన్నె పులిలా దిగారు జేసీ తెల్లని సఫారీ డ్రెస్‌లో...పులులు నవ్వవు. అందుకే తెల్లపులి నవ్వలేదు. అయితే పులులకు లేని ప్రత్యేకతలు మరికొన్ని వున్నాయి - తెల్లపులికి, కళ్ళకి గోల్డు ఫ్రేమున్న చిన్న అద్దాలు స్టైయిలుగా వున్నాయి. చేతికి ఖరీదయిన బంగారు వాచీ ఉండి, మెళ్ళో బంగారు గొలుసుంది. ఎడమ చేతి ఉంగరంవేలికి పగడమో, పచ్చో పొదిగిన బంగారు ఉంగరం ఉంది.

చక్రవర్తి దిగినప్పుడు సామంత రాజులా వణికిపోయేరు ముగ్గురు ఎమ్మార్వోలూ... సామంత రాజుల కిందున్న కట్టుబానిసల్లా వణికిపోయేరు ఆర్రైలూ, హెడ్డు గుమస్తాలూ. సాష్టాంగ ప్రణామాలు చేయడం ఎందుచేతనో మన సాంప్రదాయంలోంచి తొలగి పోయింది కాబట్టి, చక్రవర్తి గారిలా కారుదిగి వున్న జేసీగారికి సామంతరాజులు వినయంగానూ, కట్టుబానిసలు వీపు భాగాన్ని కొంత ముందుకు వంచి సవినయంగానూ నమస్కరించేరు. సదరు నమస్కారాలు తన స్థాయిని పెంచేవిగా ఉన్నట్లు జేసీగారు గ్రహించినందువల్ల, సామంతరాజుల్నీ, కట్టుబానిసల్నీ ఓసారి సంపూర గంభీర వదనంతో పరకాయించి శిరఃకంపనంతో వాళ్ళ నమస్కారాల్ని అన్నింటినీ స్వీకరించినట్లు తెలిపి హుందాగా అడుగులువేస్తూ బంగళాలోకి సాగిపోయేరు. చక్రవర్తిని అనుసరిస్తూ సామంతరాజులూ, కట్టు బానిసలూ...

సింహాసనం మీద ఆసీనుడైనట్టు చక్రవర్తిగారు సోఫాలాంటి కుషన్ కుర్చీలో హుందాగా కూచున్నారు. మరింత హుందాకోసం కాలిమీద కాలు వేసుకున్నారు. తక్కిన కుర్చీల్లో కూచోవడమా? మానడమా? అన్న సందేహంతో బొమ్మల్లా ఉండిపోయారు ముగ్గురు ఎమ్మార్వోలు. అయితే బానిసలకు సందేహాలు వస్తాయేమో కాని కట్టుబానిసలకు సందేహాలు ఉండవు. అంచేత వినయంగా 'సదా మీ సేవలో' అన్న భావం వచ్చే మొహాలు వేసుకుని వున్నారు హెడ్‌గుమస్తాలూ, ఆర్టైలూ.

ఈలోగా ఆంజనేయులు ఉరఫ్ కట్టుబానిస కొబ్బరి బొండంతో ప్రత్యక్షమై సవినయం ఏ మాత్రం సమసిపోకుండా భయం భయంగా దళితుడు అగ్రవర్ణస్తుడికి ఇస్తున్న చందంగా ఇవ్వగా... జేసీగారు హుందాగా చేతుల్ని చాచి అది హుందాగా అందుకుని ప్లాస్టిక్ గొట్టాన్ని నోట్లోపెట్టుకుని ఓసారి పీల్చి అందరివైపు చూసేడు. జేసీగారి చూపుల్ని ఎట్లా అర్థం చేసుకోవాలో తెలీక అక్కణ్ణించీ కదల్లేకా, మెదలలేకా నానా అవస్థలు పడుతున్నారు ముందు వరుసలో నిలుచున్న ఎమ్మార్వోలు. జేసీగారు మరో రెండు గుటకలు వేసి 'మీరు తీసుకోలేదేం?' అన్నారు.

'అ'బ్బే, తీసుకుంటాం సార్ – మీరు కానియ్యండి" అన్నారు ముగ్గురు ఎమ్మార్వోలు ముక్తకంఠంతో.

"ఊ... సరేగాని మీమీమండలాల్లో ల్యాండ్ రెవెన్యూ ఏమాత్రం... కలెక్షన్ బాగానే అవుతోందా... ఏవీ ల్యాండ్ రెవెన్యూ స్టేట్‌మెంట్స్? సివిల్ సప్లయిస్ విషయంలో ఏమైనా ప్రాబ్లెమ్సా – కిరోసిన్ ఈనెల్లో బాగానే బట్వాడా అయిందా?" ఇలా ప్రశ్నల వర్షం కురిపిస్తున్నారు జేసీగారు.

'యస్సార్, యస్సార్' అంటూ రెడీగా ఉంచుకున్న ల్యాండ్ రెవెన్యూ స్టేట్‌మెంట్స్యూ ముగ్గురూ పాడ్స్‌నించీ తీసి ఇచ్చారు.

"బైదిబై" ఈ రోజు బాగా ఎండగా ఉంది కదూ.. హౌస్ సైటు ఎంక్రోచ్‌మెంటు గొడవ ఎంక్వయిరీ చేయాలి....ఆకలిగా ఉంది...ఎంక్వయిరీకి సాయంత్రం ఐదింటికి వెళ్దాం...ఫుడ్ రెడీగా ఉందా?' అన్నారు జేసీగారు.

చక్రవర్తి గారు 'ఆకలి' అంటే, సామంతరాజులు, వారి పరివారమంతా ఎంత అల్లాడిపోవాలో అంత అల్లాడిపోయారు ముగ్గురు ఎమ్మార్వోలూ, వారిస్టాఫూ. ఘుమఘుమ లాడుతోన్న వంటల్ని రెండు నిమిషాల్లో డైనింగ్ టేబుల్ మీద సర్దారు.

భోజనం చేయడానికి జేసీగారు రెడీ అయినారు.

జేసీగారి క్యాంపు క్లర్కు పక్కన ఉన్న చిన్న గదిలో తినడం ప్రారంభించేదు.

ఆర్టై ఆంజనేయులూ, అర్బన్ ఎమ్మార్వో జేసీగారికి దగ్గరుండి మరీ వడ్డిస్తున్నారు.

"ఓహ్!వెరీనైస్ ఐటెమ్స్...చాలా టేస్టీగా వున్నాయి. వెరీగుడ్!' అంటూ జేసీగారంటూ ఉంటే ఏనుగును ఎక్కినంత ఆనందంగా ఉంది. అర్బన్ (ఉరగాద్రి) ఎమ్మార్వోకు. మెచ్చుకోలుగా ఆర్టైని చూసేడు ఎమ్మార్వో. ఆర్టై గుండెలు బెత్తెడు మందంపొంగి అలా ఉండిపోయేయి.

"ఫిష్ ఫ్రై భలే ఉంది, చికెన్ రోస్ట్ అమోఘం, మటన్ కబాబ్ అద్భుతం... అయితే కౌజుపిట్టల ఫ్రై ముందు ఏదీ పనికి రాదు. అంత పరమాద్భుతంగా ఉంది. నా

జీవితంలో ఇంత రుచికరమైన భోజనం 'ఇప్పుడే చేశాను' అన్నారు జేసీ. పరమానంద భరితుడైనాడు ఎమ్మార్వో. కరిగి నీరయాడు. పరవశిస్తూ వీలుంటే ఆనంద తాండవం చేయడానికి సిద్ధపడ్డాడు ఆర్రై ఆంజనేయులు.

జేసీగారి భోజనం ముగిసింది.

"కిళ్ళీ వేసుకుని కింగ్ సైజ్ సిగరెట్లు వెలిగించేరు జేసీగారు. "ఈ జిల్లాలోని 63 మండలాల్లోనూ తినని ఇంత మంచి భోజనం ఈపూట తిన్నాను... మిమ్మల్ని హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను" అంటూ మరోసారి మెచ్చుకున్నారు.

"థ్యాంక్స్ సార్!" అంటూ ఎమ్మార్వో అన్నాడు.

'అసలు.... ఆ కౌజు పిట్ల ఫ్రై ఎంత బావుందండీ! వాటి రుచి మరి దేనికి రాదు. మీకు ఇష్టమనే మా ఆర్రై కౌజుపిట్టల ఫ్రై చేయించాడు సార్!" అన్నాడు ఎమ్మార్వో సంతోషంగా.

'నిజంగా... వెరీ గుడ్... ఇక్కడ కౌజుపిట్టలు బాగానే దొరుకుతున్నాయా?"

"యస్సార్?" అన్నాడు ఎమ్మార్వో నమ్రతగా.

"చేలల్లో ఎక్కువగా ఉంటాయి లెండి. వాటిని తింటుంటే నా చిన్నతనంలో మాపల్లె జ్ఞాపకానికి వచ్చింది. మా నానమ్మ జ్ఞాపకానికి వచ్చింది. ఆమె నా కోసం వండే కౌజు పిట్టల కూర జ్ఞాపకం వచ్చింది. ఎంత కమ్మగా వండేదో మానానమ్మ! నిజానికి మీకు థ్యాంక్స్ చెప్పాలి."

అహో.. ఆనందమో... ఆనందం, బ్రహ్మానందం.. పరమానందం.. పై అధికారి మెచ్చుకోలు మహదానందం...

ఎమ్మార్వో, ఆర్రై మొహాలు విరిసిన పొద్దు తిరుగుడుపువ్వులైనాయి.

"సీ మిస్టర్ ఎమ్మార్వో.. ఓ పని చేస్తారా...ప్రతి శనివారం సాయంత్రం నా బంగళాకి మూడు జతల కౌజుపిట్టల్ని - అంటే ఆరింటినీ పంపించండి. అదీ మీకు ఇబ్బంది అనిపించకపోతేనే.....అంటూ ఎమ్మార్వో మొహంలోకి చూశారు జేసీగారు.

"అబ్బే తమ కోసం.. తమరు అడిగితే... తప్పకుండా పంపిస్తాం సార్! మీరు అడగడమే మహాభాగ్యం. మా ఆర్రై ఆంజనేయులు మీ బంగళాకి ప్రతి శనివారం కౌజుపిట్టల్ని అందజేస్తాడు."

అందాక అలవోగ్గా వింటూ ఆనందిస్తున్న ఆంజనేయులు పై ప్రాణాలు పైన్నే పోయాయి. ఈ రోజు వండిన కౌజుపిట్టల కోసమే రెండు పచ్చనోట్లు ఖర్చుపెట్టిన వైనం కళ్ళ ముందు తిరుగుతోంది. వరండాలోకి వచ్చి కూలబడ్డాడు. అతనికి మరేమీ వినిపించడం లేదు.

(ఆదివారం ఆంధ్రజ్యోతి - 21 జనవరి, 1996)

# ఎందెందు వెదకి చూసిన....

'ప్రపంచంలో మనకి ఎన్నో విషయాలు తెలుసనే అజ్ఞానంలో బతుకుతూ ఉంటాం. నల్లనివన్నీ నీళ్లనీ, తెల్లనివన్నీ పాలనీ, పచ్చనిదంతా పసరనీ, ఎర్రనిదంతా మందనే భ్రాంతిలో బతుకుతుంటాం.' అన్న విషయం ఎప్పుడు తెలుస్తుంది మనకీ?

ఎప్పుడంటే - మా సుబ్రహ్మణ్యం మామలాంటి వాళ్లని చూసినపుడు.

అవున్నిజం!!!

అప్పుడు తెలుస్తుంది మరి!

నీళ్ళకీ, పాలకీ, పసరుకీ, మందుకీ ఉన్న వ్యత్యాసం....

ఏరంగులో ఏవి వున్నా, వాటికి ఆ రంగులు ఎట్లా వచ్చినాయో ఆ రంగులో అవి లేకుండా ఎట్లా పొందవచ్చునో కూడా చెబుతాడు సుబ్రమణ్యం మామ. నా చిన్నప్పటినుంచే ఆయన పరిచయమయి వుంటేనా ఇట్లా కలెక్టరాఫీసులో గుమస్తాగా ఎందుకుందునూ, చక్కగా ఈ పాటికి ఏ ఫిలాసఫీ ప్రొఫెసరునో, ఐ.ఏ.ఎస్. ఆఫీసరునో అయివుండేవాడిని.

నిజం - నాకు సుబ్రమణ్యం మామ పరిచయమైనాక ఆయనతో గడిపిన ఆ రెండురోజులూ, అబ్బో, ఎన్ని విషయాలు తెలుసుకున్నానో!

ఆయన నాకు స్వంత మామ ఏమీ కాదు. మాఆవిడ వాళ్ళమ్మకీ, అంటే మా అత్తగారికి వేలువిడిచిన మేనమామ కొడుకు.

సంవత్సరం క్రితం మా మరదలి పెళ్ళిలో ఉదయం తలంబ్రాలు అవగానే భోజనాలు చేస్తున్నప్పుడు, నా పక్కన ఏభై ఏళ్ళ బట్టతల మనిషి కూచుని తన పక్కనున్న మనిషితో అమెరికా ప్రపంచ పోలీసుగా ఎట్లా వ్యవహరిస్తూ ఉన్నదో చెబుతున్నాడు. ఆయనెవరో మంచి సరుకున్న మనిషే అనుకున్నాను. పందిరి కింద తాంబూలాలు నములుతూ ఉంటే మా ఆవిడ వచ్చింది. "ఏమండీ, మా సుబ్రమణ్యం చిన్నాన్న మీకు పరిచయం లేదా?" అంది. నేను నవ్వుతూ ఆయనతో కరచాలనం చేస్తూ" లేదు కానీ, ఇందాక భోజనాల దగ్గర ఆయన మాటలు పరిచయమయ్యాయి" అన్నాను మా ఆవిడతో. ఆ తర్వాత మాఇద్దరకీ మాటా మాటా కలిశాయి. మా అత్తగారి ఇంట్లో రెండు రోజుల పాటూ ఒకే గదిలో సెటిలయిపోయాం. ఆయన మాటలు - నిజంగా చాలా ఆకట్టుకున్నాయి నన్ను.

ఆ రాత్రికి పక్కలు వేసుకుని మంచాలపై ఎదురెదురుగా కూచున్నాం-సిగరెట్లు తాగుతూ.

ఉన్నట్లుండి "అవినీతి అంటే ఏమిటి?" అని ప్రశ్నించాడు సుబ్రమణ్యం మామ.

ఆయన అడిగే తీరుకు వెంటనే సమాధానం చెప్పాలంటే నాకు కొంచెం జంకుగానే అనిపించింది. అసలు ఆయన అడుగుతోంది. 'అవినీతి' కి అర్థమా? లేకుంటే నిర్వచనమా? అని కాసేపు తటపటాయించి సిగరెట్టు సీరియస్‌గా తాగుతూనే అయోమయంగా చూశాను నేను.

అయితే నా అదృష్టం కొద్దీ పెద్దగా నన్ను ఇబ్బంది పెట్టకుండానే ఆయనే చెప్పనారంభించాడు.

"అవినీతంటే లంచగొండితనం. అవునా?" అనేసి నా వైపు రెప్పవేయకుండానే చూశాడు.

నేను 'అవును' అని తలాడించానే అనుకోండి. ఆయన'కాదు' అనేగలడని నాకు తెలుసు. పొద్దున్నించీ ఆయన ధోరణి నాకు బాగా అర్థమైపోయింది. అందుకే నేను "ఊఁ" అన్లేదూ, "ఊహూఁ"అన్లేదు. ఆయన వైపు సీరియస్‌గా చూస్తూ సిగరెట్టుని గుప్పుగుప్పుమని లాగాన్నేను. ఆయన మాత్రం సిగరెట్టుని చివరి పీల్పుపీల్చి యాష్‌ట్రేలో దాన్ని నలిపేసి, నువ్వు అవునన్నా నేను ఒప్పుకోను పరమేశం!"అన్నాడు నవ్వుతూ.

హమ్మయ్య బతికిపోయినాను. నేను 'అవును' అనుంటే, అతని దృష్టిలో దద్దమ్మనై పోయి వుండేవాడిని.

"అవినీతంటే నీకే కాదు చాలామంది దృష్టిలో లంచగొండితనమే - యాభై రూపాయల లంచం తీసుకున్న గుమస్తానీ వంద రూపాయల లంచం తీసుకున్న డాక్టర్నీ ఏ.సి.బి. వాళ్ళు వలవేసి మరీ పట్టుకుంటున్నట్టు మనం అప్పుడప్పుడు పేపర్లో చదివేస్తుంటాం. అందుకే అవినీతి అంటూనే అందరికీ లంచమే గుర్తుకు వస్తుంటుంది. అయితే అవినీతి అన్నది ఒక్క ఉద్యోగుల విషయంలోనే ఉండదయ్యా. నీతి బాహ్యంగా చేసే ప్రతిపనీ అవినీతేనని నా నిర్వచనం." అంటూ సుబ్రమణ్యం మామ మానవాళికి కొత్త సత్యాన్ని కనిపెట్టిన ప్రవక్తలా నవ్వుతూ చూశాడు నా వైపు.

"అంటే?" అన్నాను మరింత అయోమయంలో.

అంటే గింటే ఏముంది. నువ్వు సినిమా టికెట్ల కోసం క్యూలో నిలుచుని ఉంటావు. టికెట్లు దొరకవేమోనని బ్లాకులో కొంటావు. మరి అది అవినీతే! అట్లా కాకుండా ఆ క్యూలో నీకంటే పదిమంది ముందునిలుచున్న మిత్రుని ద్వారా టికెట్లు పొందాలని చూస్తావు. అది మరి అవినీతే! ఏమంటావు? నువ్వు బుద్ధిగా క్యూలో నిలబడి నీ వంతు టిక్కెట్టు న్యాయంగా పొందటమే నీతి. ఇదో చిన్న ఉదాహరణ మాత్రమే. దీన్ని బియ్యం, గోధుమ, కిరోసిన్‌లాంటి నిత్యావసర వస్తువుల్నీ పొందడంలో కూడా అప్లయ్ చేసుకోవచ్చు. ఇంకో ఉదాహరణ ఇస్తానబ్బాయ్! నీకు మరింత బాగా అవగాహన అవడం కోసం - నువ్వు మెడికల్ షాపుకి వెళతావు. అక్కడ నూరు రూపాయల మందులు కొంటావు. డబ్బిచ్చేసి మందుల్ని చక్కగా ఇంటికి తెచ్చుకుంటావు" అంటూ చెబుతున్నాడు ఆయన.

"ఇదేం ఉదాహరణరా బాబూ! డబ్బులిచ్చిమందుల్ని ఇంటికి తెచ్చుకోక ఎక్కడైనా పారేసి వస్తామా?" అని నాలో నేను గొణుక్కుంటూ ఉండగానే-

"అక్కడే ఉంది పరమేశం అవినీతి" అన్నాడు మరో సిగరెట్ అంటించుకుని వింతగా నావైపు చూస్తూ.

మళ్ళీ ఎక్కడో ఫిటింగ్ పెట్టేస్తున్నాడు, అనుకున్నా.

"ఎస్, అక్కడ ఉంది - మెడికల్ షాపులో మందులు అమ్మిన షాపు వాడు బిల్లు అన్నది ఎవరికైనా ఇస్తాడా?" అంటూ మిర్రి మిర్రి చూశాడు నావైపు.

"ఇవ్వడు" అన్నాను ఖచ్చితంగా.

"ఎందుకివ్వడు?" అంటూ ప్రశ్నించాడతను.

"ఏమంత అవసరం?"అంటూ ఎదురు ప్రశ్న వేశాన్నేను.

"అక్కడే వేశావు పప్పులో కాలు. మెడికల్ షాపు వాడు నీకు బిల్లు ఇవ్వలేదూ అంటే ప్రభుత్వానికి కట్టవలసిన పన్నుని ప్రత్యక్షంగా ఎగ్గొట్టేస్తున్నాడన్నమాట! మరి అది అవినీతే! నువ్వా బిల్లుని అడిగి తీసుకోలేదంటే నిస్సందేహంగా నువ్వా అవినీతికి పాల్పడ్డట్టేనన్నమాట! ఇది ఒట్టి అవినీతే కాదు దేశద్రోహం కింద లెక్క వేయవచ్చును. అవును మరి దేశ ఆర్థికస్థితిని కుంటుపడేట్టు చేయడంలో నీ వంతు కృషికూడా వున్నదన్న మాట. తెలుసునా? ఇట్లానే కిరాణా కొట్టువాడు మొదలుకొని బంగారుషాపు వరకూ ఎవరూ బిల్లులు ఇవ్వరు. కొనేవాడు ఎవ్వడూ బిల్లులు ఇచ్చితీరాలని డిమాండ్ చేయరు. ఇలా ప్రతి మనిషీ అనునిత్యం తన శక్తి మేరకు అవినీతికి పాల్పడుతుంటే దేశమేగతి బాగుపడుతుంది పరమేశం!" అంటూ నవ్వుతూ చూశాడు.

ఆయనలా చెబుతూ ఉంటే శ్రీకృష్ణుడు గీతోపదేశం చేస్తూ వుంటే వింటున్న అర్జునుడిలా మోస్ట్ ఒబీడియంట్‌గా చూస్తున్నాను, సుబ్రమణ్యం మామని.

ఆ మరుసటి రోజు ఉదయం పళ్ళు తోముకుంటూ వరండాలో నిలుచుని వీధిలోకి చూస్తూ వున్నాను.

"చూశావా! పరమేశం! ఆ ఇంటివాడి కక్కుర్తి" అంటూ ఎదురింటివైపు చూపించాడు సుబ్రమణ్యం మామ. పళ్ళు తోముతున్న బ్రష్షుని జండా కొయ్యలా ఎత్తి పట్టుకుని.

ఎదురింటివైపు చూశాను.

ఆ కక్కుర్తి పడ్డ ఇంటాయన కనిపించలేదు. పోనీ ఆ ఇంటికున్న అవకరమేమీ కనిపించనూ లేదు. పైగా ఆ ఇల్లు చక్కగా గులాబిరంగులో చూడముచ్చటగా ఉంది. నగిషీలు చెక్కిన వాకిళ్ళు నిగనిగలాడుతూ ఉన్నాయి. కాసింత స్థలంలో కూడా ఎంతో ఆకర్షణీయంగా కట్టవచ్చునని రుజువు చేసినట్లుంది. ముచ్చటయిన చిన్న కాంపౌండ్ కూడా ఉంది ఆ ఇంటికి.

"ఆ ఇంటాయన పడ్డ కక్కుర్తి కనపబడలేదేం పరమేశం!" అంటూ మళ్ళీ అడిగాడు సుబ్రమణ్యం మామ.

"లేదు మామా!" అన్నాను ఆయన మొహంలోకి చూసి, నా బేలతనం ఒప్పుకోలేక.

సుబ్రమణ్యం మామ చెప్పనారంభించాడు - "ఆ ఇంటిహద్దు మునిసిపాలిటీ మురికి కాలువ అవతలే - అవునా....కానీ ఆయన ఆ మురికి కాలువ మీదే చిన్న కాంపౌండ్ కట్టాడు చూడు - అది వాడి అబ్బగంటా? ఇంకా అటువైపు చూడు. ఆ ఇంటికి పక్కనే టాయిలెట్ రూం వుంది, అవునా దాని 'పిట్' ఎక్కడ పెట్టాడో చూడు మునిసిపల్ స్థలంలో... అది ఎంత తప్పో చూసినావా? దాని పక్కనే పబ్లిక్ బోర్‌వెల్ ఉంది కదా. దాన్లోకి ఆ దరిద్రపు నీళ్ళు కలిసి నీటిని అశుభ్రంగా మార్చవూ? పదిమంది వాడే నీళ్ళు కదా అవి. ఇదయ్యా అవినీతికి పరాకాష్ఠ అంటే! ఇలాంటి దేశద్రోహుల్ని తుపాకీతో షూట్ చేయాల!" అంటూ ఉద్రేకంతో ఊగిపోయినాడు కూడా.

సుబ్రమణ్యం మామ ఆ మధ్యాహ్నం ఊరికి బయల్దేరి వెళ్తూ కర్నూలుకు వచ్చే సెలవుల్లో మీరు తప్పక రావా'లని నాకూ, మా ఆవిడకీ పదేపదే చెప్పి వెళ్ళిపోయినాడు.

ఆయన వెళ్ళిపోయినాక ఆయన మాటలన్నీ మా ఆవిడకి చెప్పాను.

ఆవిడ నాలాగా ఆశ్చర్యపోలేదు. నవ్వి ఊరుకుంది. మీ ఆడవాళ్ళకి దేనికి ఆశ్చర్యపోవాలో దేనికి పోకూడదో తెలీదు. ఒక వందేళ్ళు వెనుకబడి వుంటారు" అన్నాను కసిగా.

"అవునవును, మీ మాదిరి ప్రతి చిన్నదానికి ఎక్కడ చలించిపోయేది లెండి" అంది మరోమారు నవ్వుతూ.

ఇంతకీ సుబ్రమణ్యం మామని గురించి ఎందుకు చెబుతున్నానంటే -

రెండురోజుల క్రితం - వేసవి సెలవులకి కర్నూలుకి రావలసిందిగా కోరుతూ ఉత్తరం రాశాడు ఆయన. "వచ్చే సోమవారం మెయిన్ బజారులో ఉన్న మా బాలాజీ ఎలక్ట్రికల్ షాపులో ఉదయం పది గంటలనుంచీ మీ కోసం ఎదురు చూస్తూ వుంటాను" అని కూడా రాశాడు.

కర్నూలుకి వెళ్ళి తీరాలని మా పిల్లలూ, మా ఆవిడా పట్టుబద్దంతో బయల్దేరక తప్పింది కాదు.

కర్నూలులో బస్సు దిగగానే ఆటోలో సుబ్రమణ్యం మామ షాపు చేరుకున్నాం. అప్పుడాయన అక్కడ లేదు. తొందరగానే వస్తాడని చెప్పాడు సేల్స్‌మేన్. మధ్యాహ్నం అయినందువల్ల షాపు అంతరద్దీగా లేదు. అప్పుడొకరు, అప్పుడొకరు వచ్చి ఏ బల్బో, ఏ టూ పిన్ ప్లగ్గో, ఏ స్విచ్‌బోర్డో, ఏ సిల్క్ వైరో కొనుక్కుని పోతున్నారు. ఎదురుగా హోటల్లోంచి మా పిల్లలకి ఐస్ క్రీం తెచ్చి ఇచ్చాను. ఆనందంగా తింటున్నారు వాళ్ళు. మా ఆవిడా, నేను ఏదో పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నాం. అరగంట తర్వాత సుబ్రమణ్యం మామ వచ్చాడు. మమ్మల్ని, పిల్లల్నీ సంతోషంగా పలకరించాడు. వెంటనే ఆటోలో, ఇంటికి తీసికెళ్ళాడు. ఆయన భార్య అప్పటికే మాకు భోజనాలు సిద్ధంచేసి ఉంచింది. కాబట్టి వెంటనే మా ఆకలి మంటల్ని చల్లార్చేశాం. రాత్రి భోజనాలు అయినాక మేడమీద గదిలోకి చేరుకున్నాం. అప్పటికే మాకు పక్కలు రెడీగా ఉన్నాయి. మా పిల్లలు అలసిపోయేరేమో వెంటనే నిద్రకుపక్రమించారు. మేమిద్దరం తాంబూలాలు నములుతూ మేడ వరండా చివర్లో కూచున్నాం. వీధి దీపాల వెలుతుర్లో రోడ్లనీ, జన సంచారాన్నీ చూస్తూ.

"ఏమండీ! సుబ్రమణ్యం చిన్నాన్న వాళ్ళ షాపులో కూచున్నప్పుడు అక్కడ మీరు ఒక విషయాన్ని గమనించి ఉండాలి" అంది మా ఆవిడ.

"ఏ విషయమే" అన్నాను పరధ్యానంగా.

"ఆయన షాపులో కూడా ఏ కస్టమర్‌కీ బిల్లులు ఇవ్వడం లేదు. అంటే ఆయన కూడా అవినీతికి దూరం కాదన్నమాట." అంది.

"అట్లానా, నేను గమనించలేదు!" అన్నాడు.

"అంతే మీరు - ఆడవాళ్ళకి తెలివితేటలు వుండవనీ ఎద్దేవా చేయడమైతే చేస్తారు గానీ, అసలు మీ మగవాళ్లని అనాలి. పైకి చెప్పేదొకటి, చేసేదొకటి" అందావిడ.

"ఇదేమిటే నీ దాడి ఉన్నట్టుండీ!" అన్నాను.

"దాడి కాదండీ, నిజానిజాలు! ఎందెందు వెదకిచూసిన అందందే కలదు అవినీతి- చూడగలిగితే..." అంటూ బమ్మెర పోతన పద్యానికి పేరడీ చేస్తూ నవ్వింది. "అవునూ, ఈ పేరడీ లేమిటే - నీ విపరీతమైన తెలివితేటలతో నన్ను మూర్ఛ పోగొట్టాలని ప్రయత్నమా?" అన్నాన్నేను కంగారుగా.

ఆవిడ తాంబూలం నోటితో ఎర్రగా నవ్వుతూ -

"మీ కింకా చూపిస్తాను ఇట్లా రండి" అంటూ

డాబా వరండాలోకి వెళ్ళి నిలబడి "ఇంకొంచెం ఇట్లా రండి. ఈ డాబా ఎక్కడివరకూ ఉందో కిందికి చూడండి.. కింద వున్న మునిసిపల్ స్థలం దాటింది. అంటే నేలమీద ఆక్రమణ తప్పుగానీ గాలిలో ఆక్రమణ తప్పుకాదన్నమాట సుబ్రమణ్యం చిన్నాన్నకు" అంది ఆవిడ.

నిజమే ఆ డాబా మునిసిపల్ స్థలాన్ని గాలిలో ఆక్రమించింది.

ఇంతకు మునుపు ఆడవాళ్లని వందేళ్ళు వెనుకబడ్డారని అనుకున్నందుకు సిగ్గుపడ్డాను.

(పత్రిక మంత్లీ - ఏప్రిల్, 2002)

# ఇట్లు... తమ విశ్వాసపాత్రుడు

లోకంలో అందరూ జీవించాలి గనుక వ్యాపారమో, ఉద్యోగమో చేస్తారు. కాని ఉద్యోగమే జీవితంగా ఉండే మనుషులు ఉంటారని నేనంటాను!

మీరు నమ్ముతారా?

నమ్మలేరా?

నిజంగా నమ్మలేరా?

అయితే మీకు గుర్నాథాన్ని చూపించాల్సిందే!

గుర్నాథం అంటే ఎవరు? అతనేమైనా ప్రెసిడెంట్ ఆఫ్ ఇండియానా? బాలీవుడ్ నటుడు అమితాబ్ బచనా?... హాలీవుడ్ నటుడు చార్లీ చాప్లీనా.... అమెరికా అధ్యక్షుడు బిల్ క్లింటనా?

గుర్నాథం అంటే ఆసియా ఉపఖండమైన భారతావనిలో, ఆంధ్రరాష్ట్రంలోని రెవెన్యూశాఖలో, అనంతపురానికి చెందిన యూనిట్‌లో అతను ఒక మామూలు సగటు ఎన్.జీ.వో! ఇంకా చెప్పాలంటే గుమాస్తా! మరింత వివరంగా చెప్పాలంటే సీనియర్ సహాయకుడు.

యస్, గుర్నాథం ఈజ్ ఏ సీనియర్ అసిస్టెంట్!

సరేలే గుర్నాథం ప్రత్యేకతేమిటీ? అని మీరడగవొచ్చు. అడగొచ్చేమిటి అడిగి తీరుతారు...మీరట్లా అడిగినప్పుడు సమాధానం చెప్పడానికి నా దగ్గర కావలిసినంత సరుకు ఉందండోయ్! అదంతా ముందు ముందు మీకు మనవి చేసుకోగలను.

మరయితే ఎక్కడున్నాడు గుర్నాథం? వెంటనే కలుస్తాం! అంటారా!

అయితే రండి.....

ఈ హాస్పిటల్లో అల్లదిగో ఆ చివర గది వుందే... దాన్ని పురుషుల వార్డని తెలుగులోనూ, మేల్‌వార్డని ఇంగ్లీషులోనూ అంటారు.

ఆ గదిలో....

అదిగదిగో, ఆ మూల్లోని చివరి మంచంపై వెల్లకిలా పడుకుని ఉన్నాడే అతనే గుర్నాథం! అతని ముక్కులోకి ట్యూబు వుంది. మంచం పక్కన సెలైన్ బాటిల్, స్టాండుకు వేలాడుతూ వుంది. ప్రస్తుతం అతను కోమాలో ఉన్నాడు.

అతని పక్కనే దీనంగా చూస్తూ, కొద్దిగా రేగి వున్న జుత్తుతో, కొంతమాసిన ఆకాశం రంగు చీరలో ఉన్న 45 ఏళ్ళ ఆవిడ గుర్నాథం భార్య జానకి. అతని కాళ్ళ దగ్గర దిగులుగా నిలుచున్న పదారూ, పదిహేడేళ్ళ పిల్లలు, సుగుణ, సుశీలలు గుర్నాథం కూతుళ్ళు.

"ఏం గుర్నాథం! ఏం సంపాదించినావు? అని ఎవరైనా అడిగితే పిల్లల్ని చూపించి నవ్వేవాడతను. ఆ ఇద్దరు ఆడ పిల్లలూ కాక వాళ్ళకంటే పెద్దవాళ్ళు ఇద్దరు అబ్బాయిలు వున్నారు గుర్నాథానికి. ఒకరేమో హైదరాబాద్ సెక్రటేరియేట్‌లో క్లర్కుగానూ, మరొకరేమో విశాఖలో బ్యాంకు క్యాషియరుగానూ వున్నారు. వాళ్ళ వాళ్ళ కుటుంబాలతో అక్కడే వుంటున్నారు. ఏ పండగలకో, పబ్బాలకో వస్తుంటారు. గుర్నాథాన్ని హాస్పిటల్లో అడ్మిట్ చేస్తూనే ఫోన్ చేసి వెంటనే 'రమ్మని' చెప్పింది జానకమ్మ. వాళ్ళు మరి కాసేపట్లో రావచ్చు!

గుర్నాథానికి భార్యంటే పంచప్రాణాలూను. పిల్లలంటే ఆరోప్రాణమే. అయితే తన సర్వప్రాణాల్నీ, ఉద్యోగంలో చూడటం వల్లనే ప్రస్తుతం అతనలా కావడానికి అసలు కారణమని సహోద్యోగుల అభియోగం! అవును అతని మెదడుకీ, చేతికీ తప్పా మరొక అవయవానికి పని ఎక్కువగా లేనందువల్ల క్లోమగ్రంథి 5 సంవత్సరాల క్రితమే పనిచేయడం మానుకున్నది. చక్కెర వ్యాధి అన్నారు డాక్టర్లు. అప్పటినుంచి ఆహార విషయంలో జాగ్రత్తలు పాటించాలనుకున్నాడు. ఆ విషయం ఏ 'జీఓ' లోనో, ఏ ఆక్టులోనో వుండి వుంటే ఖచ్చితంగా మంచి గుమస్తాగా పాటించేవాడే! అట్లా లేవు గనుకనే ఇప్పుడిలా రోగమెక్కువై కోమాలోకి వెళ్ళిపోయినాడు.

గుర్నాథంపై మరొక అభియోగం ఉంది. అతను సంసారి కాదని అతని దగ్గరి మిత్రులు అంటూ వుంటారు. అంతమాత్రం చాత అతని శీలాన్ని శంకించి, రోజొక తాజా రోజాపై వాలిపోతూ వుంటాడనుకుంటే మీరు పప్పులోనో, నిప్పులోనో కాలేసినట్టే. అతను శ్రీరామచంద్రునికి ఉన్న ఎన్నో సుగుణాలలో ఒక్కగానొక్క సుగుణం - ఏకపత్నీ వ్రతాన్ని మాత్రమే తన సొంతం చేసుకున్న మహా ఏకపత్నీవ్రతుడు" గుర్నాథం.

మరి అతను జూదరా!

కాదండోయ్ కానే కాదు. జూదం అన్న మాట తెలుగుదా? పాళీదా? పారశీకందా అన్న సంశయం కూడా లేదతనికి. ఆ మాట అసలు తెలుగుభాషలో ఉన్నట్టు అతనికి జ్ఞాపకం లేదు. పేకముక్కల్ని చూస్తే ఫర్లాంగు దూరం...మట్కాకు మైలు దూరం! కోడి పందేలకి కోసుదు దూరం అశ్వమేధానికి (అంటే గుర్రప్పందేలకి ఆమడ దూరం, వెధవది బారాకట్టా. పులి గీతం అడ్డం కూడా ఇష్టంలేదతనికి.

ఇంక అతను తాగుబోతని అందామా? అని అంటే... ఎప్పుడైనా మిత్రులతో బారు కెళ్ళి బీరు తాగిన పాపాన పోలేదు. వైను కల్సి వుంటుందేమోనని ఆయుర్వేదం టానిక్ 'ద్రాక్షారిష్టా' కూడా తాగడు.

అతను అల్లరి వల్లభుడు కాదనడానికి ఇంకా అనేకానేక దృష్టాంతరాలు రాస్తే పేజీలకొద్దీ, మాట్లాడితే గంటలకొద్దీ ఇచ్చేటన్ని ఉన్నాయని. అతని తోటి ఉద్యోగులందరికీ తెలుసు.

ఇంతకీ అతను సంసారి ఎందుక్కాదు? ఇది మిమ్మల్ని ఇంతసేపు వేధిస్తున్న ప్రశ్న? అసలు సంసారి లక్షణాలు ఏమిటి? పొద్దున్నే లేవడం, పళ్ళు తోమగానే కాఫీ తాగేసి మార్కెట్టుకి వెళ్ళి కూరగాయలు గట్రా కొనుక్కురావడం, పిల్లల్ని

స్కూటర్లోనో, సైకిల్లోనో స్కూలు వద్ద దింపి రావడం, తర్వాత ఆఫీసో, వ్యాపారమో చూసుకోవడం, మళ్ళీ సాయంత్రం పిల్లల్ని ఇంటికి తీసుకు వచ్చి, కావలసిన సరుకులు పట్టుకురావడం, హోమ్‌వర్కు చేయడంలో పిల్లలకి సాయపడ్డం. భార్య చేసిన వంటని బాగలేకున్నా, బావుందనీ... బావుంటే బ్రహ్మాండంగా వుందనీ, బ్రహ్మాండంగా వుంటే అత్యద్భుతంగా వుందనీ ప్రశంసించడం ఇలాంటి ఎట్ సెట్రా, వగైరా మొదలైనవి కలిగి వుండటమే కదా.

మరట్లాంటి లక్షణాలు ఒక్కటీ లేవు గుర్నాథానాకి..మరింకేం ఉన్నాయి?

అతను ఉదయం ఎనిమిదింటికి గానీ నిద్ర లేవడు. అట్లని అతడు బద్ధకస్తుడు కాదు. రాత్రి పన్నెండూ, ఒంటిగంట దాకా ఫైళ్ళు రాస్తుంటాడు. గనుక పొద్దున్నే లేవలేడు. గంటలో తయారయి ఆఫీసుకి బయల్దేరతాడు. క్యారియర్‌లో భోజనంతో సైకిల్ క్యారియర్‌లో ఫైళ్ళతో మళ్ళీ ఏ ఏడింటికో, ఎనిమిదింటికో ఇంటికి చేరుకుంటాడు. క్యారియర్ మాత్రం ఖాళీగా వుంటుందంతే. ఫైళ్ళు మామూలే. రాత్రి భోంచేస్తూనే మన 'కలం వీరుడు' ఫైళ్ళ పైకి విజృంభిస్తాడు.

ఎప్పుడయినా సెలవు రోజుల్లో పాతిక రూపాయలిచ్చి కూరగాయలు తెమ్మంటే- ఇంక అంతే. ఇంటికొచ్చినాక ఏవేవి ఎన్నెన్ని తెచ్చినాడో లెక్కలు చెప్పలేక నోరు వెళ్ళ బెట్టడమూ, జానకమ్మ బుగ్గలు నొక్కుకోవడమూ, ఆ తెచ్చిన వాటిలో సగం చచ్చువీ, పుచ్చువీ వుండటం చూసి ఆమె తలపట్టుకోవటం అతి మామూలుగా జరిగే విషయం. అందుకే ఆమె తప్పనిసరి పరిస్థితుల్లో తప్పా, ఏ బేరసారాలకీ గుర్నాథాన్ని వెళ్ళనియ్యదు. అదీ ఇదీ ఏమంటే అతను వేసుకునే బట్టలు కూడా జానకమ్మే తెస్తుంటుంది.

జానకమ్మ ఒక్క విషయంలో కొంత తృప్తీ, మరికొంత అసంతృప్తీ! అదేమిటంటే తను ఏది వండి వడ్డించినా ఉప్పు ఎక్కువయిందనీ, కారం తక్కువయిందనీ అనడు గాక అనడు. యాంత్రికంగా తినడమే గుర్నాథం పని. అదీ ఆమె తృప్తి. అద్భుతమైన రుచిగల వంటా, అతి చెత్తగా వున్న కూరా ఒకటే గుర్నాథం దృష్టిలో. చింత తొక్కయినా, చికెన్ కూరయినా కంచంలో వడ్డించిన దాన్ని ఒకటే ఫేస్ ఫీలింగ్‌పెట్టి తింటున్న భర్తని చూసి అసంతృప్తితో నవ్వాలో, ఏడవాలో తెలీని సందిగ్ధంలో ఎప్పుడూ పడుతుంటుందామె.

మరయితే గుర్నాథానికి ఇష్టమైనవీ ప్రాణప్రదమైనవీ, తెలివిగా వ్యవహారం చక్కపెట్టుకు రాగల నేర్పుగల విషయాలేవైనా ఉండవా? అంటే - ఎందుకుండవ్?

అతనికి ఆఫీసంటే ఇష్టం! ఉద్యోగమంటే మరీ ఇష్టం! ఫైళ్ళంటే ప్రాణం! పర్సనల్ రిజిష్టరంటే ప్రాణప్రదం.

ఎంత చండశాసనుడైన ఆఫీసర్నయినా...ఎంతటి జగదేక మూర్ఖశిఖామణి అధికారినైనా సరే అత్యంత మెలకువతో తన ఆఫీసు ప్రజ్ఞాపాటవాలతో అతి నేర్పుగా ఫైలు విషయం చర్చించి, వివరించి ఎంతో లాఘవంతో దాన్ని అప్రూవ్ చేయించుకు రాగల ధీశాలి గుర్నాథం.

మరి ఎప్పుడైనా మీకు గుర్నాథంతో ఏదైనా పని పడిందనుకోండి. ఆహాఁ అనుకోండి చెబుతాను. నేరుగా ఆఫీసుకు వెళ్ళి "గుర్నాథం ఎవరండీ?" అంటూ

ఎవర్నీ అడిగే పనిలేదు. తిన్నగా ఆఫీసులోకి వెళ్ళగానే అందర్నీ గమక ఒక అయిదు నిమిషాలు పరకాయించి చూడండి, ఎవరయితే తల ఎత్తకుండా ఫైలులో మునిగి టేబులు పైన దొంతర్లుగా ఫైళ్ళు పేర్చుకుని రాస్తున్నాడో అతని వద్దకు వెళ్ళండి - అతనే గుర్నాథం! అక్కడికీ మీకు అనుమానంగా ఉంటే సార్! అని పిలవండి పలకలేదా, తలెత్తి చూడలేదా? మరింకనేం అతనే నూటికి నూరు పైసలూ గుర్నాథం! ఫైలు రాసేటప్పుడు పక్కన బాంబు బద్దలయినా వినిపించుకోని వాడు ఒక్క గుర్నాథమే! ఎందుకంటే ఆయన ఫైళ్ళ తపస్వి మరి! అతను త్రేతాయుగంలో పుట్టలేదు కాబట్టి విశ్వామిత్రుడూ, వశిష్ఠుడు ఇత్యాదులంతా మహర్షులై పోయినారు. లేకుంటే వాళ్లని గురించి వాల్మీకి పొరపాట్నయినా రాసి వుండేవాడా? అదీ, అట్లాంటివాడు గుర్నాథం అంటే!

గుర్నాథం గురించి ఇంతాచెప్పి ఈ ఒక్కవిషయం చెప్పకపోతే అతన్ని అసంపూర్ణంగా చూపడమే అవుతుంది. అదేమిటంటే అతని 'యువర్స్ ఫెయిత్ ఫుల్లీ' మనస్తత్వం.

ఉదయం ఆఫీసుకు రాగానే అందర్నీ పేరుపేరునా పలుకరించి నమస్కరిస్తాడు. తన సీనియర్లనూ, ఆఫీసు సూపర్నింట్లనూ "గుడ్మార్నింగ్ సార్!" అంటూ సవినయంగా విష్ చేస్తాడు.

ఒకరోజు ఉదయం నమస్కారాల కార్యక్రమం పూర్తి చేసుకుని, తన సీటులో కూచున్నాడు గుర్నాథం. ఫైళ్ళు టేబుల్‌పైన పెట్టుకుంటూ ఉండగానే, అతని కొలీగ్ రామన్న చౌదరి తన టేబుల్ ముందున్న కుర్చీలో వచ్చి కూచుని – "నువ్వు చాలా అమాయకుడివయ్యా గుర్నాథం" అన్నాడు చాలా సీరియస్‌గా మొహంపెట్టి.

ప్రశ్నార్థకంగా చూశాడు అతన్ని గుర్నాథం. మళ్ళీ రామన్న చౌదరే అన్నాడు.

"నీకు యాభై ఏళ్ళు వచ్చినాయే కానీ అనుభవం రాలేదయ్యా" అతనిదీ గుర్నాథం వయసే. అయితే రామన్న చౌదరిది బట్టతల కావడం వల్ల పదేళ్ళు ఎక్కువ ఉన్నట్టు అనిపిస్తాడు.

"ఎందుకట్ల అంటున్నారు సార్!" అన్నాడు గుర్నాథం.

"అదికాదు గుర్నాథం! నువ్వు అందర్నీ విష్ చేస్తున్నావు బాగానే ఉంది. ఆ శ్రీధర్‌బాబుకి ఎందుకు నమస్కారం చేయాలి.అతను పక్క సెక్షను సూపర్నెంటు కదా!"

"ఎంతయినా అతనూ, ఈ ఆఫీసు మనిషేకదా!" అని అన్నాడు గుర్నాథం.

"మరయితే నువ్వు నమస్కరిస్తే అతను ప్రతినమస్కారం చెయ్యాలి కదా! కనీసం చెయ్యి ఎత్తే ప్రయత్నం కూడా చెయ్యడే. అతనికి మనుషుల పట్ల చులకన భావం!" అన్నాడు చౌదరి.

"నమస్కారందేముందిలెండి చౌదరీ!" అన్నాడు గుర్నాథం.

"అట్లనవద్దు గుర్నాథం...ఏ ఆఫీసులో ఎట్లాంటివాళ్ళు ఉన్నా మన డిపార్టుమెంటులో మాత్రం నాలుగురకాల మనుషులున్నారు. మనం నమస్కరిస్తూనే ఎంతో నమ్రతతో నమస్కరించే వాళ్ళూ, కొందరు వీడి మొహానికి ప్రతినమస్కారం కూడానా అని

ఎడంచేత్తో నామమాత్రం చేసేవాళ్ళు, మరికొందరు తమ హోదాకు భంగం వాటిల్లకుండా శిరఃకంపనంతో ప్రతి నమస్కారం చేసేవాళ్ళు. ఇంకొందరు బిచ్చగాణ్ణి చూసినట్టు చూపుతోనే ప్రతి నమస్కారంచేసేవాళ్ళు. ఈ చివరి రకానికి చెందిన వాడు శ్రీధరబాబు!" అట్లాంటి వాళ్ళని మనం కూడా నిర్లక్ష్యం చేయాలి!" అన్నాడు చౌదరి ఉక్రోషంగా.

"ఎందుకులెండి సార్! పాములకీ, గోవులకీ నమస్కరించే సంస్కారం ఉన్న దేశంలో పుట్టాము. గోవుకి నమస్కరించకుంటే అదేమీ అనదు. కానీ పాముకి నమస్కరించకపోతే అది కాటువేయవచ్చు. అధమం బుసకొట్టవచ్చు. ఈ డిపార్టుమెంటులో నాకింతవరకూ పాములెవరో, గోవులెవరో తెలుసుకునే కోరికా, తీరికా లేదు. అందరికీ నమస్కరిస్తే పోలేదా! ఇంక సంస్కారం అంటావా ఎవరిది వాళ్ళ కుంటుంది" అన్నాడు గుర్నాథం అతి మామూలుగా.

"సంస్కారమా? ఈ వెధవలకి? అవలీలగా కాళ్ళు ఎటుపడితే అటు వంగేటట్లుంటే, ప్రతి నమస్కారాన్ని ఎడం కాలితో ఎత్తి చేస్తారు. మన అదృష్టం! "ఆ ఫీటు" వాళ్ళకి రాక బతికిపోయాం" అంటూ వెళ్ళిపోయాడు చౌదరి.

నవ్వుతూ చూస్తూ వుండిపోయాడు గుర్నాథం!

గుర్నాథం తత్వం రామన్న చౌదరికి తెలుసు. అయినా అప్పుడప్పుడూ వచ్చి ఇలా చిన్న చిన్న లెక్చర్లిచ్చి రెచ్చగొట్టాలని చూస్తాడు.

బజార్లో ఎప్పుడయినా తన డిపార్టుమెంటు ఆఫీసరో, సూపర్నెంటో కనబడితే విష్ చేస్తాడు గుర్నాథం. వాళ్ళు పొరపాట్న చూడకుంటే వాళ్ళు తిరిగి చూసేవరకు చేయి దించడు. అక్కడికీ చూడలేదనుకోండి ఇంటికిపోయినా అతని మనసు వేదనకి గురవుతుంది. తన మీద ఏం కోపం ఉందో ఏమో, లేకుంటే తన విష్‌ని ఎందుకు అందుకోలేదు అని మధనపడతాడు. ఆ విషయం కూడా చౌదరి ఎప్పుడో పసిగట్టాడు. "ఆఫీసరు ఫోను చేస్తే వినయంతో లేచి ఫోన్లో మాట్లాడతావు. ఏమ్మనిషివి నువ్వూ... నువ్వు గుమస్తావా, కట్టు బానిసవా?" అంటూ ఎన్నిసార్లు ఎద్దేవా చేశాడు కూడాను.

అయినా గుర్నాథం తన వ్యవహారం మార్చుకోలేదు మరి!



మధ్యాహ్నం 12 గంటలయింది.

హైదరాబాదునించీ, విశాఖనుంచీ గుర్నాథం కుమార్లు మహేష్, దినేష్‌లు కలసి మాట్లాడుకున్నట్టుగా హాస్పిటల్ చేరుకున్నారు. వాళ్ళ వాళ్ళ ఫ్యామిలీలతో సహా. తండ్రి పరిస్థితి చూసి ఆందోళనపడ్డారు. డాక్టరు వద్దకెళ్ళి తండ్రి స్థితి గురించి అడిగారు.

"షుగరు ఎక్కువయిపోయింది. కోమాలోంచి బయటపడితే మీ అదృష్టం. శాయశక్తులా మా ప్రయత్నం మేం చేశాం. మరో ఆరుగంటలు గడిస్తేగానీ ఏం చెప్పలేం" అన్నాడు డాక్టరు.

నిస్పృహతో అక్కడినుంచి వచ్చేశారు ఇద్దరూ -

వాళ్ళ మొహాల్లోని విషాదం కుటుంబ సభ్యుల మనసులని కలచి వేసింది.

సాయంత్రం ఆరు గంటలవుతున్నట్టే అందర్లో టెన్షన్ మొదలయింది. ఏం చేయాలో పాలుపోని స్థితి!

ఆ రోజు మధ్యాహ్నం గుత్తి రోడ్లో జరిగిన బస్సు ప్రమాదంలో గాయపడిన వారితోనూ, వాళ్ళ బంధువులతోనూ ఆస్పత్రి రద్దీగా వుంది. ఆ గాయపడ్డ వారిలో రెవెన్యూ డివిజనల్ అధికారిగారి బంధువులు ఉన్నారని ఎవరో అనుకుంటున్నారు.

ఏ మాత్రం కదలిక లేకుండా వున్న గుర్నాథాన్ని చూస్తుంటే అతను తమకి దక్కడేమోనన్న భావన అందరి తలల్లోనూ పురుగులా తొలుస్తోంది. డాక్టరు చెప్పిన ఆరుగంటలు కాలం అయిపోవస్తోంది మరి.

"ఏమండీ! మహేషూ, దినేషూ వచ్చినారు చూడండీ!" అంది జానకమ్మ. గుర్నాథం చెవిలో అప్పుడన్నా అతనిలో చలనమొస్తుందేమోనని ఆమె ఆశ!

గుర్నాథంలో కదలికలేదు!

"ఏమండీ! మీ కోడళ్ళు సుబ్బలక్ష్మి, శారదలు వచ్చినారండీ" అంది మళ్ళీ.

ఊహూ, కదలికలేదు.

"ఏమండీ మీ ముద్దుల మనవలూ, మనవరాళ్ళు లావణ్యా, దివ్య, రాజేషు, రాకేషు వచ్చినారండీ - చూడండి, మీకోసం ఎంత ఇదిగా చూస్తున్నారో చూడండీ, ఒక్కసారి చూడండీ" అంటూ బొంగురు పోతున్న గొంతుతో దుఃఖాన్ని దిగమింగుతూ అంది జానకమ్మ.

అతనిలో కదలిక లేనేలేదు!

"నాన్నా నాన్నా" అంటూ కొడుకులూ, కూతుర్లూ పిలుస్తున్నారు. గుర్నాథంలో కదలిక లేదు.

"మామయ్యా" అంటూ పిలిచారు కోడళ్ళు - కదలిక లేదు.

"తాతయ్యా తాతయ్యా" అంటూ పిల్లలు కోరస్‌గా పిలిచారు. ఏమాత్రం కదలిక లేదు.

ఉన్నట్టుండి వార్డులో చిన్నగా కలకలం బయల్దేరింది.

బస్సు ప్రమాదంలో గాయపడ్డ బంధువుల్ని చూడ్డానికి రెవెన్యూ డివిజనల్ ఆఫీసరు వచ్చారు. అక్కడున్న వారంతా క్షణంలో నిశ్శబ్దంగా నిలుచుండిపోయారు. ఆయన బంధువుల్ని పరామర్శిస్తూ ఉన్నారు.

"ఎవరాయన" అన్నాడు మహేష్.

విషయం చెప్పింది సుగుణ. ఇంకా వివరణ కోసం "ఆయన నాన్నకు ఇంతకుముందున్న ఆఫీసరు" అంది.

ఏదో తన ఆఫీసులో ఇంతకు మునుపు పనిచేసిన గుమస్తా కదా అని సానుభూతి తోనయినా చూస్తాడు కదా అని వెళ్ళి తండ్రి గురించి చెప్పాడు మహేష్.

"అరెరె అట్లనా! గుర్నాథం కోమాలో వున్నాడా?" అంటూ టకా టకా అడుగులేస్తూ వస్తున్నాడు ఆఫీసరు,

'ఆఫీసరన్న' పదం వినిపించగానే గుర్నాథంలో కదలిక మొదలు కావడంతో "నాన్నా! మీ ఆఫీసరు వస్తున్నాడు" అంది సుగుణ తండ్రి చెవిలో - శవంలా పడి వున్న అతనిలో కదలికలు మరింత ఎక్కువయినాయి.

తండ్రిలో మార్పు గమనించి "వచ్చేసినారు నాన్నా మీ ఆఫీసరు" అంది సుగుణ.

అంతే -

గుర్నాథం కళ్ళు యాంత్రికంగా తెరుచుకున్నాయి.

ముక్కులో పెట్టిన ట్యూబులతో సహా టక్కున బెడ్డు మీద నుంచి లేచాడు గుర్నాథం. "నమస్తే సార్!"అన్నాడు వినయంగా.

అటు ఆఫీసర్లోనూ, ఇటు కుటుంబ సభ్యులందర్లోనూ ఒకటే ఆశ్చర్యం - ఆ గుర్నాథాన్ని చూస్తుంటే -

దటీజ్ గుర్నాథం!

(ఈనాడు ఆదివారం - 17 మే, 1998)

# గడి - నుడి

అన్ని సుఖాల్లోకీ గొప్ప సుఖం చలికాలంలో వేణ్ణీళ్ళతో స్నానం చేయడం. అందుకే ఉదయం వేళ ఒకపట్టాన నేను బాత్రూమ్ వదిలి రాను. నాకు కవిత్వం రాదు కాని, వచ్చుంటే ఓ డజను కవితల్ని బాత్‌రూమ్‌లోనే అల్లేసి ఉందును.

సరిగ్గా అలాంటి సమయాన - బాత్‌రూమ్ తలుపు చప్పుడయితే - "ఎవరూ?" అన్నాను.

"వెంకటేశ్వర్లు మామయ్య నిన్ను తొందరగా రమ్మంటున్నాడన్నయ్యా" అంటూ మా చెల్లి గొంతు వినబడింది.

"దేనికిట ఆ తొందరా?" కాస్త విసుగ్గానే అన్నాను.

"ఏమో.... ఏం చెప్పలేదు మామయ్య."

"సర్లే, తొందరగా వస్తున్నానని చెప్పు మాధవీ!" అని అన్నానే కానీ, నాకు వేణ్ణీళ్ళ సుఖాన్ని వదులుకొని వెళ్ళాలని లేదు.

వెంకటేశ్వర్లు మామయ్య నాకు స్వయాన మేనమామ. అంటే మా అమ్మకు చివరి తమ్ముడన్న మాట. వయసులో నాకంటే ఏడెనిమిదేళ్ళు పెద్దయి వుంటాడు.

"పిచ్చి కాని పిచ్చి" మీద ఎవరైనా పరిశోధన చేయాల్సివస్తే - 'గళ్ళ నుడికట్టు' పిచ్చి ఉన్నవాళ్ళనీ తమ పరిశోధనలో చేర్చమని మనవి చేసుకుంటాను. సరిగ్గా అలాంటి పిచ్చి ఉన్నవాడు మా వెంకటేశ్వర్లు మామయ్య. ఆయన కీ పిచ్చి ఎప్పటినుంచి పట్టుకున్నదో ఇదమిత్థం చెప్పటం కష్టం. కానీ - పాతికేళ్ళ క్రితం 'ఆరుద్ర గళ్ళనుడికట్టు' తో ప్రారంభమై 'శ్రీశ్రీ పదబంధ ప్రహేళిక' తో ముదిరిపోయి ఉంటుందని నా అనుమానం.

నిజానికి తెలుగులో మామయ్యకున్న పదజ్ఞానం తక్కువే, అయితే అతని మొండి పట్టుదల మాత్రం ఎవర్నయినా ఆశ్చర్యపరుస్తుంది. ఈ మధ్య ఆంధ్రప్రభ వీక్లీలో 'గడి - నుడి' ప్రారంభమైనప్పటి నుంచి - అందులోని ఏ ఒక్కపదం దొరక్కపోయినా నిద్రాహారాలు మాని దానికోసం ఆలోచించేవాడు. ఎప్పుడైనా జుట్టు కూడా పీక్కునేవాడు. (నాకూ గడి - నుడి పూరించడం ఇష్టమే కానీ, జుట్టు మాత్రం పీక్కోను.)

ఏ మధ్యాహ్నమో నేను భోంచేసి అలా నడుం వాలుస్తున్నట్టే - ఉన్నట్టుండి ఊడిపడతాడు మామయ్య. - "ఒరే భానూ! ఆ పత్రం తీగతో పాకితే కలుగుతుంది క్షోభ..." అంటాడు.

"ఎన్నక్షరాలు మావయ్యా?" అనేస్తాను.

"నాలుగక్షరాలుండాలిరా! అద్దంలో 'ఆపద' వస్తుంది అంటే ఇది కూడా 'ఆ' తోనే మొదలవుతుందన్న మాట!" అంటాడు మామయ్య.

మామయ్య మాటలకి జవాబు ఇవ్వటం నా కెంత అలవాటై పోయిందంటే - ఓ ఆదివారం నాడు టీ.వీ.లో 'ఒన్ డే క్రికెట్' మ్యాచ్ చూస్తూ ఉన్నాను. "రాత్రంతా ఒకటే ఒళ్ళునొప్పులు. తెల్లవారుతున్నట్టే జ్వరం..." నన్ను ఉద్దేశించి మాట్లాడుతున్నాడు మామయ్య.

'ఎన్నక్షరాలూ...అద్దం నిలువు గళ్ళలో పదాలేవైనా దొరికాయా?" అన్నాను.

మా తమ్ముడూ, అమ్మా నవ్వుతున్నారు.

నా పరిస్థితి అర్థం చేసుకున్న మాధవి - "మామయ్యకి జ్వరం వచ్చిందట అన్నయ్యా!" అంటూ నొక్కి చెప్పేటప్పటికి నాకు నవ్వాగలేదు.

అపారమైన తెలివితేటలున్నవాళ్ళే అలా గళ్ళని పూరించగలరని ఆయనకు గొప్ప విశ్వాసం. ఏ పదమైనా దొరక్కుండా తన్ని ఇబ్బందిలో పడేసిందా - ఓ పెద్దగుట్ట పడేన్ని సిగరెట్టు పీకలూ, చిన్న సైజు దిబ్బంత బూడిదా టేబుల్‌మీద తయారై ఉంటాయి.

ఓ రోజు అర్ధరాత్రి తలుపులు 'ధనా ధనా' మంటూ శబ్దమవుతూంటే నాకు మెలకువ వచ్చేసింది. ఈలోగా మా నాన్న వెళ్ళి తలుపు తీశాడు. వెంకటేశ్వర్లు మామయ్య కనబడ్డంతోటే కంగారు పడిపోయాడు. వాళ్ళింట్లో ఎవరికైనా సీరియస్సుగా ఉందేమోనని అడిగాడు - అదేం లేదంటూ "సప్త సముద్రాల కవతల ఆచెట్టు తొఱ్ఱలోనే అతగాడి ప్రాణం. దొరికింది బావా. దొరికింది" అన్నాడు.

మా నాన్న నిద్రమత్తు సగం వదిలినట్లై -"ఒరే నా ప్రాణం తీయమాకు. ఆగదిలో భానుమూర్తిగాడున్నాడు వెళ్లు" అంటూ ఉంటే నాకు నవ్వొచ్చింది.

"ఒరే భానూ! లేరా - దొరికిందిలే..అతగాడి ప్రాణం! సప్త సముద్రాల కవతల...." అంటూ- ముసుగుతన్ని పడుకుని ఉన్న నా దుప్పటిని లాగి "మనం నిన్నంతా దాని కోసం ఎంత తన్నుకొని చచ్చాం. చివరికి 'రామచిలుకలోన' అని పూరించాం. అందుకే తక్కిన గళ్ళు పూరించలేకపోయాం...ఇప్పుడు దొరికిందిరోయ్!"

"అబ్బా! అదేమిటో చెప్పు మామయ్యా! అనవసర సస్పెన్సూ, థ్రిల్లూ ఎందుగ్గానీ" అంటూ విసుక్కుని దుప్పట్ని గొంతువరకూ కప్పుకున్నాను.

"తొందరపడకోరే -అతగాడి ప్రాణం - అంటే రాక్షసుడి ప్రాణం' ...ఇప్పుడు రెండవ గడిలో 'రాఘవుడే.', మూడోగడిలో 'సుర' నాల్గవ గడిలో 'ప్రాణదానం'... సరిపోతాయి" అంటూనే ఇక తన కర్తవ్యం అయిపోయినట్లు నా దుప్పట్లో దూరేసి పడుకున్నదే తడవుగా గుర్రుపెట్టి నిద్రపోయాడు.

అత్తయ్యమీద ఆ క్షణంలో జాలేసింది నాకు. అత్తయ్యంటే జ్ఞాపకమొచ్చింది. కొన్నాళ్ళ కిందటి మాట. మామయ్య పెళ్ళి జరుగుతోంది.. అత్తయ్య సిగ్గుతో తల వంచుకుని పీటల మీద కూచుని ఉంది. అప్పుడప్పుడు ఓరకంట చూస్తోంది - తెల్లటి తలపాగాతో బాసికం కట్టుకుని ఎంతో అందంగా ఉన్న మా మామయ్య

వంక. అయితే మామయ్యకి ఓర చూపులూ, కోరచూపులూ అలవాటు లేకనో, మరి ఎంచేతనో దూరంగా పందిరి కవతల ఉన్న జనంకేసి చూస్తూ ఉన్నాడు. పురోహితుడు మంత్రాలు ఏకధాటిగా చదువుతున్నాడు.

సరిగ్గా అప్పుడు -

మామయ్య ఏదో అన్నట్టయితే పురోహితుడు మంత్రాలు చదవడం ఆపేసి అడిగాడు - "ఏమిటి బాబూ, ఏం కావాలి?"

"ఆఁ ఏం లేదు...ప్రతి పెళ్ళిలోనూ సజీవమైన టేప్ రికార్డరు ఏమిటా అని మూడు రోజుల్నించి ఆలోచిస్తూ ఉన్నా...ఇప్పుడు దొరికింది."

"ఆఁ..టేప్‌రికార్డరు దొరికిందా? ఎప్పుడు.. ఏదీ?"

"ఇప్పుడే ..మీరే..ప్రతి పెళ్ళిలోనూ సజీవమైన టేప్ రికార్డరు మీరే. మంత్రాలన్నీ ప్రతి పెళ్ళిలోనూ టేప్‌చేసినట్లు ఒక్కటే వినిపిస్తారు... మీరే, అంటే 'పురోహితుడు'... అప్పుడు అయిదు నిలువు 'రోహిణి' . ఏడు నిలువు తుగ్లక్" అంటూ తక్కిన గళ్ళన్నీ కళ్ళెదుటే ఉన్నట్టు టపీటపీమని పూరిస్తోంటే పురోహితుడు మంత్రాలు మరచి, నోరు తెరిచి అలా చూస్తూ ఉండిపోయాడు.

ఆ సమయంలో అక్కడే నవ్వలేక పందిట్లోంచి బయటికి పరిగెత్తుకెళ్ళి ఓ అరగంట నవ్వాను.

ఏది ఏమైనా మామయ్యలో మట్టుకు ఓ విషయంలో మా చెడ్డ సిన్సియారిటీ ఉంది. అదేంటంటే గొప్ప ప్రేమలో పడ్డ ప్రేమికుడు వందమంది అమ్మాయిల్లోనూ తన ప్రియురాలిని తప్ప మరొక్కరిని ఎలా చూడడో, అలాగే తను కొన్న పత్రికలో కథలున్నా, కవితలున్నా సీరియల్సున్నా వేటినీ చూడకుండా ఒక్క 'గడి - నుడి' నే చూస్తాడు.

ఇన్ని అనుభవాల్లోనూ ఒక్క అపశ్రుతి...ఒక్కసారన్నా 'గడి - నుడి ఆల్ కరెక్టు కాకపోవడం. అయినా పట్టు వదలని విక్రమార్కుడు మా వెంకటేశ్వర్లు మామయ్య.

"ఒరే భానూ, ఇంకెంత సేపూ నీ స్నానం?" అంటూ మామయ్య గొంతే వినబడేసరికి నా సుఖానికీ, ఆలోచనలకీ ఫుల్‌స్టాప్ పెట్టేసి టవల్ తీసుకున్నాను - వస్తున్నా మామయ్యా" అంటూ.

రెండు నిముషాల్లో బయట గదిలోకి చేరుకున్నాను.

తలకున్న తడిని రుద్దేస్తూ అడిగాను "ఏం మామయ్యా! మరో 'గడి - నుడా?"

"అదేంకాదు కానీ...మనం సక్సెస్‌రోయ్ భానుమూర్తీ" అంటూ మామయ్య చిర్నవ్వు చిందించాడు.

"దేంట్లో మామయ్యా - గడి - నుడిలోనే?"

"ఆఁ మరేమనుకున్నావ్?" అంటూనే అందాకా చేతిలో ఉన్న వీక్లీని టక టక పేజీలు తిరగేసి ఆత్రంగా చూపించాడు. - 'గడి-నుడి' ఫలితాన్ని. సరియైన సమాధానాలు రాసిన వారి పేర్లంటూ ఓ పాతికమంది పేర్లున్నాయక్కడ. ఎర్ర సిరాతో అండర్‌లైన్ చేసున్న 'పి. వెంకటేశ్వర్లు, అనంతపురం' ను చూపి గర్వంగా నా వేపు చూశాడు మామయ్య.

"కంగ్రాచ్యులేషన్సు మామయ్యా!"

"ఇన్నాళ్ళకి ఫలించిందిరోయ్ నా కోర్కె! ఇంకా మీ అత్తయ్యకి తెలీదు. తెలిస్తే ఇంకేమన్నా ఉందా - మా వీధి వీధంతా తెలిసేట్టు ప్రచారం చేసెయ్యదూ? - మా ఆఫీసులో ఇంక ఊరికే వదుల్తారా? టీ పార్టీ అడిగినా అడుగుతారు" అంటూ చెప్పుకుపోతూ ఉంటే - మా తమ్ముడు చక్రవర్తీ, మాధవీ వింతగా చూస్తూ నన్నడిగారు. నేను టూకీగా వివరిస్తోంటే మామయ్య సంతోషం అలివికాకుండా ఉంది.

"ఒరేయ్! వెళ్ళొస్తా. ఇంకా నాకు వేరే పనులున్నాయి" అంటూ గబ గబ చెప్పేసి వెళ్ళిపోయాడు మామయ్య.

ఇన్నాళ్ళకైనా మామయ్య పేరు పత్రికలో వచ్చినందుకు నిజంగా నాకు భలే సంతోషం కలిగింది.

"మామయ్యను చూస్తే జాలేస్తోంది" అన్నాడు చక్రవర్తి.

"ఏం, ఎందుకు?" అన్నాను.

'గడి-నుడి' పూరించి, పోస్టు చేయమని మూడువారాల క్రితం నా చేతికిచ్చాడు మామయ్య. నేనేమో మరిచిపోయానన్నయ్యా! ఇప్పుడే రేడియో పక్కన వెతికితే దొరికింది - అది ఇది" అంటూ 'గడి-నుడి' కటింగ్‌ను ఇచ్చాడు చక్రవర్తి.

'నిజమే ! అదే!

"మరి మామయ్య పేరు ఎలా వచ్చిందిరా వీక్లీలో?" అన్నాను విస్తుపోతూ.

"పి. వెంకటేశ్వర్లు అనే పేరున్న మహానుభావుడెవరో రాసి పంపి వుంటాదన్నయ్యా." అంది మాధవి.

"ఈ విషయం మామయ్యకి చెప్పకండి. ఇది మన ముగ్గుర్లోనే ఉండిపోనీ... ఆయన సంతోషాన్ని ఎందుకు - చెడగొట్టడం" అన్నాను మామయ్యని ఊహించుకుంటూ.

(ఆంధ్రప్రభ వీక్లీ - 16 మార్చి, 1988)

# శ్రీవారూ - తాళం చెవీ

అదృష్టంకొద్దీ ఈ దేశంలో పుట్టీ హాయిగా నిక్షేపంగా జీవిస్తున్న వాళ్లల్లో మా ఆఫీసులోని సీనియర్ అసిస్టెంటు శ్రీహరిరావు ఒకడని నా గాఢమైన నమ్మకం! ఇదే ఏ అమెరికాలాంటి దేశంలోనో అయి వుంటే ఇంగ్లీషు సిన్మాలోలా ఒక శుభ సాయంత్రాన ఐదు గంటలవేళ నా చేతిలోని రివాల్వర్ పొగలు కక్కుతూ ఉండగా, దాని తాలూకు గుళ్ళు అతని గుండెకాయని జల్లెడ చేయగా, టైపు చేయగా మిగిలిన కాగితాల్ని తేలిగ్గా టైపు చేసేసి ఆనందతాండవ మాడుతూ ఇంటికెళ్ళి

ఇంతకీ నేను ఇలా ఆలోచించడానికి కారణం ఒకటే - ప్రతి రోజూ సాయంత్రం ఐదు గంటలు అవుతూ ఉండగానే ఇక ఆఫీసు నుంచి బయట పడదామన్న ఆత్రంతో టైపు మిషన్ని కట్టేస్తున్న సమయంలో... సరిగ్గా అప్పుడు ఊడిపడతాడు శ్రీహరిరావు. అప్పుడతని చేతిలో బారెడు పొడవున్న రీముడు కాగితాలూ - వాటిల్లో అక్షరాల్లో, అంకెల్తో నిండిన స్టేటుమెంట్లూ...

ఇ.ఇ. (ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు) గారు చెప్పారు మేడం! వీటిని అర్జెంటుగా టైపు చేసి ఇవ్వాలిట!' పదినిమిషాల్లో అంటాడు.

మారు మాట్లాడకుండా టైపు మిషను ముందు కూలబడతాను. అన్నన్ని స్టేటుమెంట్స్ పదినిమిషాల్లో టైపు చేయడానికి ఏ మళయాల మంత్రాలో వస్తే తప్పా వీలుపడదుగా! ఇదీ నాబాధ. అవన్నీ టైపు చేసి ఆఫీసునుంచీ బయట పడేటప్పటికి ఒక్కోసారి పొద్దు మునిగిపోయి, బాగా చీకటి పడిపోయి ఉంటుంది. ఎలాగో కాళ్ళీడ్చుకుంటూ ఇంటి దారిపడతాను.

ఇవాళ కూడా శ్రీహరిరావు పుణ్యమా అని ఆరున్నర అయింది. ఉదయంనుంచీ ఒక్కటేవిధంగా టైపు చేయడం వల్ల తలంతా దిమ్మెక్కి పోయి ఉంది. ఇప్పుడు కప్పుడు కాఫీ కడుపులో పడితేగానీ 'ఆత్మా సీత' (నేను ఫెమినిజాన్ని, ఇష్టపడతాను లెండి, అందుకే ఆత్మారాముడు' అని రాయడం నాకిష్టముండదు) శాంతించదు. ఈ పాటికి నా పతిదేవుడు కాఫీచేసి, ఫ్లాస్కులో పోసి నా కోసం ఎదురు చూస్తూ ఉంటాడు. ఇకనేం, చక్కగా ఈజీ చైర్లో కాలిమీద కాలేసుకుని కాఫీ తాగడమే అలస్యమనీ నా సిక్స్‌సెన్స్ చెబుతోంది. ఇలా అనుకుంటూ ఉంటే అంగలు గబాగబా పడుతున్నాయి. నాకెప్పుడూ శ్రీశ్రీ పేరడీపద్యం జ్ఞాపకమొస్తూ ఉంటుంది. 'ఎప్పుడు బడితే అప్పుడు కప్పుడు కాఫీనొసంగ గలిగిన సుజనుల్....' ఆహా ఎంత చక్కటి పద్యమో!

తానొకటి తలచిన దైవమొకటి తలచుననీ తెలుసుకోడానికి నాకు ఎంతోసేపు పట్టలేదు. నా పతిదేవుడు ఇంటికి తాళమైనా తీయకుండా డిటెక్టివ్ సిన్మాలో శత్రువుల

దగ్గర చిక్కుకున్న రహస్య పత్రాన్ని ఎట్లా తీసుకు రావడమా అన్న ఆలోచనలతో సతమతమైపోతున్న హీరోలా, సీరియస్సుగా మొహం పెట్టుకునీ, మరీ సీరియస్సుగా కనుబొమ్మల్నీ ముడిచీ, భూమిని కొలుస్తున్నట్టు పెద్ద పెద్ద అంగలు వేస్తూ అటూ ఇటూ తిరుగుతున్నాడు - కాళ్ళుకాలిన పులిలా! (క్షమించాలి, పతిదేవుణ్ణి సామెతకోసం పిల్లి చేయడం నాకు ఇష్టం ఉండదు. కాళ్ళంటూ కాలేక పిల్లి అయినా పులయినా ఒక్కటేనని నా నిశ్చితాభిప్రాయం! కాదనువారు జంతుశాస్త్ర పరశోధకుల్ని సంప్రదించ గలరు)

'ఏమండీ.. ఏమిటిలా... తలుపూ..." అర్థోక్తిగా - మా కాళ్ళు కాలిన పులిని సమీపిస్తున్నట్టే అడిగాను.

శాంపిల్‌గా చిర్నవ్వు నవ్వీ.....'నవ్వు' ప్రక్రియ అయిపోగానే పెదాల్ని యథాస్థితికి తెచ్చుకునీ, కనుబొమల్ని మాత్రం మునుపటిలాగా సీరియస్ ఉట్టిపడేలా ముడిచేసీ- "నా తాళం చెవి పోయింది కృష్ణప్రియా!" అంది 'పులి' విషాద వార్తలు చదివేటప్పుడు మొహాన్ని ఏడుపుగొట్టుగా పెట్టుకోవాలన్న నియమాన్ని పాటించిన తెలుగు టీవీ న్యూస్ రీడర్‌లా మొహం మాడ్చుకుని.

"పోయిందా! సర్లేండి... ఇంతకు మునుపులా అవస్థలు తప్పవన్నమాట...ఏం చేద్దాం!" అంటూనే నా వ్యానిటీ బ్యాగ్‌లోంచి తాళం చెవీ తీసి, ఇంట్లోకి వెళ్ళి అన్ని గదుల్లోనూ దీపాలు వెలిగించేసి, బట్టలు మార్చుకుని వచ్చాను. కాళ్ళు కాలిన పులి ఇంకా బయట తిరుగుతూనే ఉంది. ఇదేమిటీ, పులీ! తన తాళం చెవితో తలుపు తీస్తే తప్పా లోపలికి రాకూడదని శపథమేమయినా చేసిందా? ఆ మాటే 'పులి' తో అన్నాను.

"ఛ- అదేం లేదు ప్రియా! మరీ తాళం చెవీ..ఎక్కడ పడి...' అంది పులి పిల్లిలా 'మ్యావ్ మ్యావ్' అన్నట్టు గొణిగేస్తూ.

సగంలో నిలిపివేసిన పులి వాక్యాన్ని పూరిస్తూ ...పోయిందో ఏమో...ఇంకా ఆలోచనలకు వాయిదా పెట్టండి. పతిదేవా! గదిలోకి పోయి తమరి వస్త్రాలను మార్చుకొనుడు. నేను ముఖ ప్రక్షాళనం గావించుకుని వంటకంబు చేయుటకు ఉపక్రమించెదను!!! "అంటూ తప్పుల తడక గ్రాంథీకంతో పులిని అదరగొట్టేశాను. అసలు 'పులి' ఉద్యోగమే 'తెలుగు పండి'టాయె! అనంతపురం క్లాక్‌టవర్ దగ్గర నిష్కారణంగా ఒక ఆగంతకుడు మా 'పులి' చొక్కా పట్టుకుని నిలేసిన వాడినయనా క్షమిస్తాడు కానీ, తెలుగు గ్రాంథీకాన్ని సరిగా మాట్లాడలేకపోతేమాత్రం అసలు క్షమించడు. నేను ప్రాణసఖిని కాబట్టి బతికిపోయేను. పులిమందలింపుగా.... చాల్లేద్దూ. గ్రాంథీకాన్ని ఎందుకు ఖూనీ చేస్తావు" అంటూ మృదుమందహాసం చేస్తూ లోపలికి వచ్చేసింది.

★ ★ ★

నేను మొహం కడుక్కు రావడానికని బాత్‌రూంలోకి వెళ్ళి వచ్చేటప్పటికి వారు బయటి గదిలో కనిపించలేదు. 'ఎక్కడికి వెళ్లారా? బట్టలు మార్చుకోకుండా', అని వెదుకుతూ ఉండగా, వంట గదిలో కాఫీ చేస్తూ కనిపించారు. నా పతి దేవుడికంటే

ఉత్తమ పురుషుడు ఈ భూ ప్రపంచం మీద ఏ పెళ్లానికయినా మొగుడిగా లభించి ఉంటాడా అనిపించి, ఆ క్షణంలో కొండంత సంతోషం, కించిత్తు గర్వం నా మెదడులో ప్రవేశించగా, ఆయన్ని వెనుక మాటుగా అమాంతం కౌగలించేసుకుని సుతిమెత్తగా ఎడమ చెవిని కొరికేను.

సదరు హఠాత్ పరిణామానికి పతిదేవుడు పరవశం చెందకుండా ఓరచూపు చూస్తూ దీనంగా మొహంపెట్టి – "నా తాళంచెవి ప్రియా ఎక్కడో పడిపోయిందే!" అన్నాడు. ఆ మధుర క్షణంలో మురిపెంతో ముంచెత్తాల్సిన మొగుడు అరిగిపోయిన గ్రామ్‌ఫోన్ రికార్డులా 'తాళంచెవో' అంటూ ఉంటే ఏ పెళ్ళానికయినా అరికాలినుంచీ నడినెత్తి వరకూ మండకుండా ఉండగలదా! అందుకే నాకూ మండింది! రాగానికీ, అనురాగానికీ తేడా తెలీని మొద్దుని నాలుగేళ్ళ క్రితం కట్టుకున్నందుకు నన్ను ఏ దేవుడు రక్షిస్తాడా అని అరక్షణం దిగులుపడీ –

"హబ్బా! పోతే పోయిందిలే.... అరే! ఎంత మొద్దబ్బాయివి నువ్వూ! ముద్దుల పెళ్ళాం మొగుడిమీద ప్రేమ పొంగి అనురాగంతో హత్తుకుంటే గొప్ప అనుభూతినీ, అనుభవాన్నీ పంచుకోవడం పోయీ, ఆ దరిద్రపు తాళంచెవి పోయింది మొర్రో అని పాత రికార్డు వేస్తావా? నీకంటే అందగాడూ, నీ కంటే మందమతీ యావత్ ప్రపంచంలో ఎవడూ ఉండడండోయ్!" అంటూ ఆవేశంతో తిట్టేశాను.

మెరుపూ, ఉరుమూ లేకుండా పడిన పిడుక్కు ఝడుసుకున్నాడులా ఉంది. అయోమయంగా ఓ వెర్రి చూపు చూసీ చార్లీ చాప్లిన్ నవ్వుని పెదాలపై బిగించేడు. అర్జెంటుగా మావారి గుండెల్లో బాకు దించాలని వచ్చిన ఏ రాక్షస శత్రువు అయినా ఆ నవ్వుని చూసేక పదిమీటర్ల దూరానికి బాకును విసిరేసి మావార్ని గుండెకు హత్తుకోవాల్సిందే! సరిగ్గా ఆ పనే చేసేన్నేను. అయితే నా గుండె తడి ఇంకా ఆరనన్నా లేదు. "కృష్ణప్రియా! స్టౌ మీద పాలు ఇగిరిపోతున్నాయి. మరి కాఫీకి ఇబ్బంది అవుతుంది!" అంటూనే కౌగిట్లోంచి విదిలించుకొని తొలిగేడు. "హూఁ పాలా? ఏం పాలూ? దరిద్రం పాలూ! ఇగిరి పోతేనేం! పాలపొడితో కాఫీ తాక్కూడదా? మళ్ళీ ఇట్లాంటి మధుర క్షణాలూ.." అంటూ దులిపేయాలనిపించింది. అయితే, ఆయన చార్లీచాప్లిన్ నవ్వు నవ్వుతాడని జ్ఞాపకానికి వచ్చి తలపట్టుకుని పక్కనే ఉన్న స్టూలుపై కూచున్నాను. ఆయన నెమ్మదిగా కాచిన పాలను దించి స్ట్రాంగు కాఫీ చేశాడు. అందాకా కొరకొర చూస్తున్న నా చూపుల్ని ఏమాత్రం గమనించకుండా కాఫీ కప్పుని నా చేతికి అందించి, పక్కనే ఉన్న బియ్యం మూటపై కూచున్నాడు. కాఫీ తాగుతూ పుల్కూ పుల్కూ చూస్తున్నాడు – గాల్లోకి.

"తాళంచెవిని గురించేనా మహానుభావా!" ఆలోచిస్తోంది – పోయిందేమో పోయింది. ఇంతకు మునుపూ ఇలాగే రెండు నెలలు ఇబ్బంది పడ్డాం. అందుకే ఇప్పుడే బజారుకు పోయి డూప్లికేట్ కీ చేయించుకు రండీ!" అన్నాను.

"ఇప్పుడెవరుంటారు ప్రియా! నేను బజార్లోకి వెళ్ళేటప్పటికి తాళాలు రిపేరీ వాడు కొట్టు మూసేసి పోయి ఉంటాడు – రేపు చూద్దాంలే" అన్నాడు నిబ్బరంగా.

ఆయన అంత నిబ్బరంగా 'రేపు చూద్దాంలే' అన్నాడంటే మళ్ళీ రెండు నెలలు ఇద్దరం ఒంటితాళం చెవితో అవస్థ పడాల్సిందే నన్న మాట! కానున్నది కాకమానదు. ఆయన ఎంత సాధుస్వభావో అంత బద్ధకస్తుడు మరి!

తులసికోటను గురించి చెప్పేముందు మా ఇంటిని వర్ణించాల్సిందే వాస్తు శాస్త్రజ్ఞుడెవడైనా మా ఇంటికి ఎప్పుడూ రాలేదు కానీ, వచ్చుంటే మటుకు తప్పకుండా ఎడాపెడా గుండెలు బాదుకునేవాడు - వాస్తు శాస్త్ర ప్రకారం ఇల్లుకట్టలేదని కాదు, అలా కట్టేందుకు ఏ మాత్రం వీలులేదేమా! అని. మామూలు సగటు ఇంటికి ఉండాల్సిన లక్షణాలేవీ మా ఇంటికి లేవు. పెరడు లేదు. కాంపౌండు అసలు లేదు. వెంటిలేటర్లు లేవు. పెద్ద పెద్ద కిటికీలు లేవు. చలికాలం తప్పా తక్కిన కాలాల్లో మనుషుల మాట అటు ఉంచి దోమలు కూడా ఉండలేవు ఇంట్లో. కొంత ఇరుగ్గా ఉన్న రోడ్డుకు అటూ ఇటూ వరసగా ఉంటున్న అంటు మిద్దెల్లో మా ఇల్లూ ఒకటి. దానికి పెరడు లేకపోయినా, కాంపౌండు లేకపోయినా మా ఇల్లు గలవాళ్ళు తులసి కోట ఉండటం చాలా అవసరం అని భావించినట్టుంది, అందుకే దాన్ని వరండాలోని గోడకి బయటి వైపు ఆరడుగుల ఎత్తులో ఒకబండపై అమర్చారు. ఆ తులసికోటే ప్రస్తుతం మా పాలిట అదృష్టం అన్నమాట. ఆర్నెల్ల క్రితం ఇప్పటిలాగే మావారు తాళం చెవిని ఎక్కడో పారేసుకొస్తే జమ్మిచెట్టుమీద పాండవులు అస్త్రాలు ఉంచినట్టు ఉన్న ఒకే తాళం చెవినీ, మా ఇద్దరికీ అందుబాటులో ఉండేలా తులసి కోటలో భద్రపరిచేవాళ్ళం.

ఇప్పుడు మళ్ళీ తులసి కోటే గతి!

ఉదయం తొమ్మిది గంటలవుతోంది. నేను ఆయనకు క్యారియర్ కడుతున్నాను. ఆయన స్కూలు కెళ్ళేందుకు తయారు అవుతున్నాడు.

"ప్రియా! నువ్వు తాళం చెవిని ముందులాగే తులసికోటలో పెట్టేసి పోవే! సాయంత్రం నేను త్వరగా వచ్చి, డూప్లికేటు కీ చేయించుకు వస్తాను" బయటి గదిలోంచి నాకు వినబడాలని గట్టిగానే చెబుతున్నాడు.

ఏమిటీ మనిషీ! గొబ్బెమ్మల్ని ముగ్గులో పెట్టెయ్యవే అన్నంత సామాన్యంగా చెబుతున్నాడు! ఈ మనిషికి గుట్టు ఏదో, రట్టు ఏదో కూడా తెలీదు. మనం తాళంచెవి ఎక్కడ ఉంచుతున్నది వీధంతా తెలిసిపోవాలా? అని కోపం వచ్చింది నాకు. పిలిచి తిడదామనిపించింది. తిట్టానంటే ఇక అంతే - చార్లీ చాప్లిన్' నవ్వు. ఆయన నవ్వడం, నా గుండె కరిగిపోవడం. ఇవన్నీ విధి నిర్వహణకు వెళ్ళేటప్పుడు అంత మంచిది కాదని మానుకున్నాను. క్యారియర్ని తీసుకుని బయటిగదిలోకి వస్తూ నా కోపాన్ని మందహాసంలోకి అనువదించి చూశాను ఆయనవేపు.

"ఏం ప్రియా?" అన్నాడు పాతాళభైరవి సినిమాలోని ఎన్.టి.ఆర్.లా చిర్నవ్వు నవ్వుతూ -

"అబ్బే - ఏం లేదు ప్రియతమా! ఇందాకా తాళం చెవిని నేను ఎక్కడ పెట్టాలా అన్న విషయం అంత గట్టిగా చెప్పారూ, అది...మనిద్దరికీ సంబంధించినదా లేకుంటే ఊరందరికీ సంబంధించిందనుకుంటున్నారా?"

"సారీ ప్రియా!" అంటూ క్యారియర్ అందుకున్నాడు. మొదటిప్రయత్నంలోనే ఆయనకు అర్థమయ్యేలా చెప్పగలిగిన ఆనందంతో – "దేరీజ్ నో లారీ టు క్యారీ యువర్ సారీ టు బళ్ళారి!" అన్నాను.

"కృష్ణ ప్రియా! నాదో చిన్న రిక్వెస్టు నేను 'సారీ' చెప్పినప్పుడల్లా ఆ ఆంగ్ల వాక్యాన్ని వాడేసి సెంచరీలు కొట్టిస్తున్నావు కొత్తదేమైనా వాడవోయ్!" అంటూ సీరియస్‌గా మొహం పెట్టి అర్థిస్తున్నట్టు అభినయిస్తుంటే ఫక్కున నవ్వేసేను. 'అమ్మో ఈ మనిషిలో సెన్సాఫ్ హ్యూమర్ కూడా ఉందండోయ్!' అనిపించింది.

ఆయనేమో స్కూలుకు వెళ్ళిపోయినాడు. గంట పదీ పదిహేను అవుతూ ఉంది. ఇంక నేను ఆఫీసుకు బయల్దేరాల్సి ఉంది. అలా ఓ సారి వీధిలోకి దృష్టి సారించాను. అక్కడక్కడా కొంతమంది ఆడవాళ్ళూ, పిల్లలూ, ముసలివాళ్ళూ, కనిపించారు. కొంధరు మాట్లాడుతూ, కొందరు ఏవో ఇంటి పనులు చేసుకుంటూ ఉన్నారు.

ఇక నేను చేయాల్సినదల్లా ఇంటికి తాళం వేసి అప్పటికే సిద్ధంగా ఉంచుకున్న పాత ప్లాస్టిక్ చెంబులోని నీళ్ళని సగం తులసికోటలోకి పోయడం, పాదిలో నీళ్ళు ఎంతవరకూ ఉన్నాయో తడిమే నెపంతో తులసికోటలోకి తాళం చెవిని జారవిడువడం! తులసికోటలోకి నీళ్ళు పోయడం ఎంత ముఖ్యమో దాన్ని మొక్కుకోవడం అంతే ముఖ్యం కాబట్టి గొప్ప భక్తి ప్రదర్శిస్తూ ఒకటిన్నర నిమిషం మొక్కుకోవడం. బయట చూసేవాళ్ళు మనల్ని పసిగట్టకుండా నన్నమాట ఒకటిన్నర నిమిషం మొక్కూ – తాళం చెవి తీసుకోవాల్సి వచ్చినపుడు ప్లాస్టిక్ చెంబులో మిగిలివున్న నీళ్ళనిపోస్తూ. నీటిమట్టం చూస్తూ తాళం చెవిని తీసేసుకోవడం. అయితే మొక్కును మరవకూడదు.

ఏమైతేనేం తాళం చెవిని దిగ్విజయంగా తులసికోటలోకి జారవిడిచి ఏ మెరుగని దానికి మల్లే ఆఫీసుకి బయల్దేరాను.



గొప్ప 'బద్ధకిస్టు' గా మరోసారి రుజువు చేసుకోడానికేమో ఆయన డూప్లికేటు తాళం చేయించనేలేదు. రేపూ, మాపూ అంటూ వాయిదాలు పెడుతూనే వున్నాడు. ఏమన్నా అన్నానా? చాప్లిన్ నవ్వొకటి ఉందిగా.. నా గుండె కరిగి నీరవుతుంది. ఏం చేద్దాం?

ఓరోజు మధ్యాహ్నం ఆఫీసులో టైపు చేసుకుంటూ ఉండగా నాకు టెలిగ్రాం వచ్చింది. ధర్మవరంనించీ అన్నయ్య ఇచ్చిన టెలిగ్రాం అది. అందులో 'నువ్వూ బావా వెంటనే బయల్దేరి వచ్చేయండి ఇక్కడికి. చెల్లాయికి పెళ్ళిచూపులు. హిందూపురం వారు వస్తున్నారు. ఈ సాయంత్రమే" అని ఉంది. నేను ఆ పూటకి సెలవు పెట్టేసి మావారి కోసం స్కూలుకు వెళ్ళాను. ఆయనకు విషయం చెప్పాను. "నువ్వెళ్ళు ప్రియా! నేను సాయంత్రంకల్లా ధర్మవరం చేరుకుంటాను" అని హామీ ఇచ్చేడు. నేనేమో ఆత్రంగా ధర్మవరం చేరుకున్నాను. పెళ్ళి చూపుల సమయానికి ఆయనా వచ్చేశేడు. "తాళంచెవీ అక్కడే ఉందా? ఇంటికెళ్ళి తాళం చెవి తేకూడదా?" అన్నాను. "స్కూలు నించీ ఇలాగే వచ్చేశేను" అన్నాడు. ఊరు విడిచి వచ్చాక తాళం చెవి దగ్గరలేకపోవడం నాకెలాగో ఉంది.

"తులశమ్మ తల్లీ! ఇంటికేమీ ప్రమాదం కలక్కుండా కాపాడు తల్లీ! అంటూ మనసులోనే మొక్కుకున్నాను. అయినా మనసు నెమ్మది కాలేదు. మా ఇంటి చుట్టు పక్కల వాళ్ళు అంతమంచివాళ్ళు కాదని ఎందుకో అనిపిస్తోంది. మేం ఇంట్లో లేనిది చూసి ఇంటిని దోచుకుపోతారేమో! ఏమో చెప్పలేం. నా అనుమానానికి సరయిన కారణం ఏదీ లేదని తెలుసు. తాళం చెవి దగ్గర లేకపోయినందువల్లనే నాకట్లా అనిపిస్తోందా? ఏమో! రాత్రి పదుకోబోయే ముందు ఆయనతో ఈ మాటే అన్నాను. "ఛ! ఊరికే ఇరుగూ పొరుగూ వాళ్ళని అనుమానించకు. మన ఇంట్లో ఏమున్నాయి విలువ వస్తువులూ? ఏదో టీవీ, టూ ఇన్ వన్ , టేప్‌రికార్డర్, బీరువాలో రవ్వలనెక్లెసూ, వాషింగ్ మిషనూ...ఇంతే కదా?" అన్నాడు ఆవులిస్తూ. అంటే ఇవి చాలవా దొంగతనం చేయడానికి. బంగారు బిస్కట్లూ వజ్రాల ఆభరణాలు ఉండాలి" అని దులిపేద్దా మనుకుని, మానుకున్నా. ఎంచేతంటే ఆయన చాప్లిన్ నవ్వు నవ్వుట, నా గుండె కరగుట వగైరా వగైరా గుర్తొచ్చిందన్నమాట!

ఆ మరుసటి రోజు ఉదయం ఇంట్లో అందరూ ఉండమన్నా వినకుండా ఇద్దరం అనంతపురానికి బయల్దేరాం. ఏడు గంటలు అవుతున్నట్టే ఊరు చేరుకున్నాం. కూరగాయలు తెచ్చేందుకు మా వారు బస్టాండునుంచి లాగే మార్కెట్‌కు వెళ్ళారు. నేను ఒంటరిగా ఇంటిదారిపట్టాను.

మా ఇంటిని సమీపిస్తుండగా అల్లంత దూరంలో నుంచే మా ఇంటి తలుపులు బార్లా తీసి ఉన్నట్టు కనిపించింది. నా గుండెలు గుభేల్మన్నాయి. ఇంకేముంది దొంగలు పడ్డారు. నగలూ, బట్టలూ, పాత్రలూ, టీవీ, టేప్‌రికార్డరూ ఒక్కటీ వుండవు. మొహం చెమట్లు పట్టేసింది. నా కాళ్ళలో వణుకువచ్చీ చచ్చుపడిపోయినట్టు నడిచేందుకు వీలుపడడం లేదు. అడుగులు తడబడుతూ ఉన్నాయి. చుట్టుపక్కల వాళ్ళు నావైపు చూస్తూ ఉన్నా, వాళ్లని అడగడానికి నోరు పెగలడం లేదు. గబా గబా గడపదాటాను.

వాకిటికి ఎదురుగా ఈజీ ఛెయిర్లో పేపరు చదువుతూ మా మరిది ఆనందరావు కనిపించాడు. నన్ను చూడగానే దిగ్గున ఆశ్చర్యంగా నవ్వుతూ ఈజీ ఛైర్లోంచి లేస్తూ "అన్నయ్యేడి వదినా?' అంటూ కుశల ప్రశ్నలు వేస్తున్నాడు. నేను ఒక్క ప్రశ్నకు కూడా సమాధానమివ్వడం లేదు. నాకళ్లని నేను నమ్మలేకపోతున్నాను. ఢిల్లీ నుంచి ఎప్పుడు వచ్చాడు ఆనందరావు? ఇప్పుడు ఇంట్లోకెలా వచ్చాడు? అని ఆలోచిస్తూ ఉన్నాను.

"నువ్వు వచ్చేటప్పటికి తలుపు బార్లా తెరిచి ఉందాయ్యా?" అడిగేను ఆనందరావుని.

"ఎందుకొదినా! అలా అడుగుతున్నావు? నేనే తీశాను తలుపుల్ని"

"మరి తాళం చెవీ?"

"తులసి కోటలో వదినా!"

"అс....అది అక్కడ ఉన్నదని నీకెలా తెలుసు?"

"ఎలాగంటే ఏం లేదు వదినా! నిజానికి నాకేం తెలీదు. తెల్లవారే ఇక్కడికి వచ్చాను. మీరిద్దరూ ఎక్కడికి వెళ్ళారో ఈ చుట్టుపక్కల వాళ్ళెవరూ చెప్పలేకపోయారు.

ఏ లాడ్జింగుకయినా వెళ్దామా అని ఆలోచిస్తూ ఉండగా.... 'ఇంట్లోకి వెళ్తారా?' అని అడిగారు  ఇరుగుపొరుగు వాళ్లు."

"ఎవరూ?"

"ఒకరేమిటి, ఎదురింటాళ్ళూ, పక్కింటాళ్లూ... సరేనన్నాను. 'ఆ తులసికోటలో తాళం చెవి ఉంటుంది. మొక్కి మరీ తీసుకోండి'  అన్నారు. నేను అలాగే తీసుకున్నాను. అయినా చుట్టుపక్కల అందరికీ తెలిసేట్లు పెట్టడం ఏం పద్ధతి వదినా?" అని అడుగుతున్నాడు మా మరిది.

మా చుట్టుపక్కల వాళ్లని దొంగలుగా అనుమానించినందుకు సిగ్గుపడ్డాను. రోజూ వాళ్ళు చూస్తూ ఉండగా తులశమ్మకు ఆపద్ధర్మ పూజలు చేస్తుండటం కళ్ళముందు మెదులుతుంటే అవాక్కయిపోయాను.

(ఆదివారం ఆంధ్రప్రభ - 4 ఫిబ్రవరి, 1996)



## రచయిత గురించి

చిలుకూరి దేవపుత్ర అనంతపురం వెలుగు ప్రాజెక్టు కార్యాలయంలో సీనియర్ సహాయకుడుగా పనిచేస్తున్నారు. ఇంతవరకు వీరివి 100 కథలు పైగా వివిధ పత్రికలలో అచ్చయ్యాయి. వీటిలో కొన్ని ఆంగ్లం, హిందీ, మరాఠీ, ఒరియా, కన్నడ భాషలలోకి అనువాదమయ్యాయి. 'ఆరుగ్లాసులు', 'ఏకాకి నౌక చప్పుడు' పేర్లతో రెండు కథా సంకలనాలు వెలువడ్డాయి.

'అద్దంలో చందమామ', 'చీకటిపూలు' నవలలు 'స్వాతి మంత్లీ'లో అనుబంధ నవలలుగా వచ్చాయి. 'కక్షశిల' నవల అక్టోబరు 2003 'చతుర' మాస పత్రికలో వచ్చింది.

'పంచమం' నవలను, 'బందీ' కథను, అనంతపురం శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం వారు ఎం.ఏ. (తెలుగు) ఫైనలియర్ విద్యార్థులకు 2000-01 సిలబస్ లో ఉంచారు.

పొందిన అవార్డులు, అందుకున్న సత్కారాలు :

1990లో 'ఆరు గ్లాసులు' పుస్తకానికి - 'నూతలపాటి సాహితీ సత్కారం',

1996లో 'ఏకాకి నౌక చప్పుడు' పుస్తకానికి 'హిమబిందు అవార్డు',

1996లో 'పంచమం' నవలకు అమెరికా తెలుగు అసోసియేషన్ (ఆటా) వారి తృతీయ బహుమతి మరియు హైదరాబాదు-'ఉందేల సాహితీ సత్కారం',

2000లో వీరి నవలా సాహిత్యానికి శ్రీ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం 'ధర్మనిధి పురస్కారం',

2001లో విజయనగరం 'చాసో స్ఫూర్తి సాహితీ పురస్కారం',

2003లో 'విశాలాంధ్ర ప్రచురణాలయం వారి స్వర్ణోత్సవ సాహితీ పురస్కారం'.

***